


# రాష్ట్ర ముఖ్యమంత్రితో మీరు మాట్లాడాలా? మీ కోసం ఒక వేదిక ఉంది. అదే... "ప్రజలతో ముఖ్యమంత్రి"

రాష్ట్రవ్యాప్తంగా నిరాటంకంగా కొనసాగుతున్న "ప్రజలతో ముఖ్యమంత్రి" కార్యక్రమం ఎన్నో సామాజిక సమస్యలను పరిష్కరించింది. 1997 ఏప్రిల్‌లో ప్రారంభమైన ఈ కార్యక్రమంలో ఎంతోమంది ప్రజలు స్వయంగా ముఖ్యమంత్రితో టెలిఫోన్‌లో మాట్లాడి సమస్యలను పరిష్కరించుకోవడం విశేషం. ఈ వినూత్న కార్యక్రమంలో ప్రజలు విలువైన సమయాన్ని వివేకవంతంగా వినియోగించుకోవాలి. సామాజిక సమస్యలతో పాటు, అభివృద్ధి పథకాలపై ప్రశ్నలు అడగాలి. పరిష్కారాన్ని అందుకోవాలి.

## ఒక ప్రత్యేక అంశం మీ అందరి కోసం దూరదర్శన్‌లో ప్రతి సోమవారం సా॥ గం.6.25 ని.లకు

### ఆలస్యమెందుకు...?

ఈ క్రింద టెలిఫోన్ నెంబర్లకు డయల్ చేయండి.

హైదరాబాద్ నుంచి : 23453229, 23453230

రాష్ట్రంలోని ఇతర ప్రాంతాల నుంచి : (040) 23453229, 23453230, 23453231, 98480-54343

**ప్రకటించిన అంశంపై ప్రశ్నలు అడగండి - పరిష్కారం పొందండి.**

జారీచేయువారు : సంచాలకులు, సమాచార, పౌర సంబంధాల శాఖ, హైదరాబాద్.

హాసం
హాస్య-సంగీత పత్రిక

# ఇవీ సంగతులు

50

**Also available on net:**
**www.haasam.com**

**ముఖచిత్రం**
'శివమణి' లో
అశిన్, నాగార్జున అక్కినేని



## హాస్యం


**సీరియల్స్:**
ఎలుక వచ్చే ఇల్లు భద్రం
-ఇలపావులూరి మురళీమోహనరావు 46
అంతేరా... బామ్మర్దీ
-ఆదివిష్ణు 58

**కథ:**
ఉన్నది కాస్తాపోయింది-
సర్వ మంగళం పాడింది
-తాళాభక్తుల లక్ష్మీప్రసాద్ 6

**క్లాసిక్స్ రీటోల్డ్:**
కవుల ఆవేదన
-ఆచార్య తిరుమల 18

**బాపూరమణీయం:**
మిస్టర్‌పెళ్ళాం (వెండితెర నవల)
-ఇలపావులూరి మురళీమోహనరావు 14

**శీర్షికలు:**
హ్యూమర్ బాక్స్ 22
చౌ చౌ చౌరస్తా 52

**స్పెషల్స్:**
బాపూవిశ్వరూపం 24
దీపావళి కార్టూన్లు 66
అమెరికాలో సంచలనం సృష్టించిన బాలి
కార్టూన్ -జయదేవ్ 62




## సంగీతం


**సీరియల్:**
సప్తస్వరసుందరి లతా మంగేష్కర్
-పి.బి.శ్రీనివాస్ 54

**లలితం:**
తిమిరాలను ఛేదించే సమరాలే దీపాలు
-చిత్తరంజన్ 11

**పాప్‌కార్నర్:**
సోనూ నిగమ్ -వి.అరుణ సత్యవతి 41

**సినిమా:**
**ఆపాత(ట) మధురం**
శాంతినివాసం -రాజా 26

**అర్థంచేసుకుందాం-ఆస్వాదిద్దాం**
కభీ కభీ మేరే దిల్ మేఁ ఖయాల్ ఆతా హై(హిందీ)
-పి.వి. సత్యనారాయణ రాజు 31
నానుమ్ ఒరు పెణ్
(తమిళం)
-పి.ఎస్.గోపాలకృష్ణ 50

**శీర్షికలు:**
సరిగపదమని 63
సరిగపదమని-3 ఫలితాలు 64
హిందీ సినీ సంగీతంలో
మలుపులూ మజిలీలూ 13
వెన్నెలకంటి వెలుగులు 45

**కొమ్మకొమ్మకో సన్నాయి:**
ఎస్.రాజేశ్వరరావు గురించి -వేటూరి 43

**స్పెషల్:**
ఎస్.డి.బర్మన్ -మృణాళిని 28
ఎస్.డి.బర్మన్ పాటలు 30
నువ్‌విజిలేస్తే ఆంధ్రాసోడాబుడ్డి
పాట గురించి కీరవాణి 34


**'సెంటర్ స్ప్రెడ్' లో**



సినిమా పాటల పుస్తకం



**పాటల ప్రత్యేకం**


69
70
71
72
73
74
పేజీల్లో




# శ్రేయో జనవాక్యం

**4**9 వ సంచిక చూశాము. గాంధీ జయంతి సందర్భంగా "దో ఆంఖే బారాహ్ హాత్" చిత్రంలోని మంచి పాటను సాహిత్యపరంగా తెలియజేశారు, చాలా సంతోషం. ఇపుడు ఇటువంటి అరుదైన పాటలు వినాలంటే వివిధభారతి (బొంబాయి) ఎడ్రసు వార్కి పాట గురించి వ్రాసే విధానం, వారు ప్రసారం చేయటానికి పట్టే కాలము మనం వినదలుచు కున్న సమయం వేస్తారా? టెలిఫోన్ ద్వారా అడిగి పాటను ప్రసారంచేయమంటే ఎంతకాలానికి ప్రసారం చేస్తారు మొ॥ విషయాలు పత్రికాభి ముఖంగా తెలియజేయండి. అలాగే తమిళ పాటలు కోరి వినాలంటే ఆకాశవాణి వివిధభారతి (తమిళనాడు) వార్కి ఎట్లా? కార్డు ద్వారా తెలియజేయవచ్చా? మనపాఠకులు దీనిని ఉపయోగించుకుని పాటలు వినటం గాని, రికార్డు చేసుకోవటంగాని చేస్తాము. ఈ హెల్ప్ చేయండి. లతా పాట, రచయిత ప్రదీప్ గారి "ఏ మేరే వతన్‌కే లోగో" సాహిత్యం 'హాసం' ద్వారా దొరకటం అదృష్టం.

**-వి.మోహనబాబు, కృష్ణాజిల్లా**

'హాసం' పత్రికను నేను జులై 2002 నుండి ప్రతి సంచిక కొని చదువుతున్నాను. ప్రతి పేజి ఎంతో ఆసక్తికరంగా ఉంటుంది. క్రమం తప్పకుండా కొని చదవాలనిపిస్తుంది. హాస్యానికి సంగీతానికి పెద్ద పీట వేస్తున్న 'హాసం' పత్రిక యాజమాన్యానికి నాయొక్క కృతజ్ఞతలు. చిత్తరంజన్‌గారి సంగీత గీతాలు, సంగీత కళాకారుల గురించి వ్యాసాలు బాగుంటున్నవి. అలాగే నా అభిమాన సంగీత దర్శకుడు శ్రీ యం.యం.కీరవాణి గారి ఇంటర్వ్యూలు.. ఇలా ఎన్నో విషయాలు 'హాసం' పత్రిక ద్వారా ఆస్వాదించే అదృష్టం కలుగుతోంది. కొమ్మ కొమ్మకోసన్నాయి శీర్షికలో వేటూరి గారి వివరణ చాలా చక్కగా ఉంటుంది. ఆచార్య తిరుమల గారి నవ్వుటద్దాలు బాగుంది. ఒకటేమిటి ఇలా చెప్పుకుంటూ పోతే చాలా ఉంది. కొత్తగా వస్తున్నటువంటి సరిగపదమని పజిల్ బాగుం టున్నది. హిందీ సినీ రంగానికి సంబంధించినవి ఇవ్వటం ద్వారా ఉత్తర భారత సంగీతం గూర్చి తెలుస్తున్నది. ఏది ఏమైనా ప్రతి ఇంటా ఉండవలసిన పత్రిక 'హాసం' పత్రిక.

**- కాలేపల్లి కృష్ణమోహన్, మిర్యాలగూడ**

'హాసం' 16-30 సెప్టెంబరు సంచికలోని శ్రీ కర్లపాలెం హనుమంతరావు నాటిక 'బ్రహ్మానందం బ్యాంక్ కి వస్తే' నాకు బాగా నచ్చింది. రచయిత కామెడి చక్కగా రాసారు. బొమ్మలు కూడా తమాషాగా డిజైన్ చేశారు. చాలా చమత్కారాలు గల డైలాగ్స్‌లో ఈ క్రిందివి కూడా కలిపితే బావుంటుంది అన్పించి రాస్తున్నాను.

పేజీ 7 లో కుడివైపు కాలంలో 16వ లైన్ దగ్గర...

జెన్నీ: వెనక సంతకం చేయాలి

బ్రహ్మానందం: వెనకా?

జెన్నీ: అవును

బ్రహ్మానందం: మీ షర్ట్ పాడవదు?....సరే మీ రూల్స్ మీవి. మీ వీపు చూపిస్తే స్టయిల్‌గా సంతకం చేస్తాను.

జెన్నీ: నా వెనక కాదు బాబూ, చెక్కు వెనక

బ్రహ్మానందం: ఈ ముక్క ఇందాకే చెప్పచ్చుగా. కమ్యూనికేషన్ క్లియర్‌గా ఉండాలి.

జెన్నీ: ఇప్పుడర్థమైందిగా. వెనక సంతకం చేయండి.

బ్రహ్మానందం: ఎవరిది?

**-మల్లాది వెంకట కృష్ణమూర్తి, హైదరాబాద్**

'హాసం' రెండేళ్లు పూర్తి చేసుకున్నందుకు ఆనందంగా వుంది. ఈ రెండేళ్లలో మన రాష్ట్రంలో ఎంతోమంది రోగుల ఆరోగ్య పరిస్థితిలో మార్పు వచ్చే ఉంటుంది. 'హాసం' చదివిన వారెవరయినా మానసిక ప్రశాంతతను,ఆహ్లాదాన్ని పొందగలరనడంలో ఏ మాత్రం సందేహం లేదు. స్వతహాగా మంచి నాటక,గేయ, పద్యరచయిత అయిన 'వెన్నెలకంటి' సినీ రచనల్లో(ముఖ్యంగా అనువాదం) పడి తనలోని సిసలైన రచయితను బయటపెట్టే అవకాశం కలుగలేదు. అటువంటిది'హాసం' 'వెన్నెలకంటి వెలుగులు' ద్వారా వారం వారం పద్యాలు, పదాలు అందించడం వలన పాఠకులకు ఆయనలోని మరో పార్శ్వాన్ని చూసే భాగ్యం కలుగుతోంది. వేటూరి వంటి ప్రముఖ రచయిత ద్వారా ఎందరో సినీ మహానుభావుల గురించి పరిచయం చేసిన 'హాసం' ఇప్పుడు ఆయన పాటల ప్రస్థానంలోని మజిలీలను, అనుభూతు లను అందించబూనటం హర్షణీయం.

**-గాయత్రీకుమార్, చెన్నై**

నేను 'హాసం'ను చాలా ఇష్టపడతాను. ప్రతీసారీ 'హాసం' మార్కెట్లోకి వచ్చే రోజు నేను మా అంకుల్ షాపు దగ్గర కాపుకాసి మొదటి బుక్ నేనే కొంటాను. ఎందుకంటే నేను స్వతహాగా పాత సినిమాలను ఇష్టపడతాను. నాతో పాటు నా స్నేహితుడు కూడా నా కారణంగా 'హాసం' అభిమానిగా మారాడు. మీ, మా, మన 'హాసం' పత్రిక రోజు రోజుకూ పాఠకుల సంఖ్య పెంచు కుంటూ తెలుగునాట సాటిలేని పత్రికగా నిలవాలని కోరుకుంటూ...

**-బచ్చు విజయకుమార్, న్యూ వెంకోజిపాలెం**

ఎందరో మహానుభావుల గురించి ప్రచురిస్తున్న మీకు వందనాలు. ఎప్పుడు 'హాసం' వస్తుందా అని ఎదురుచూస్తూ ఉంటాను.పెళ్లి కానుక, మూగమనసులు, నిక్షిప్త చిత్రాలు ప్రచురించినందుకు చాలా సంతోషం

**-చెరుకూరి సర్వేశ్వరరావు, బూరుగుపూడి**

16-31 ఆగస్టు 2003 సంచిక సరిగపదమని-1లో ద్వితీయ విజేతగా నన్ను ఎంపికచేసి మీరు పంపిన ఆయనగానం-ఆమెకు ప్రాణం సి.డి. అందినది. అందుకు కృతజ్ఞతలు. 'హాసం' పత్రికను రెండు సంవత్సరాలనుండి రెగ్యులర్‌గా చదువు తున్నాను. కథలు, శీర్షికలు, అపాత మధురం, ప్రముఖుల నిక్షిప్త చిత్రాలు నన్ను ఎంతగానో ఆకట్టుకున్నాయి.

**-ఎం.గోపాలకృష్ణ, నరసరావుపేట**

'హాసం' 49వ సంచికలో బావు విశ్వరూపంలో ఆయన గీసిన లోగోలు చూపించారు. అదే సంచికలో "మూగ మనసులు" పాటల పేజీలో బాపుగారు ఆ చిత్రం"లోగో" లో పాత్రలను స్ఫురించేలా చూపించారు. అమ్మాయిగారికి(సావిత్రి) సంకేతంగా బంతిపువ్వు, గోపి(అక్కినేని) కి పడవ, గౌరికి(జమున)catapult (పంగలకర్ర) దానికి కట్టిన రబ్బర్ బ్యాండ్ గోదావరి అలలుగా గీసిన శ్రీ బాపు హాట్సాఫ్!

**-ఎం.వి.అప్పారావు, రాజమండ్రి.**

1-15 సెప్టెంబరు సంపాదకీయాన్ని మీరు ఒక ఆర్తితో ఒక బాధ్యతగా ఒక సత్యాన్ని చెప్పినట్లున్నది. తెలుగు భాష వాడకం గూర్చిగాని మాతృభాషకు గల గౌరవాన్ని పెంచడం గాని తదితర కార్యక్రమాలను ప్రభుత్వ సంస్థలు పట్టించుకోవటం లేదు. 'హాసం' ద్వారా మీ వంతు ధర్మంగా సందేశమిచ్చారు. అటు పాఠకులకు, ఇటు సంగీత భాషా నిర్వాహకులకు కనువిప్పు కలిగించారు.

**-సాహిత్యశ్రీ, శ్రీశైలం**

సరిగపదమని-1లో విజేతగా ఎంపికైన నాకు మీరు పంపిన 'హృదయగానం' (పి.సుశీల డబుల్ ప్యాక్) అందినది. చాలా సంతోషం. అడ్వకేట్‌గా బిజీగా ఉండటంతో ఎంతకీ లెటర్ రాయలేక పోయాను. చాలాకాలం క్రితం విజయవాడలో విశాలాంధ్ర బుక్ స్టాల్ దగ్గర కందుకూరి వీరేశలింగం గారి కొటేషన్ ఒకటి పెట్టారు. 'చిరిగిపోయిన చొక్కా అయినా తొడుక్కో గాని, మంచి పుస్తకాన్ని కొనుక్కో' అని. అది నన్ను ఎంతగానో ఆకట్టుకున్నది.'హాసం' ఆ కోవకు చెందినదే.

**-పి.వైష్ణవి, ఎన్.ఐశ్వర్య, పేరూరు**

16-30 సెప్టెంబరు సంచిక చూశాను. హృదయాహ్లాదకరంగా ఉంది. ముఖ్యంగా నవ్వుటద్దాలు పేరుతో ఆచార్య తిరుమలగారు రాసిన 'చమత్కార వ్యవహారాలు' చాలా బాగున్నాయి. 'వెన్నెలకంటి వెలుగులు' వెన్నెల వన్నెలను చిలికించినట్లుగా ఉన్నాయి. పాత సినిమా పాటల ప్రచురణ పత్రిక వైశిష్ట్యాన్ని చక్కగా చాటి చెబుతోంది. నిజమైన ఆనందాన్ని, ఆహ్లాదాన్ని అందించే పత్రిక 'హాసం' అంటే అతిశయోక్తి కాదు.

**-డా॥ రామడుగు వెంకటేశ్వర శర్మ, గుంటూరు**

సంపుటి: 3 సంచిక: 2

**16-31 అక్టోబరు 2003**

పేజీలు: 76

విడి ప్రతి : రూ. 10-00

సంవత్సర చందా: రూ. 200

విదేశాలలో (ఎయిర్‌మెయిల్): $ 50

జీవిత చందా: రూ. 2000

విదేశాలలో (ఎయిర్‌మెయిల్): $ 400

The one and only Magazine devoted to Humour & Music



# హాసం

## హాస్య-సంగీత పత్రిక

50

మేనేజింగ్ ఎడిటర్
ఎమ్బీయస్ ప్రసాద్

ఎడిటర్
రాజా

రిఫరెన్స్ కర్టసీ
డా॥ కె.వి.రావు
జె.మధుసూదన శర్మ

**HAASAM HAASYA SANGEETHA PATHRIKA**
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 2383 1388 / 5557 0215
*email:* haasammag@hotmail.com

Printed and Published by:
**K.I.Varaprasad Reddy**
On behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD - 500 018
Fax: 040-23541713

**Printed at:** Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

**Published at:** 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

**Editor: RAJA**

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eeenadu Compound
Somajiguda, Hyderabad-82

గత సంచిక 'ప్రయోజనవాక్యం'లో ప్రచురించబడిన పింగళి శ్రీనివాస్ గారి ఉత్తరం చాలా మంది పాఠకులలో ఆలోచనలు రేకెత్తించింది. అంతకుముందు సంచికలో ఓ అమ్మాయి 'కొనే స్థోమత లేకపోయినా 'హాసం' కొని చదువుతున్నాను' అంటూ రాసిన ఉత్తరం చూసి, చలించి ఆ అపరిచితురాలి పేర చందా కట్టారు శ్రీ శ్రీనివాస్.

'కొనే స్థోమత' అనే మాట ఆవేదన కలిగిస్తుంది, ఆవేశం రగిలిస్తుంది. పాఠ్య పుస్తకాలు కానీయండి, విజ్ఞాన సర్వస్వాలు కానీయండి, 'హాసం' వంటి వినోద, విజ్ఞాన పత్రికలు కానీయండి సామాన్యులకు అందుబాటులో లేకపోవడం అత్యంత విషాదకరం. స్వాతంత్ర్యం వచ్చి ఏభైయేళ్లు దాటినా యాభై శాతం మంది ప్రజలకి కూడా అక్షరాస్యతాభాగ్యం కలగని దేశం మనది.

ఆ మాటకొస్తే పాలకుల దృక్పథం ప్రపంచమంతా ఒక్కటే. ఒక రష్యన్ సామ్రాజ్ఞి ప్రజలందరినీ విద్యావంతులను చేయడమే తన తక్షణ కర్తవ్యమని సభలో గంభీరంగా ప్రకటించిందట. మర్నాడే విద్యాశాఖమంత్రి పెద్ద ప్రణాళిక వేసుకుని ఆమెకు చూపించాడట. ఆమె నవ్వుతూ అది చింపిపారేసి "పిచ్చివాడా, అదంతా నిజమనుకున్నావా, ప్రజలంతా విద్యావంతులయిన రోజున నీ పదవి నీకూ, నా పదవి నాకూ దక్కదు. వాళ్ళనలాగే ఉండనీయ్" అందిట.

మనదేశంలో కరువు బాధితుల పేర, వరద బాధితులపేర నిధులు ఖర్చవుతాయి. తెలిసి తెలిసి ఆత్మహత్యకు పాల్పడేవారి కుటుంబాలకు సానుభూతి, సహాయం అందుతుంది. తమ ప్రయోజకత్వం లేకపోయినా రైల్వే, ఆర్టీసీ వారి అప్రయోజకత్వానికి బలయిన వారి కుటుంబాలకు పరిహారం ఇవ్వబడుతుంది. బడ్జెట్ తయారీదారులు ప్రజలను జోకొట్టే టీవీలపై, కంప్యూటర్లపై, సెల్‌ఫోన్లపై సుంకాలు తగ్గిస్తారు . కానీ మేలుకొలిపే పుస్తకాల, పత్రికల విషయానికి వచ్చేసరికి మాత్రం అన్నీ అవరోధాలే! బజారులో పేపరుకు కరువు, ముద్రణ ఖర్చు తగ్గదు. తయారయిన పుస్తకాలు ప్రజలకు చేర్చాలంటే తపాలా, రవాణా ఛార్జీలు నిరంతరం పెరుగుతూనే ఉంటాయి.

ఇవన్నీ కలిసి పుస్తకాలను, పత్రికలను గగన కుసుమాలను చేస్తున్నాయి. ఒకప్పుడు అకాడమీలు తక్కువ ధరలో పురాణాలు, ప్రబంధాలూ, నిఘంటువులూ, ఎన్‌సైక్లోపీడియాలు లభ్యం చేసేవి. ఇప్పుడు కేంద్ర సాహిత్య అకాడమీ పుస్తకాలు సైతం అతి ఖరీదయిపోయాయి. ఈ పరిస్థితులను చక్కబరచడం ప్రభుత్వాల చేతిలో మాత్రమే ఉంది.

ప్రజలే పూనుకుని పఠితల సంఖ్య పెంచాలంటే శ్రీ శ్రీనివాస్ వంటి వారి సంఖ్య ఇబ్బడి ముబ్బడిగా పెరగాలి. 'హాసం' పత్రిక బహూకరించటం విద్యాదానం కాకపోవచ్చు. కాని విజ్ఞాన, వినోద దానం అని తప్పకుండా అనవచ్చును. శ్రీ శ్రీనివాస్ స్పందన 'హాసంమిత్ర' పథకం గురించి మాలో ఆలోచన రేకెత్తించింది. వందమంది చేత 'హాసం' సంవత్సర చందా కట్టించిన వారిని 'హాసం మిత్ర' పథకం తరపున సత్కరించాలన్న తలపు కలిగించింది.

'హాసం మిత్రులు' శ్రీ శ్రీనివాస్‌లా అపరిచితుల తరపున తామే చందా కట్టనవసరం లేదు, పరిచితుల చేత కూడా కట్టించవచ్చు, స్నేహం కాని, వ్యాపార బంధం కాని ఉన్నవారి పేర తామే కట్టవచ్చు. ప్రతి పదిహేను రోజుల కొకసారి వారు తమను తలచుకునేటట్లు చేయవచ్చు. త్వరలోనే ఈ పథకం గురించి పూర్తి వివరాలు ఇవ్వబడతాయి. ఒక లక్ష్యం, గమ్యం అందుకోడానికి ప్రయాణం చేసే క్రమంలో బంధుమిత్రులకు ఆహ్లాదాన్ని పంచడం 'హాసం' పాఠకులకు అభిలషణీయంగా, ఆకర్షణీయంగా ఉంటుందని మా నమ్మకం.



# ఉన్నది కాస్తా ఊడింది - సర్వమంగళం పాడింది

**- తాళాభక్తుల లక్ష్మీప్రసాద్**



ఆఫీసునుండి అప్పుడే వచ్చిన అర్భకరావుకి ఇంట్లో పకోడీలు వేగుతున్న వాసన ముక్కు పుటాలను తాకి గుండె గుభేలుమంది. ఉదయం కొని తీసుకువచ్చిన అరకేజీ మంచినూనెకు ఆయుష్షు చెల్లిపోయిందని నిశ్చయించుకొని వంటింట్లోకి వెళ్ళి చూసాడు. ఒక చేత్తో చట్రంతో పకోడీలు వేపుతూ రెండో చేత్తో పకోడీలు నోట్లో కుక్కేసుకుని నములుతూ, కూని రాగాలు తీస్తుంది ఆండాళ్ళు. ఐదు నిముషాలు గడిచినా భర్త రాకను గమనించక మేను మరచి మేతలో నిమగ్నమై పోయింది.

"ఆండాళ్ళూ" అంటూ నెమ్మదిగా పిలిచాడు భర్త.

గతుక్కుమని భర్తను చూసి "ఏమిటీ ఈ రోజు ఆఫీసు నుండి గంట ముందుగానే వచ్చేశారు" అంది ఆండాళ్ళు అస్పష్టంగా. కారణం బస్తా నిండా ఎండుగడ్డి కూరినట్టుగా ఉన్న ఆమె నోరు.

"ఏమిటే ఇది? ఈ నెల గడిచి ఇంకా పదిహేను రోజులు కాలేదు. నానా అవస్థలూ పడి అరకేజీ మంచి నూనె తీసుకు రావడం ఇది ఆరవసారి. అంటే ఇప్పటికే పకోడీల రూపంలో నాలుగు కేజీల శెనగపిండి, మూడు కేజీల మంచినూనె మంచినీళ్ళలా ఊదేసావన్నమాట. ఇది నీకు ధర్మమేనా? అప్పటికీ ప్రతిరోజూ కారప్పూస, కాజూబర్ఫీ, మొక్కజొన్న కండెలు తొక్క, తోటకూర లాంటివి ఏదో ఒకటి నీకు నైవేద్యం చెల్లిస్తూనే ఉన్నాను. అయినా తృప్తిపడక ఇంట్లో రోజూ పకోడీబండి పెట్టడం న్యాయ మేనా?" దాదాపు ఏడ్చినంతగా అనేసి కళ్ళనీళ్ళు తుడుచుకొని బెడ్‌రూంలోనికి వెళ్ళి కుర్చీలో కూలాడు అర్భకరావు.

అర్భకరావు నాన్‌స్టాప్ డైలాగులకు నోరెళ్ళబెట్టి చూస్తున్న ఆండాళ్ళు నోటిలో నుండి రెండు పకోడి ముక్కలు జారి పడ్డాయి. ఎప్పుడూ తన ముందు గట్టిగా మాటలాడలేని తన భర్త ఈ రోజు ఇంత సుదీర్ఘమైన డైలాగు చెప్పి తనను, తన తిండిని కించపరచడం, ఏడుపు ముఖం పెట్టుకొని వెళ్ళిపోవడం కించిత్ ఆశ్చర్యాన్ని కలిగించాయి ఆండాళ్ళుకి.

పెళ్ళిచూపుల్లో ఆండాళ్ళు కాస్త బొద్దుగా కనిపించినా పెళ్ళైన తర్వాత ఇంటిపని, వంటపని, భర్త సేవ మొదలగు వాటి వల్ల బాడీకి ఎక్సర్‌సైజు దొరికి నాజూగ్గా తయారవుతుందిలే అని సరిపెట్టుకొన్నాడు. అదీగాక పెళ్ళైన తర్వాత




పుల్లలాంటి మగాడైనా వళ్ళు చెయ్యక మానడు అని ఎవడో గొట్టంగాడు చెబితే అది పూర్తిగా నమ్మేసి ప్రతిరోజు అద్దంలో తనను తాను చూసుకుంటూ మూడేళ్ళు గడిపేసాడు. చాలా మార్పువచ్చింది. తనలో కాదు ఆండాళ్ళులో. బొద్దుగా ఉండేది పిప్పళ్ళ బస్తాలా తయారై మరింత మొద్దు అయిపోయింది. అర్భకరావు దర్భగడ్డిపోచలా మిగిలాడు. ఏనుగు - ఎలుక లాగ, నీమువంది -చీపురు పుల్లలాగ, బల్లి - నల్లిలాగ, బొంగరం - తాడు లాగ, ఎనిమిది - ఒకటి లాగ "చూడ ముచ్చటగా" ఉన్న ఈ జంటను చూసి నవ్వుకోని వారుండరు.

ఆండాళ్ళుకి "తిండే దైవం", "తిండి లేక నేను లేను", "తిండీ నేనూ", "తిండి కోసం", "వడ్డించుకు తిందాం రా", "తిండికి వేళాయెరా", "తిండి కథ","తిండంటే ఇదేరా", "తిండికి లోకం దాసోహం" మొదలైన సినిమాలంటే చాలా ఇష్టం.

టీవీలో వచ్చే "వంటా - పెంటా" "వర వరలు" "ఖానా బజానా" కార్యక్రమాలు, క్రమం తప్పకుండా చూస్తూ ఉంటుంది. అతివలంతా పడి చచ్చే అరవ డబ్బింగు, మెదడు రుబ్బింగు సీరియళ్ళ జోలికి అస్సలు పోదు.

ఆమె తిండికి అదుపు, ఆపు ఉండవు. వేళాపాళ, సిగ్గు, బిడియం అసలే ఉండవు. పెళ్ళైన ఈ మూడేళ్ళలో ఎనిమిది రెట్లు ఆకలి, ఎనభై కిలోల బరువు, ఏభై క్వింటాళ్ళ తిండిధ్యాస పెరిగాయి తప్ప మరే విషయంలోనూ ఒక్క మిల్లీ గ్రాము కూడా పెరగలేదు.

ఒకవైపు భార్యను కసురుకొన్నందుకు మనసులో కొంచెం బాధపడుతూ ఆలోచిస్తున్నాడు అర్భకరావు. తిండి విషయంలో ఎవరినీ హేళన చేయడం, కించపరచడం, తిండిపోతు అని ఎవరినీ అనడం లాంటివి ఎన్నడూ చేయలేదు. ఎందుకంటే బాగా తినగలగడం భగవంతుడు మనిషికిచ్చిన మహా వరమని అతని భావన. తను ఎలాగూ తినలేడు ఒక వేళ కొంచెం ఎక్కువ తిన్నాడా అజీర్ణావస్థకు గురికాక తప్పదు. పుష్టిగా తినేవాళ్లను చూస్తే పులకించిపోతూ ఉంటాడు.

ఒకరోజు కిలో తీపి ఆవకాయ తెస్తే ముక్కలన్నీ నీటిలో కడిగేసుకొని మధ్యాహ్నం టీ లోనికి బిస్కట్లు లేవని వీటిని పరపరా నమిలేసింది. ఇంకోరోజు రెండు వందల గ్రాముల బ్రూ ఇనెస్టెంట్ కాఫీపొడి తెస్తే ఆ కాఫీపొడిని పళ్ళెంలో పోసి అందులో పంచదార కలుపుకొని ఎంచగ్గా కాఫీ బైట్‌లు చేసుకొని చప్పరించేసింది. ఇవన్నీ చచ్చినట్టు భరిస్తూనే ఒక ఆదివారం హోటల్‌కి తీసుకెళ్ళాడు భార్యను. ఒక్కొక్క ఐటమ్‌నూ ఆండాళ్ళు అపర బకాసురిలా లాగించేస్తుంటే, ఆ భయంకర దృశ్యాన్ని కళ్ళారా చూసిన సర్వర్ వామ్మో అని గావు కేకపెట్టి గుండెపోటుతో నేల కూలాడు. ఆ కేకకు కౌంటర్‌లోని క్యాషియర్‌తో సహా అందరూ అదిరిపడి సర్వర్ చుట్టూచేరి సర్వోపచారాలూ చేస్తున్నారు.

క్షణంలో అర్భకరావుకి స్పార్క్ లాంటి థాటొచ్చింది. వెంటనే లేచి ఆండాళ్ళు చేయిపట్టుకొని "పద ఇంక ఇంటికెళ్దాం" అన్నాడు.

""ఏమండీ మరి ఇంటికి పార్సెలు?" అంది.

"పార్సెలూ లేదు, పాడూ లేదు పదముందు" అని ఆమె చేయి పట్టుకొని బర బరా లాక్కొనిపోయి, ఆటోలో ఇంటికి వెళ్ళిపోయారు.

ఇంటికి వచ్చిన వెంటనే ఐస్‌క్రీమ్ ఇప్పించనందుకు అరగంట, ఇంటికి పార్సిల్ చేయించనందుకు అరగంట, టోటల్‌గా గంటసేపు క్లాసు పీకింది ఆండాళ్ళు.

హోటల్ బిల్లు చెల్లించకుండా వచ్చేసి, టోటల్‌గా నాలుగు వందల ఏభై రూపాయలు ఈ నెలలో మిగిల్చినందుకు ఆనందంతో ఉబ్బితబ్బిబ్బైపోయి, ఆండాళ్ళు పీకిన క్లాసును ఖాతరు చేయలేదు అర్భకరావు.

ఈ ఆనందకర విషయాన్ని ఇంటికొచ్చిన వెంటనే చెప్పేద్దామనుకొని నోటిదాకా వచ్చి విరమించుకున్నాడు. ఎందుకంటే ఆమె ఈ విషయం విని తిరిగి అదే ఆటోలో ఇంకొక హోటల్‌కి తీసుకెళ్ళమని తన ఐస్‌క్రీము పార్సిలు కోర్కెలు తీర్చమని వేధించుకు తింటుంది.

అర్భకరావు చాలా రోజులు ఆ హోటలున్న రోడ్‌లో నడవడం మానేసాడు.

భార్య తిండిని ఇక కంట్రోలు చెయ్యలేడు. అది మొక్క స్టేజిలో జరగవలసింది. మాను స్టేజికొచ్చేసింది. ఇప్పుడు తిండి మాను అంటే అది జరిగే పనా? ఇప్పటికే ఆండాళ్ళు క్షుద్బాధా నివారణార్థం స్వంత ఇల్లు అమ్ముకొని అద్దె ఇంట్లో ఉంటున్నారు. పిల్లల్లేరు. ఇరుగుపొరుగు వారెవ్వరూ రారు ఆమె భీకరాకారాన్ని చూసి.



ఒంటరిగా ఇంట్లో ఉండడం, రకరకాల విచిత్రమైన వంటలు వండుకొని ఆరగిస్తూండడం ఇదే ఈమె దినచర్య.

అటెండరుద్యోగం చేస్తున్న అర్భకరావు జీతంలో తొంభై శాతం ఆహార పదార్థాలకే హారతయిపోతుంది. మిగతా ఖర్చులకు అడపా, దడపా అప్పులు చేయాల్సివస్తుంది. దీనికి పరిష్కారం ఏమిటి?

''తెలివిగా, నుళువుగా డబ్బు సంపాదించడం నేర్చుకో'' అంటూ మొన్నటి హోటల్ బిల్లు మెదడును గిల్లుతోంది. "కట్టుకున్న భార్య కడుపు నింపలేని నువ్వూ ఒక మొగుడివేనా?" అంటూ మనసు రెచ్చగొడుతోంది.

అర్భకరావు పేపరు ప్రక్కనపెట్టి వెంటనే స్టోరు రూమ్‌లోనికి వెళ్ళి అటకమీద ఉన్న ఒక ఇనుప గొట్టం ఒక మూడు కాళ్ళ స్టాండ్ క్రిందికి దించి వాటి ధూళి దులుపుతున్నాడు. ఆ ఇనుప గొట్టం వాళ్ళ ముత్తాతల కాలం నాటి అతి ప్రాచీన టెలిస్కోప్. దానికి ఈ మూడుకాళ్ళ స్టాండ్‌కి బిగించాడు. ఆ రోజు రాత్రంతా మేలుకొని టెలిస్కోపుకీ, స్టాండ్‌కి పాలిష్ పెట్టి క్రొత్తదానిలా తయారుచేశాడు. దీనితో ఎలాగైనా డబ్బు సంపాదించాలి అనే దృఢ నిశ్చయాని కొచ్చేసాడు.

అంతా బాగానే ఉంది కానీ టెలిస్కోపుకి లెన్స్ లేదు. అర్భకరావు చిన్నప్పుడు వాళ్ళ మేనమామ టెలిస్కోపు కాలేజీ కని తీసుకొనివెళ్ళి తెలివిగా లెన్స్‌లను తీసేసి అమ్మేసుకొని, ఖాళీ గొట్టం కామ్‌గా తెచ్చిచ్చేసాడు అర్భకరావు తండ్రికి. బావమరిది మీద నమ్మకంతో తీసుకొని గమనించకుండా అటకమీద యధాస్థానంలో పెట్టేసారు అర్భకరావు తండ్రిగారు. ఆరు మాసాల తర్వాత ఒక చంద్ర గ్రహణం నాడు టెలిస్కోపు తీసి చూస్తే లెన్సులు లేవు. బావమరిదికి కబురు చేసి అడిగితే నాకేం తెలియదని దబాయించాడు.




బావమరిదికి నానా చీవాట్లుపెట్టి పొమ్మన్నారు.

ఈ గతమంతా గుర్తుకొచ్చి మేనమామను బూతులు తిట్టుకొని, ఎప్పుడో చచ్చిన వాడిని ఇంకెందుకులే తిట్టుకోవడం అనుకొని తిట్లు ఆపు చేసాడు.

ఈ ఖాళీ గొట్టంతోనే ఎలాగైనా డబ్బులు సంపాదించాలి అనే లక్ష్యసాధనలో నిమగ్నమైపోయాడు అర్భకరావు.

మూడు రోజులైంది. అర్భకరావు రోజూ హడావిడిగా ఆఫీసు నుండి రావడం, వెంటనే స్టోర్ రూమ్‌లో దూరి లోపల గెడపెట్టుకొని ఏదో చెయ్యడం ఏ రాత్రికో బయటకు రావడం.

భర్త ప్రవర్తన వింతగా తోచింది ఆండాళ్లుకి. ఇన్నాళ్లు రోజూ ఆఫీసు నుండి వచ్చేటప్పుడు తినడానికి ఏదో ఒక పార్సిల్ తెచ్చేవాడు. ఇప్పుడు కనీసం రెండు రూపాయల వేరుశెనక్కాయలు కూడా తీసుకురావడం లేదు. భార్యతో మాటలు కూడా తగ్గించేసాడు. ఆఫీసుకి వెళ్ళేటప్పుడు స్టోర్‌రూమ్ కీ తీసుకొని వెళ్ళిపోతున్నాడు.

ఆండాళ్ళుకి భయం పట్టుకుంది. భర్తకు పిచ్చెక్కిందనో ఏదో అయ్యిందనో కాదు ఆమె భయం. భర్త తన ఆకలిని పట్టించుకోవడం లేదని, ఇలా అయితే కొన్నాళ్ళకు తనకు నీరసం వచ్చేసి ప్రాణం పోతుందేమోనని ఆమె భయం.

ఆ రోజు 24 వ తేదీ. అర్భకరావు ఆనందంగా ఇంటికి వచ్చి కాలింగ్ బెల్ నొక్కాడు. ఆండాళ్ళు తలుపుతీసి, భర్త చేతిలో మూడడుగుల పొడవున్న ఒక చుట్టలాంటి పొట్లాలు, పాలిథిన్ కవర్‌లో మరొక పార్సిల్ చూసి లోలోపల తెగ ఆనందపడిపోయింది.

అర్భకరావు హుషారుగా "అండూ! లోపలికి పద నీకో మంచి వార్త చెబుతాను" లోపలికి నడిచాడు.

"మీరు చెప్పబోయే మంచి వార్త నాకు తెలిసిపోయిందీ" దీర్ఘం తీస్తూ అంది.

"నిజంగానా? అయితే చెప్పుకో చూద్దాం " అన్నాడు భర్త.

"మీరు తీసుకొచ్చిన పొడవాటి పార్సిల్ సెవెంటీ ఎమ్మేమ్ మసాలా దోశె. ఈ చిన్న పార్సిల్ దాని చెట్నీ, సాంబారు, మసాలా కర్రీ అహ్హహ్హా... అవును కదండీ" అంటూ విరగబడి నవ్వి ఏనుగు ఘీంకారపు ఎఫెక్ట్ క్రియేట్ చేసింది.

అర్భకరావు అదిరిపడి "నీ తిండియావ తిమ్మ సముద్రంలో కలిసిపోను" అని మనసులో తిట్టుకొని "మై డియర్ అండూ! మూడ్రోజులాగు. సెవెంటీ ఎమ్మేమ్మేంటి వన్‌ఫార్టీ 'ఎమ్మేమ్ మసాలా దోశెలు ప్రతిరోజూ తెస్తా. నీకు తినిపిస్తా" అంటూ చుట్టలాంటిది విప్పాడు.

"ఆఁ.. నిజంగానా" అంటూ భర్త నెత్తిన చిన్న మొట్టికాయ పెట్టింది చిలిపిగా. ఆ దెబ్బకు కళ్ళ నీళ్ళు తిరిగిన అర్భకరావు నెత్తి తడుముకుంటూ "ఓసి నీ సరసం సంత కెళ్ళా. ఈ స్ట్రోకు మరికాస్త స్ట్రాంగ్‌గా పడితే నవరంధ్రాల్లో నుండి రక్తం చిమ్మి శవమైపోయేవాణ్ణి కదే" అన్నాడు కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ.

అర్భకరావు విప్పిన చుట్ట ఒక క్లాత్ బేనర్ దానిమీద "టెలిస్కోపు ద్వారా అంగారక గ్రహ వీక్షణం తేది 27.8.2003, రాత్రి గం॥ 7.00 లనుండి" అని వ్రాసి ఉంది. ఆ బేనర్‌ను ఆండాళ్ళుకి చూపిస్తూ 27 వతేదిని మన డాబా మీద "స్పేస్‌షో" ఏర్పాటు చేస్తున్నాం. టిక్కెట్టు వెల పది రూపాయలు. ఇవిగో ఈ పది టిక్కెట్టు



పుస్తకాలు. మొత్తం వెయ్యి టిక్కెట్లు.'' అంటూ చిన్న పార్సిల్ అందించాడు.

ఆండాళ్ళు తెల్లబోయి చూస్తూ "మన డాబా మీద స్పేస్‌షో ఏమిటండీ, విడ్డూరంగా ఉందే" అంది.

అర్భకరావు ఆ రాత్రి భార్యతో అన్ని విషయాలు వివరంగా చెప్పి, ప్రదర్శన రోజు తీసుకోవలసిన జాగ్రత్తలు, టిక్కెట్ల అమ్మకం విషయంలో జాగ్రత్తలు అన్నీ బాగా చెప్పాడు.

ఇరవై ఏడవతేదీ ఎప్పుడొస్తుందా అని ఎదురు చూస్తొన్న అ.ఆ. లిద్దరికీ పట్టరాని ఆనందం. ఆండాళ్ళు చీకట్నే లేచి తలకు స్నానం చేసి పూజ చేసింది. అర్భకరావు కూడా స్నానం చేసి డాబా మీద దక్షిణదిక్కు మూలగా మూడు కాళ్ళ టెలీస్కోపును అమర్చి. టెలీస్కోపు ముందుకి ఎవరూ వెళ్ళడానికి వీలుకాకుండా టెలీస్కోపున డాబా చివరి వరకూ జరిపి మూడు కాళ్ళూ కదలిపోకుండా ఫిక్స్ చేశాడు. ఒక మనిషి కూర్చొని చూడటానికి వీలుగా ఒక కుర్చీ వేసాడు. క్రింద వీధి గుమ్మం దగ్గర సొరుగు ఉన్న ఒక టేబుల్, కుర్చీ వేసాడు. టిక్కెట్టు వెల పది రూపాయలు అని ఒక అట్టమీద రాసి గుమ్మానికి వేలగట్టాడు. వాకిట్లో రెండు కర్రలు పాతి బేనర్ కట్టాడు. సాయంత్రం ఆరయ్యింది. ఆండాళ్ళు గజలక్ష్మిలా ముస్తాబై టిక్కెట్టు పుస్తకాలు, ఒక క్యాష్ బేగ్ పట్టుకొని వచ్చి కుర్చీలో కూచుంది.

అప్పటికి అర్భకరావు ఇంటి నుండి వీధి చివరి వరకూ చేంతాడులా క్యూలో జనాలు నిల్చున్నారు. చీకటి పడుతోంది. డాబా మీద ఏర్పాటు చేసిన సీరియల్ సెట్ లైట్లూ, ట్యూబ్ లైట్లూ అది చేరువగా, కేవలం పది రూపాయల ఖర్చుతో చూడబోతున్నామన్న ఆనందం. టిక్కెట్ల అమ్మకం స్టార్టయింది. ఒక్కొక్కరూ డాబాపైకి వస్తున్నారు. అర్భకరావు ఒక్కొక్కరినీ కుర్చీలో కూర్చోబెట్టి ఒక్క నిముషం పాటు చూపించి వెంటనే లేపేస్తున్నాడు. ఎక్కుతున్న వారిలో ఆతృత, దిగుతున్న వారిలో గ్రహవీక్షణానందం.




రాత్రి పదయింది. వెయ్యి టిక్కెట్లూ సేలయిపోయాయి. పదివేలరూపాయలు పోగయ్యాయి. క్యాష్‌బేగ్, డ్రాయర్ సొరుగు నిండిపోయాయి. ఆండాళ్ళు ముఖంలో నవ్వు నాన్‌స్టాప్‌గా నాట్యం చేస్తోంది. ఇంకా జనాలు వచ్చేస్తున్నారు. ఆండాళ్ళు టిక్కెట్లకు బదులుగా చిన్న తెల్ల కాగితం ముక్కలు చింపి పది రూపాయలు తీసుకొని ఆ తెల్ల కాగితం ముక్క మీద సంతకం చేసి పంపిస్తోంది. రాత్రి పన్నెండయింది. మొదటి వెయ్యిమందీ కాక, మరొక రెండు వందల మంది పైగా ప్రదర్శన తిలకించారు. జనం ఇంక రావడం లేదు అనుకున్నాక అర్భకరావు డాబా దిగి వీధి ఇంట్లోకి వచ్చి బేనర్ తీసేసి తలుపు మూసేసి "మై డియర్ అండూ, టోటల్ కలెక్షన్ ఎంతోయ్!... "అంటూ ఆమె బుగ్గ మీద చిటికేసాడు. ఆమె మొత్తం క్యాష్ లెక్క పెట్టి "పన్నెండు వేల రెండు వందల ముప్ఫై రూపాయలండీ" అంటూ కీచుమని అరిచింది.

''ఏమండీ నాకు ఆనందంతో పిచ్చెక్కిపోతొందండీ బాబూ'' అంటూ క్యాష్‌బాగ్ టేబుల్ మీద పెట్టి అర్భకరావుని ఊహించని విధంగా పట్టుకొని పైకి లేపి గాల్లో గిరగిరా తిప్పుతూ ఒకటే నవ్వు నవ్వుతోంది ఆండాళ్ళు.

"ఒసి నీయమ్మ కడుపు మాడా. నన్ను మనిషను కున్నావా, వెదురు కర్రననుకున్నావా. ఆపవే... ఆపు... కళ్ళు తిరుగుతున్నాయి.... శ్వాస అందడం లేదు.. ఎగ్జిబిషన్‌లో జెయింట్ వీలులా ఏంటే ఇది... నీ దుంప తెగ... ఆపుతావా ఆపవా... రాక్షసీ... చచ్చేలా ఉన్నానే... నీ ఆనందం మండా..." అంటూ ఒక చావు కేక పెట్టేసరికి భయపడి దించేసింది.

అర్భకరావుకి పదినిముషాల వరకూ గుండె దడ తగ్గలేదు. చెంబుడు మంచినీళ్ళు త్రాగేడు.

"నీ సరసం సంతకెళ్ళా మరి కాసేపు అలా నీ సరదా తీర్చుకుంటే చచ్చూరుకొనేవాణ్ణి కదే" అన్నాడు రొప్పుతూ.

''ఈ సంతోషసమయంలో చావు మాటెందుకండీ... మీరు లేకపోతే నాకు అరిసెలు, అప్పాలు, చెక్కలు, చెరుకుముక్కలు, మొక్కజొన్న పొత్తులు, కలకండ స్వీట్‌లు, కారపు బూందీ, ఖర్జూరం, కమలాపళ్ళు...'' ఇంకా ఏదో అనబోతుంటే...

"నాశ్రాద్ధం, నా పిండాకూడు, నా బొంద... ఛీ... ఛీ.. ఎప్పుడు చూసినా తిండి, తిండి, తిండి.." అని కసురుకొంటూ కుర్చీలో కుర్చొన్నాడు.

మళ్ళీ మొగుడికి కోపం తెప్పించానన్న పశ్చాత్తాపంతో మెల్లగా మొగుడి కుర్చీ దగ్గరకు



వెళ్ళి "ఏమండీ?" అంది మెల్లగా. "ఆఁ ఏఁవిటో చెప్పు. నీ నడుంకి బంగారం వడ్డాణం చేయించాలా? అది నావల్ల కాదు. ఎందుకంటే అధమం దానికి అరకిలో బంగారమైనా ఉండాలి. ఎన్ని జన్మలెత్తినా అది జరిగే పనికాదు. నీ చిటికెన వేలికి కనీనం వెండి ఉంగరం కూడా చేయించలేను" అన్నాడు చిరాగ్గా, గుక్క తిప్పుకోకుండా.

"ఏఁవిటండీ మీరు మరీను. ఎప్పుడైనా మిమ్మల్ని నేను బంగారం కావాలని కోరానా? బంగారం కొరుక్కు తింటామా ఏంటి? అదేమన్నా చికెన్ జాయింట్లా రుచిగా ఉంటుందా?" అంది బుంగమూతి పెడుతూ అండాళ్ళు.

"చచ్చాన్రా దేవుడా! టాపిక్ మళ్ళీ తిండి మీదకు డైవర్ట్ అయ్యింది. ఈ అర్ధరాత్రి పూట పార్సిల్ తెమ్మంటుందో దీని నోరు కుట్టెయ్య" అని మనసులో తిట్టుకుని.

"అయితే ఏమిటో చెప్పుమరి" అన్నాడు ఆమె వంక చూస్తూ.

"ఏం లేదండీ సుమారు పన్నెండు వందల మంది అంగారక గ్రహాన్ని, మన టెలీస్కోపులో చూసారు కదా నేను కూడా ఒకసారి చూస్తానండీ ఆ అంగారక గ్రహాన్ని" అంది అభ్యర్థనగా.

"ఓస్ ఇంతేనా! అలాగే చూద్దువుగాని పద. కానీ నీకో విషయం చెప్పాలి" అన్నాడు రహస్యం చెబుతున్నట్టు.

"ఏమిటండీ అది" అంది క్యాష్ బాగ్‌ను చేతికి తగిలించుకుంటూ.

"ఈ రోజు ఖగోళ చరిత్రలో జరిగిన అద్భుతం కంటే మహాద్భుతం నేను చేశాను" అన్నాడు హీరోలా పోజిస్తూ.

"మీరు అద్భుతం చెయ్యడం ఏమిటండీ" కాస్త అర్థమయ్యేలా చెప్పండీ ప్లీజ్" అంది బ్రతిమాలుతూ.

"అయితే విను. నేను మన డాబా మీద సెట్ చేసినది టెలీస్కోపూ కాదు, వెర్రి, మొర్రి జనాలు చూసింది అంగారక గ్రహమూ కాదు... కేవలం నా తెలివి తేటలతో జనాన్ని బోల్తా కొట్టించి, నా జీవితంలోనూ ఎన్నడూ చూడని పన్నెండు వేల రూపాయలు ఒక్క రోజులో




సంపాదించాను" అన్నాడు కాలర్ ఎగురవేస్తూ.

"నిజంగానా?" అంది ఆండాళ్ళు హిప్పోపోటమస్‌లా నోరు తెరిచి.

"నిజమే కానీ ఆశ్చర్యాన్ని వ్యక్తం చేయడానికి అంతలా నోరు తెరవనక్కరలేదు. ఈగలూ, దోమలూ దూరి పోగలవు" అన్నాడు నవ్వుతూ.

"మరి జనాలు చూసిందేమిటి?" అంది మరింత ఆశ్చర్యంగా.

"పైకి పద చెబుతాను" అంటూ ఇద్దరూ డాబాపైకి చేరుకొన్నారు. ఇద్దరూ చెరో కుర్చీ వేసుకుని కూర్చొన్నారు.

టెలీస్కోపులో లెన్సులు మాయమైన వైనాన్ని వివరించాడు భార్యకు. "మరి ఆ ఖాళీ గొట్టంలో జనానికి ఏం చూపించారండీ బాబూ!" అంది కుతూహలంగా.

"ఆ రోజు టెలీస్కోపు అనబడే ఈ గొట్టం బూజు దులుతున్నప్పుడు థామస్ ఆల్వా ఎడిసన్ నన్నావహించాడో ఏమో గాని, మెదడులోనికి మెరుపులాంటి ఒక అయిడియా వచ్చింది. వెంటనే గొట్టంలోపలికి సరిపడే గాజు పలకను గుండ్రగా కట్ చేయించి. ఆ గాజు ముక్కకు ఒక వైపు బట్టర్ పేపరు అతికించి, రెండోవైపు మధ్యలో అంగుళం వ్యాసం గల రంధ్రం కట్ చేసిన బ్లాక్ పేపరును అతికించాను. ఈ గుండ్రని గాజు పలకను గొట్టం మధ్యలో కదలకుండా అమర్చాను. దానికి వెనుక భాగంలో కొంత దూరంలో చిన్న టార్చి బల్బు అమర్చాను. ఆ బల్బు వెలుతురు గాజు ముక్కమీద పడి బ్లాక్ పేపర్ బ్యాక్ గ్రౌండ్‌లో గుండ్రని బట్టర్ పేపరు షేపు ఒక గ్రహంలా చూసేవాళ్లకు కనిపించింది. మనకు డబ్బులు కురిపించింది చూస్కో" అంటూ భార్యని కుర్చీలో కూర్చోబెట్టి చూపించాడు.

"అబ్బా నిజంగా గ్రహంలాగానే ఉందండీ. మీ తెలివికి నా జోహార్లండీ. అంతా బాగానే ఉంది. కానీ టార్చి బల్బు బ్యాటరీ సెల్స్ చూసేవాళ్ళకి కనిపించడం లేదు. అవతలి వైపు నుండి లైటింగ్ కూడా రావడం లేదు. ఎలా ఏర్పాటు చూసారండీ బాబూ" అంటూ ఇంకా చూస్తూనే ఉంది.

"అది నీలాంటి గొర్రె జనాలకి తెలిసిపోయేలా చేస్తే నా గొప్పతనమేముంటుంది. ఆ బల్బు, బ్యాటరీలు గొట్టంలోనే అమర్చి లైటింగ్ బయటకు రాకుండా హార్లిక్స్ సీసా మూతను బిగించాను. కావాలంటే చూడు" అంటూ మూతను తియ్యబోయాడు. అది గట్టిగా బిగిసిపోయింది. అర్భకరావు పిట్టగోడలేని డాబా అంచుకి వచ్చి బలాన్నంతా ఉపయోగించి మూత లాగాడు. మూతతో పాటు అర్భకరావు పెరట్లో గచ్చుమీద దభాల్న పడ్డాడు. దబ్బుమన్న శబ్దం, చచ్చాన్రో అనే ఆర్తనాదం ఒకేసారి గట్టిగా వినపడ్డంతో ఆండాళ్ళు తృళ్ళిపడి టెలిస్కోపు వదలి గబగబా క్రిందికి దిగి పెరట్లోకి వచ్చింది. ఇరుగుపొరుగువారు కూడా వచ్చారు. తర్వాత ఇంకేముంది. అర్భకరావు నడుంకి ఆపరేషన్ జరగడం, నాలుగు నెలలు బెడ్డు జీవనం, నలభైవేలు తిరుక్షవరం.

గ్రహాలమాట ఎలా ఉన్నా అర్భకరావుకి చుక్కలు మాత్రం కనబడ్డాయి.

# లలిత సంగీతం



ప్రముఖ గాయకుడు, స్వరకర్త
లలిత సంగీత విద్వాంసుడు,
వాగ్గేయకారుడు

**ఎం.చిత్తరంజన్**

సమర్పిస్తున్న శీర్షిక ఇది.
ఫోన్ నెం. 040-27402993

## తిమిరాలను ఛేదించే సమరాలే దీపాలు

రచన
సుధామ
సంగీతం
ఎం. చిత్తరంజన్
- బృందగానం
రాగం
భాగేశ్వరి (బాగేశ్రీ)
- హిందుస్తాని రాగం
తాళం : త్రిశ్రగతి
(కర్ణాటక సంగీతం)
- దాద్రా (హిందుస్తాని సం॥)
ఆరోహణ
స గ మ ద ని స
అవరోహణ
స ని ద మ ప ద గా మ గ రి స

ప: తిమిరాలను ఛేదించే సమరాలే దీపాలు
అజ్ఞానం అనైక్యతే చీకటింటి శాపాలు
చుట్టూరా చీకటులను తిట్టుకుంటు కూర్చోకు
ప్రయత్నించి ప్రతిహృదిలో చిరుదివ్వెను వెలిగించు ॥తిమి॥

1చ: ప్రతినారీ రూపెత్తిన సత్యభామ ఆకారం
నరకాసుర సంహారం దైనందిన వ్యవహారం
సాహసమే శోకాలను తెగటార్చే ఆధారం
దీపావళి జరిగినపుడె అంతరించు భూభారం ॥తిమి॥

2చ: భిన్నత్వపు తిమిరాల్లో ఏకత్వం ఒక దీపం
నీరవ నిశ్శబ్దంలో సత్యవాక్కు ఒక దీపం
ఎదలోపలి ఎడారిలో కరుణ బిందువొక దీపం
మనుగడలో మానవతే మహిని వెలుగు ఘన దీపం ॥తిమి॥

3చ: కోపాలను తాపాలను హరియించే సమభావం
గుండె గుండె వెలిగించే స్నేహ భావనా దీపం
కాంతి శాంతి కలబోసిన క్రాంతి హేల చిద్రూపం
ఉజ్జ్వల చైతన్యమూర్తి ప్రతిమనిషీ ఒక దీపం ॥తిమి॥

## శ్రీ సుధామ

తెలుగు సాహిత్య లోకంలో కవిగా సుప్రసిద్ధులైన సుధామ అసలు పేరు అల్లంరాజు వేంకటరావు. కవిగానే కాక కార్టూనిస్టుగా, రచయితగా, సమీక్షకునిగా, కాలమిష్టుగా, వక్తగా కూడా ఆయన పేరు తెచ్చుకున్నారు. తెలుగు అభ్యుదయ కవిత్వంలో భావచిత్రాలు (ఇమేజరీ) అనే అంశంపై ఎం.ఫిల్. పరిశోధన చేసిన



సుధామ ప్రాచ్య కళాశాలలో యం.ఓ.ఎల్ చేశారు. రెండు సంవత్సరాలు కరీంనగర్ బిషప్ సాలమన్ జూనియర్ కళాశాలలో తెలుగు లెక్చరర్‌గా పనిచేసి 1978లో హైదరాబాద్ ఆకాశవాణిలో ట్రాన్స్‌మిషన్ ఎగ్జిక్యూటివ్‌గా చేరారు.

అంతవరకూ కృష్ణాపత్రిక, ప్రజామత వంటి పత్రికల్లో ఛందో బద్ధ, వచన కవితలు రచిస్తున్న సుధామ పాట రాయటం మటుకు అప్పట్లో పిల్లల కార్యక్రమాలు నిర్వహించే తురగా మొదటిసారి రేడియోలోనే. నేను, జానకీ రాణి గారూ ప్రోత్సహించగా ఆయన రాసిన

- షడ్జము, చతుశృతి రిషభం, సాధారణ గాంధారం, శుద్ధ మధ్యమం, చదుశృతి దైవతం, కైశికి నిషాదం యీ రాగంలోని స్వరాలు కాగా పంచమం అవరోహణ లో పైన తెలిపిన విధంగా అల్పముగా ప్రయోగించ బడుతుంది. ఈ రాగంలో అవరోహణ స ని ద మ గ రి స అని, స ని ద మ ప గ రి స అని కూడా వాడుకలో వున్నది. భాగేశ్వరి లేక బాగేశ్రీ అని పిలువబడే యీ రాగం హిందుస్తాని సంగీతంలో బహుళ ప్రసిద్ధిగాంచిన రాగం. పండిత్ భాత్ ఖండే యీ రాగంపై ఝప్ తాళ్‌లో రచించిన లక్షణ్ గీత్ ప్రసిద్ధమైనది.



"గావే బాగేశరీ మృదు లగత్ సుర్ 'గ' 'ని'
ఖరహరప్రియ థాట్ తీవర్ సుర్ 'ద' 'రి'
మధ్యమ్ కరే జాన్ సంవాది సుర్ మాన
పంచమ్ కరే అల్ప్ రి స ని ద ని/ సామ
గగ/ మదనిదమ/ పగరిరిస".

కర్ణాటక సంగీతంలోని ఖరహరప్రియ రాగాన్ని హిందుస్తానిలో కాఫిథాట్ అంటారు. భాగేశ్వరి లేక బాగేశ్రీ రాగంలో గ, ని స్వరాలు మృదు అనగా కోమల్ అని, ద, రి స్వరాలు తీవ్ర్ లేక శుద్ధ అని (హిందుస్తానిలో తీవ్ర స్వరాలను శుద్ధ స్వరాలని అంటారు), పంచమం అల్పంగా వినయోగించ బడుతుందని ఆలక్షణ్ గీత్‌లో వివరించారు పండిత్ భాత్ ఖండే. కర్ణాటక సంగీతంలోని శ్రీరంజని రాగం యీ రాగానికి అత్యంత చేరువైనదిగా చెప్పవచ్చు. ఆకాశవాణిలోను, చలన చిత్రాలలోను యీ రాగాన్ని లలిల సంగీతానికి ఉపయోగించి పలువురు స్వరకర్తలు సుమధుర బాణీలను మనకు అందిస్తూనే వున్నారు. భక్తి, సంభోగ, విప్రలంభ శృంగారాలకు ఎంతో అనువైన రాగమిది.

'నరకాసుర సంహారం దైనందిన వ్యవహారం' అంటూ దీపావళి సార్వకాలికమని సూచించారు కవి సుధామ. పావులను, క్రూరులను, దుష్టులను తొలగించడమే కాదు, భిన్నత్వాలను, కోపతాపాలను కూడా తొలగించి ఏకత్వం, సత్యవాక్కు, కరుణ స్నేహభావాలు అనే దీపాలను వెలిగించండని మానవులకు మహత్తర సందేశాన్ని 'తిమిరాలను ఛేదించే సమరాలే దీపాలు' అనే సుందర గీతంలో ప్రబోధించారు సుధామ. బృందగీతంగా పాడడానికి అనువైన ఈ పాటను ఆకాశవాణిలో నేను నిర్వహించిన "ఈ పాట నేర్చుకుందాం" కార్యక్రమంలో నేర్పాను.





మొదటి పాట 'బాలలం మేం ఒక్కటే' అనేది. ఆ పాట నా సంగీత సారధ్యంలో ప్రసారమై 1979 అంతర్జాతీయ బాలల సంవత్సర గీతంగా (యూనిసెఫ్ సందేశం ఆధారంగా రాసినది) ప్రఖ్యాతి పొందింది. నేటి ప్రఖ్యాత గాయకులు, స్వరకర్తలూ అయిన రామాచారి, బంటీ నాడు బాలలుగా ఆ పాట పాడారు.

ఆ తరువాత సుధామ రచించిన పాటలు ఎక్కువగా వివిధ సందర్భాలలో రేడియో, టీ.వి. కోసం రాసినవే. అందుకే రాసిలో అవి ఎక్కువ లేకున్నా వాసిలో పేరు తెచ్చుకున్నాయి. ఆయన పాటలు పి.వి. సాయిబాబా, కీ॥శే॥కృష్ణరంగం,

## భాగేశ్వరి / బాగేశ్రీ రాగం ఆధారంగా కొన్ని చిత్ర గీతాలు

| పాట | చిత్రం | గానం | స్వరకర్త |
|---|---|---|---|
| **తెలుగు** | | | |
| 1. నీకోసమే నే జీవించునది | మాయాబజార్ | ఘంటసాల, లీల | ఘంటసాల |
| 2. లోకమెరుగని బాలా | బాటసారి | భానుమతి | మాస్టర్‌వేణు |
| 3. అందాలు చిందు సీమలో | రాజనందిని | ఎ.ఎం.రాజా, జిక్కి | టి.వి.రాజు |
| 4. జనకుడు నీపై కినుక వహించి ('జీవము నీవే కదా' పాటలోని చరణం) | భక్తప్రహ్లాద | సుశీల | ఎస్.రాజేశ్వరరావు |
| 5. అలిగితివా సఖీ ప్రియా అలుక మానవా | శ్రీ కృష్ణార్జున యుద్ధం | ఘంటసాల | పెండ్యాల |
| **హిందీ** | | | |
| 1. మొహబ్బత్ హీన జోసమఝే వో జా లియే ప్యార్ క్యా జానే | పర్‌ఛాయీ(1952) | తలత్ మహమూద్ | సి.రామచంద్ర |
| 2. జాగ్ దర్దే యిష్క్ జాగీ | అనార్కలి(1953) | లత, హేమంత్ | సి.రామచంద్ర |
| 3. నా బోలే నా బోలేరే | ఆజాద్(1955) | లతా | సి.రామచంద్ర |
| 4. గిరిధారీ మైంతో చాకర్ రాఖక్ష | తూఫాన్ ఔర్ దియా(1956) | లతా | వసంత్ దేశాయ్ |

నల్లూరి సుధీర్‌కుమార్, సురేంద్రనాథ్ కాళే, ఉషాకాంత్ మొ॥ సంగీత దర్శకులందరూ స్వరపరిచారు. నా సంగీతంలో పలు పాటలే కాక 'ఒక నాటి కల' మొదలైన సంగీత రూపకాలు, సంగీత శిక్షణలో పలు గీతాలు ప్రసారమైనాయి.

సుధామ రచించిన పాటల్లో 'కృష్ణా గోపి కృష్ణా' (జ్యోతి రామకృష్ణ గానం, సుధీర్ కుమార్ స్వరకర్త), 'మనసు మురియగా మధుర గీతి పాడనా (గానం విజయలక్ష్మీ శర్మ, సంగీతం కీ॥శే॥ ఘంటసాల విజయ్‌కుమార్), 'గుప్పిటలో ఇసుకలాగ రాలిపోవు కాలం' (సంగీతం, గానం కీ॥శే॥ మల్లిక్), 'ఏకాంతం తీగె మీద విరహాశ్రువు జారింది' (సంగీతం మోహనకృష్ణ, గానం శిష్ట్లా శారదా వెంకటరమణ) ఇలా ఎన్నో గీతాలు పలువురి మన్ననలందుకున్నాయి. ప్రభాత గీతాలుగా, ఈ మాసపు పాటలుగా ప్రసారమైనాయి. 1987లో ఒక డాక్యుమెంటరీ చిత్రానికి సుధామ రాసిన పాట ఉషాకాంత్ సంగీత సారథ్యంలో మంచి గుర్తింపు పొందింది.

సాహితీ రంగంలో నిరంతరం కృషి చేస్తున్న సుధామ రాసిన 'అగ్నిసుధ' కావ్యానికి కలహంసి అవార్డు, 1991లో ఉమ్మడిసెట్టి సాహితీ అవార్డు ఆయన వచన కవితా గ్రంథానికి లభించాయి. ఆంధ్రభూమి దినపత్రికలో ఎడిట్ పేజిలో గత ఐదేళ్ళుగా సం.సా.రా.లు (సంస్కృతి, సాహిత్యం, రాజకీయాలు) కాలమ్ నిర్వహిస్తున్నారు. అలాగే 'వార్త' ఆదివారం అనుబంధంలోను, 'సంతోషం' సినిమా పత్రికలోను పదబంధ ప్రహేళికలు, కుముదం 'భక్తి' మాసపత్రికలో బాలలకు శీర్షిక నిర్వహిస్తున్నారు. 'సితార' సినీ పత్రికలో సినిమా సమీక్షలు, పజిల్సు, సినీ టాక్, సినీమానిసి వంటి శీర్షికలతో వ్యాసాలు వ్రాశారు. నా ముందు మాటతో తన పాటల పుస్తకం త్వరలో వెలువరించాలని అభిలషిస్తున్న సుప్రసిద్ధ కవి సుధామ అలుపెరుగని నిరంతర సాహితీ కృషీవలుడు. ఆకాశవాణికి ఆయన ఒక asset. ఆయన చేస్తున్న సాహిత్య సేవ బహుధా ప్రశంసనీయం, ఆయన సహధర్మచారిణి శ్రీమతి ఉషారాణి నా కత్యంత ఆప్తులు. ●

---

# హిందీ సినీ సంగీతంలో మలుపులు-మజిలీలు

## 1959

అనాడీ, కన్హయ్యా, మై నషే మై హూఁ, (ఈ మూడిటిలోనూ హీరో రాజ్‌కపూర్) షరారత్, ఉజాలా, ఛోటీ బహన్ (తెలుగులో - నా చెల్లెలు, ఆడపడుచు), లవ్ మ్యారేజ్ చిత్రాల ద్వారా శంకర్-జైకిషన్‌లు మంచి గుర్తింపు సాధించమే కాక హస్రత్ జైపురి, శైలేంద్రలతో వీరి అనుబంధం గట్టి పడటానికి కారణమయ్యాయి.



'అనాడీ' (తెలుగులో 'అమాయకుడు')చిత్రంలో రాజ్ కపూర్, నూతన్

అనాడీ చిత్రంలోని 'సబ్ కుచ్ సీఖా హమ్‌నే', 'బన్కే పంఛీ', 'కిసీ కే ముస్కురాహటోంఁ పే హో నిస్సార్', 'వో చాంద్ ఖిలా', 'దిల్ కి నేజర్ సే', 'తేరా జానా దిల్ కే అర్మానోం కా' పాటలు పెద్ద హిట్.

'రుక్ జా ఏ జానేవాలే', 'ముఝే తుమ్‌సే కుచ్ భి న చాహియే', 'ని బలియే రుత్ హై బహార్ కి', 'యాద్ ఆయి కల్ రాత్ కో'(కన్హయ్యా) 'మై నషే మైహూ' టైటిల్ ట్రాక్,హిట్ కావడంతో బాటు గాలిబ్ కవిత 'హే న థీ హామారి కిస్మత్' ను ఉషా మంగేష్కర్ ఈ సినిమాలో ఆలపించి తన కెరియర్‌లో మొదటి సోలో హిట్ పాట గా చేసుకున్నారు.



ఉషా మంగేష్కర్

ఓ సూపర్ స్టార్‌గా గుర్తింపు పొందిన నటునితో హిట్ చిత్రాల సంగీత దర్శకుని అనుబంధం ఏర్పడటం 'ఉజాలా' చిత్రంతోనే ప్రారంభమైందని చెప్పవచ్చు. రాజ్‌కపూర్ సోదరుడు షమ్మీకపూర్‌తో శంకర్- జైకిషన్‌ల అనుబంధం ఏర్పడింది ఈ చిత్రంతోనే. అయితే ఈ చిత్రంలో మన్నాదే, ముఖేష్‌లు షమ్మీకి పాడితే 'రాజ్‌కుమార్...' అనే ఒక్క పాటకు మాత్రమే రఫీ పాడటం జరిగింది. ఈ పాట మంచి హిట్ కావటమే కాక అదే చిత్రంలో మన్నాదే పాడిన 'ఝూమ్‌తా మౌసమ్ మస్త్ మహీనా', (తెలుగులో రాధ రావే రాణి రావే (శాంతినివాసం) 'అబ్ కహాఁ జాయే హమ్', 'దునియా వాలోం సే దూర్'(ముఖేష్), 'తేరా జల్వా జిస్‌నే దేఖా', 'మోరే నాదాన్ బల్‌మా(లతా)పాటలు హిట్ అయ్యాయి.



నటగాయకుడు కిశోర్‌కు రఫీ నేపథ్యం అందించిన చిత్రం 'శరారత్'లో ఓ హాస్యదృశ్యం

'భయ్యా మేరే', 'జావూఁ కహాఁ బతా యే దిల్', 'మేఁ రంగీలా ప్యార్ కా రాహి'(ఛోటే బహన్), 'కహే ఝూమ్ ఝూమ్ రాత్ యే సుహానీ','ధీరే ధీరే ఛల్'(లవ్ మ్యారేజ్) హిట్ అయ్యాయి. షరారత్ చిత్రనిర్మాణం టైములో కిశోర్ బిజీగా ఉండడంతో అతనికి 'అజబ్ హై దాస్తాన్ తేరి యే జిందగీ' పాటకోసం రఫీ చే ప్లేబాక్ పాడించారు శంకర్-జైకిషన్‌లు. అదే చిత్రంలో కిశోర్ పాడిన 'హమ్మత్ వాలే నౌ జవాన్' పాట కూడా పెద్ద హిట్ అయింది.

లతా తో వివాదం రావడంతో గత ఏడాదిగా ఆమె చేత పాటలు పాడించకుండా ఆశాభోంస్లే, గీతాదత్‌ల చేత పాడిస్తున్న దాదా బర్మన్ ఈ ఏడాది అందించిన హిట్స్ - 'చాంద్‌సా ముఖ్‌డా క్యోఁ షర్మాయే', 'జాను జాను రే'(ఇన్‌సాన్ జాగ్ ఉఠా), 'వక్త్‌నే కియా క్యా హసీఁ సితమ్', 'బిఛడే సభి బారి బారి'(కాగజ్ కే ఫూల్), 'బచపన్ కే దిన్ భి క్యా దిన్ థే', 'జల్తే హై జిస్ కేలియే', 'తుమ్ జియో హజారోఁ సాల్', 'కాలి ఘటా ఛాయే' (సుజాతా) పాటలు మంచి హిట్స్. సుజాతా చిత్రంలోనే దాదా బర్మన్ పాడిన 'సున్ మేరే బందూ రే' పాట కూడా హిట్ అయింది



తెలుగులో 'కాలం మారింది' గా పునర్నిర్మింపబడిన సామాజిక చిత్రం 'సుజాతా' లో నూతన్, శశికళ,

రాణి రూప్‌మతి చిత్రంలో ముఖేష్ పాడిన 'ఆ లౌట్ కే ఆజా మేరే మీత్' పాట ద్వారా ఎస్.ఎన్.త్రిపాఠి సూపర్ హిట్ కొట్టారు. కవి కాళిదాస్ చిత్రంలో లతా, రఫీ గానం చేసిన 'ప్రీత్ కే బంధన్ మే...ఉన్ పర్ కౌన్ కరే విశ్వాస్...'పాట కూడా ఆయనకు మంచిపేరు తెచ్చింది.

వసంత్‌దేశాయ్ విషయంలో అర్ధాంగిని చిత్రంలో 'తేరా ఖత్ లేకే సనమ్' పాట ఒక్కటే గుర్తుంచు కోదగ్గది



సంగీత భరిత చిత్రం 'గూంజ్ ఉఠీ షహనాయ్' లో రాజేంద్రకుమార్, అమితా

కానీ 'గూంజ్ ఉఠీ షహ నాయి' చిత్రంలో అన్ని పాటలూ హిట్సే! 'దిల్ కా ఖిలౌనా', 'తేరే సుర్ ఔర్ మేరే గీత్', 'కహ్ దో కోయీ న కరే యహాఁ ప్యార్' గీతాలను ఎవరు మరచిపోగలరు!?

-(వచ్చే సంచికలో మరికొంత)

# మిస్టర్ పెళ్ళాం

బాపురమణీయం
Bapu Ramaneeyam



దర్శకత్వం
బాపు

కథ-స్క్రీన్‌ప్లే-సంభాషణలు
ముళ్ళపూడి వెంకటరమణ

వెండితెర నవల

నవలీకరణ
ఇలపావులూరి మురళీమోహనరావు

6

**జరిగిన కథ**

**బాలాజీ, ఝాన్సీ భార్యాభర్తలు. బాలాజీకి ఆడవారంటే చులకన భావం. బ్యాంకులో క్యాషియర్‌గా ప్రమోషన్ పొందిన రోజే మేనేజర్ చేసిన మోసం వల్ల క్యాష్‌లో లక్ష రూపాయలు తేడా వస్తుంది. బాలాజీ సస్పెండ్ అవుతాడు. ఈ విషయం బయటకు పొక్కి, వేరే ఏ ఉద్యోగమూ దొరకదు. ఝాన్సీ తన కాలేజ్‌మేట్, గోపాల్ కంపెనీలో రికమెండ్ చేస్తానంటుంది. తన కథ తెలిసాక వాళ్లూ పొమ్మంటారంటాడు బాలాజీ. అయితే తనే ఉద్యోగానికివెళతానంటుంది ఝాన్సీ. అలా అయితే తను ఇంటిపని చూసుకుంటాననంటాడు బాలాజీ. ఝాన్సీని గోపాల్ సాదరంగా రిసీవ్ చేసుకుంటాడు. -(ఇక చదవండి)**

" కలో నిజమో తెలుసుకుందామని"

"నువ్వే గిల్లుకోవచ్చుగా?" అడిగింది.

"మనకెందుకు నొప్పి?".



"నువ్వేం మారలేదు గోపాల్." అన్నది ఝాన్సీ నవ్వి.

"అంటే సత్తు రూపాయ నంటావ్...నువ్వు తిట్టినా, కొట్టినా బాగుంటుంది. నాకదో తుత్తి..."

"నాకూ ఆశ్చర్యమే. సివంగి అనగానే ఠక్కున గుర్తు పట్టేశావు."అంది ఫ్లాష్‌బ్యాక్‌లో చెంపదెబ్బ సీను గుర్తొచ్చేలా...బుగ్గ నిమురుకుంటూ

"భలేదానివే.. కూర్చో... "

"థేంక్స్" కూర్చుంది ఝాన్సీ.



"నిన్నెలా మర్చిపోగలను గానీ నువ్వే నన్ను గుర్తుంచుకుని ఇంతదూరం వచ్చావు. నాకదే తుత్తి." అన్నాడు.

ఇందాక ఆ మాట అంటే ఏమిటో అనుకుంది. రెండవసారి కూడా 'తుత్తి' అన్న మాట వినపడగానే అర్థం కానట్లు చూసింది.



ఝాన్సీభావం గ్రహించాడేమో... "తుత్తి... తుప్తీ... శాటిస్ ఫాక్షన్" వివరణ ఇచ్చాడు.

"ఓహో... యూ మీన్ తృప్తి...?" అన్నది పెద్దగా నవ్వి.

తాను కూడా నవ్వాడు గోపాల్. "యస్... యస్... తుత్తి. అవును... ఎందుకొచ్చావు? ఏం పని?" అడిగాడు.

"పనికోసమే వచ్చాను." చెప్పింది.

అర్థం కానట్లు చూశాడు గోపాల్.

"నేనూ, మావారూ పందెం వేసుకున్నాం. నేను ఉద్యోగం చేసి డబ్బు తెచ్చేట్టు, ఆయన వంటావార్పూ చేసి పిల్లలను పెంచేట్టు" నిజం చెప్పలేక అబద్ధమాడింది ఝాన్సీ.

"బలేబలే... అంటే నువ్వు మిస్టర్ పెళ్ళాం గారు. ఆయన మిసెస్ మొగుడు గారు." నవ్వాడు గోపాల్.

ఇంతలో ఫ్లాస్క్‌లో కాఫీ తెచ్చాడు ప్యూన్. కప్పుల్లో పొయ్యడానికి లేచింది ఝాన్సీ.

"నువ్వు కూర్చో. వాడిస్తాడులే" వారించాడు గోపాల్.



ఇద్దరికీ కాఫీ ఇచ్చి వెళ్ళిపోయాడు ప్యూను. ఇద్దరూ వేడి వేడి కాఫీ సేవిస్తున్నారు.

"ఇదో పందెం. ఎవరు ఓడినా, ఎవరు గెల్చినా అదో తుత్తి." అన్నాడు గోపాల్.

హేండ్ బ్యాగ్‌లోంచి ఫ్రేమ్ కట్టించిన డిగ్రీ సర్టిఫికెట్ బయటకు తీసి చూపించి"నా బీకామ్ డిగ్రీ"అంది ఝాన్సీ.

"కానీ మాసేల్సు బావులేవు. బిజినెస్ వేసిన చోటే పడుంది. అందుకని సేల్సు వాళ్ళకోసం చూస్తున్నాం అనుకో... ఇక్కడ నువ్వేం చెయ్యగలవూ అని?" అడిగాడు గోపాల్.

ఇంతలో బయట ఎవరో వస్తున్న అలికిడి వినిపించింది. "ఎవరో



చాలామంది వస్తున్నారు'' అన్నది ఝాన్సీ.

"ఇవాళ మా డైరెక్టర్స్ మీటింగుంది కదా!" చెప్పాడు గోపాల్.

ఇంట్లో చేసినట్లుగానే ఇక్కడ కూడా కాఫీ కప్పులు తీసేయబోయింది.

"సివంగీ... ఛీఛీ... అక్కడొది లేసెయ్. దానికి బాయ్స్ ఉన్నారు" అన్నాడు గోపాల్.

"నాకదో తుత్తి" చిలిపిగా అన్నది ఝాన్సీ.

ఝాన్సీ చిలిపి మాటలకు "సిల్లీగర్ల్....పోదూ" అంటూ నవ్వాడు గోపాల్. ఝాన్సీ మీద అతనికున్న అభిమానం అలాంటిది.

"నేను బయటకు పోనా?" లేస్తూ అన్నది ఝాన్సీ.

"ఫరవాలేదులే... కూర్చో. మీటింగైపోగానే ఛైర్మన్‌గారికి... మా డాడీయేలే... పరిచయం చేస్తాను." బయటకు వెళ్తూ అన్నాడు గోపాల్.

హాల్లో మీటింగ్ జరుగు తున్నది. డైరెక్టర్లంతా తమ తమ స్థానాలలో కూర్చున్నారు. ఛైర్మన్ వచ్చాడు. అందరూ గౌరవంగా లేచి నిలుచుని నమస్కరించారు. పక్కా తెలుగు రైతు ఆహార్యంలో హుందాగా ఉన్నాడు ఛైర్మన్. కళ్ళతోనే ప్రతి నమస్కారం చేశాడు.

కూర్చోబోతుండగా ఓ డైరెక్టర్ ముందున్న మంచినీళ్ళ గ్లాసుపై మూతలేక పోవడం గమనించాడు. ఆయన దేన్నైనా సహిస్తాడేమో కానీ ఎవరి పనులు వారు శ్రద్ధగా చెయ్యకపోతే మాత్రం చెడ్డకోపం వస్తుందాయనకు.



"బోయ్... ఇటునుంచి ఐదో కుర్చీ దగ్గరున్న గ్లాస్ మీద మూతలేదు. వార్నింగిచ్చినా నీకు శ్రద్ధలేదు. నాకు బుద్ధిలేదు. ఉంటే నిన్నీపాటికి డిస్మిస్ చేద్దును." అరిచాడు మెత్తగా.

బోయ్ గడగడలాడుతూ గ్లాసుమీద మూతపెట్టి వెళ్ళిపోయాడు ఛైర్మన్ అందరివైపూ చూశాడు. ఛైర్మన్ ఏం చెబుతాడో అని అందరూ ఆయన వంకే చూస్తున్నారు. గొంతు సవరించుకున్నాడు ఛైర్మన్.

"ఫ్రెండ్స్.... మనందరికీ శ్రద్ధ తగ్గింది. ఎక్కడో తెలియని తప్పులు చేస్తున్నాం. అందుకే మన కంపెనీ అమ్మకాలు చతికిల పడిపోయాయి. ఇపుడు మనం ఏం చెయ్యాలి? ఏం చెయ్యకూడదు? అమ్మకాలు ఎలా పెంచాలి? ఇది చాలా అర్జంటు" అన్నాడు.



పక్క గదిలో కూర్చున్న ఝాన్సీకి వీరి మాటలు వినిపిస్తున్నాయి.

గోపాల్ కల్పించుకున్నాడు. "అందుకే మేమంతా కలిసి డిస్కస్ చేసి సేల్సులో ఒక మంచి ఎక్స్‌పర్ట్‌ను తీసుకొచ్చాం. ఆయన చాలా పెద్ద కంపెనీలకు అయిడియాలిచ్చాడు. జెంటిల్మన్....ఐ ప్రెజెంట్ మిస్టర్ యస్.యన్.యమ్." ఎదురుగా కుర్చీలో కూర్చున్న ఒక వ్యక్తిని చూపించాడు.

టక్ చేసి, టై కట్టుకుని, దళసరి కళ్ళజోడు ధరించి, బట్ట తలతో ఉన్న వ్యక్తి ముఖమంతా నవ్వు పులుము కుంటూ లేచాడు. అందరికీ విష్ చేశాడు.

" బఠానీల నుంచి బోయింగ్ విమానాల దాకా సేల్సూ డీల్సూ ఈ యస్.యన్.యమ్. స్పెషాలిటీ." చెప్పుకున్నా డతను. అందరూ చప్పట్లు కొట్టారు. ఛైర్మన్ మాత్రం తల ఊపి వందనం చేశాడు.



ఝాన్సీ కూడా వింటున్నది.

"జెంటిల్మన్... ఇపుడు మీ సేల్సు పెంచాలి. అదీ మీ సమస్య. " అన్నాడతను ఏదో గొప్ప రహస్యం కనుగొన్న వాడిలా.

ఝాన్సీ అతని మాటలకు నవ్వుకున్నది.

"దానికో గొప్ప చిట్కా వుంది." అటు ఇటు చూశాడతను.

అందరూ వింటున్నట్లు తలలాడిస్తున్నారు.

"మామూలుగా కస్టమర్స్ ఎలాంటి వారైనా సరే- ధరల తగ్గింపు అనగానే అవసరం లేకపోయినా కొని పారేస్తుంటారు. అందువల్ల ఈ నెల ధరలు పెంచేసి వచ్చేనెల గొప్ప తగ్గింపు అని వెయ్యడం ఒక పద్ధతి." రెస్పాన్స్ కోసం ఆగాడు ఎస్.ఎన్.ఎమ్.

డైరెక్టర్లందరూ చప్పట్లు కొట్టారు. ఛైర్మన్ మాత్రం ప్రశాంతంగా వింటున్నాడు. ఆయన ముఖంలో ఎలాంటి భావాలూ ప్రతి ఫలించడం లేదు.



నిజానికీ 'డిస్కౌంట్' అన్న పదం మహా శక్తి కలిగిన మంత్రాస్త్రం.

డిస్కౌంట్ అంటే డ్రైవింగ్ రాని వాడు కూడా కారు కొంటాడు. డిస్కౌంట్ సేల్స్‌లో ఒకావిడ ఆరుగజాల చీర కొంటే, ఒక్కసారి ఉతగ్గానే రెండు గజాలు కుంగి పోయిందట. ఆమె కోపంగా షాపు వాడి దగ్గరకు వెళ్ళి చడామడా వాయించింది. "అమ్మా దీనిని మీరు డిస్కౌంట్‌తో కొని ఉంటారు." అని అన్నాడట కూల్‌గా.

ఇలాటివేవో గుర్తొచ్చాయేమో, నవ్వుకుంటున్నది ఝాన్సీ.

తానేదో అతి గొప్ప రహస్యాలు చెబుతున్నట్లు ముప్పై రెండు పళ్ళు బయట పెట్టి నవ్వాడు ఎస్.ఎన్.ఎమ్.

'రెండోది... గిఫ్ట్ స్కీమ్. బహుమతి పథకం." అనగానే గోపాల్ అందుకున్నాడు. "వాళ్ళు కొనే ప్రతి బిల్లు మీదా ఒక నెంబరుంటుంది. నెలనెలా లాటరీ డ్రా తీస్తాం." చెప్పండీ అంటూ ఎస్.ఎన్.ఎమ్. వైపు చూశాడు.

"లాటరీ తగిలిన వాడికి ఫస్ట్ ప్రైజు... హాలీవుడ్‌కి రెండు విమానం టిక్కెట్లు. సెకండ్ ప్రైజ్ పెద్దలకు కాశీ రామేశ్వరం యాత్రలు. మూడో ప్రైజు యువకులకి చదువులకయ్యే ఖర్చు, అమ్మాయిలకి పెళ్ళి ఖర్చు." ఎలా ఉందనట్లు చూశాడు.



"ఇలా అన్ని వర్గాలకూ తుత్తి కలిగించేవి.'' వంత పాడాడు గోపాల్.

"ఇవి మీరు అమలు చేస్తే వచ్చే ఏడాదికి సేల్సు వంద కోట్ల మార్కు దాటి పోతుందని నవినయంగా, నగర్వంగా మనవి చేస్తూ నేను రాసినవన్నీ వివరంగాఈ రిపోర్టులో పెట్టాను." అని ఒక ఫైలును ఛైర్మన్ ముందు వినయంగా ఉంచాడు.

ఎస్.ఎన్.ఎమ్. వెళ్ళబోతుండగా కలహంస ధ్వనిలా నవ్వులు వినిపించాయి.ఎంత బయటకు వినపడకూడ దనుకున్నా గలగల పారుతున్న సెలయేటి ధ్వని లాంటి ఆ నవ్వు అందరికీ వినిపించి ఆగ్రహం తెప్పించింది.

"హూ ఈజ్ షి?" అన్నాడు ఎస్.ఎన్.ఎమ్.కోపంగా.

"ఎవరది?" అన్నాడు ఒక డైరెక్టర్.

"ఇక్కడికెలా వచ్చింది?" గదిమాడు మరో డైరెక్టర్.

"పొమ్మనండి." కోపగించుకున్నాడు ఇంకోకాయన.



వారి మాటలకు భయపడి లేచి వెళ్ళబోయింది ఝాన్సీ. లేడిపిల్లలా బెదురు చూపులు చూస్తున్న ఝాన్సీని చూడగానే సదభిప్రాయం కలిగిందేమో, "అమ్మాయ్.. ఇలారా..." అన్నాడు ఛైర్మన్.

"ఈ అమ్మాయి నా ఫ్రెండు. ఇంటర్లో క్లాస్‌మేటు. ఇవాళ...తను..." ఏదో చెప్పబోయాడు గోపాల్.

"నువ్వేం చెప్పొద్దు." అన్నాడు ఛైర్మన్.



గోపాల్ నోరు మూత పడింది.

"నవ్వింది నువ్వేనా?" అడిగాడు ఛైర్మన్.

ఆ మాటల్లో కోపం లేదు. కేవలం అభిమానమే ఉన్నది.

ఛైర్మన్ దగ్గరకొచ్చి వినయంగానమస్కరించింది ఝాన్సీ.

"అసలెందుకీ గదిలో కొచ్చిందో కనుక్కోండి." అన్నాడొక డైరక్టర్ కోపంగానే.

కానీ ఛైర్మన్ మాత్రం ప్రశాంతంగానే ఉన్నాడు. ఊరికే ఆవేశాలకు లోనయ్యే వారు అటువంటి పదవులలో రాణించలేరు.

"ఎందుకొచ్చిందన్నది పాయింటు కాదు. ఎందుకు నవ్విందీ అన్నది కావాలి. చెప్పమ్మా. నీకేం భయం లేదు." అన్నాడు ఝాన్సీని చూస్తూ.

తండ్రికి కోపం రాకపోవడం గోపాల్‌కు ధైర్యాన్నిచ్చింది. కుర్చీని జరిపి కూర్చోమన్నట్లు సైగ చేశాడు. కానీ ఝాన్సీ కూర్చోలేదు. ఛైర్మన్ నిదానత్వం ఆమెకు కొంచెం ధైర్యం కలిగించింది. అందుకే సాధ్యమైనంత నవ్వు ముఖంతోనే "ముప్పావలా ఖరీదున్న కోడిపిల్లకి జ్వరమొస్తే మూడు రూపాయలు చేసే పంది పిల్లకు దిష్టి తీశాడట ఒకడు" నర్మగర్భంగా బదులిచ్చింది. అందరూ నవ్వారు.



"మీరంతా ఇవుడు ఎందుకు నవ్వారో నేనూ అందుకే నవ్వాను." చెప్పింది ఝాన్సీ.

అమె మాటల్లోని మర్మం ఛైర్మన్ ఒక్కడికే అర్థమైంది. రోగానికి తగిన చికిత్స చెయ్యడం లేదని ఆమె మదిలోని భావమని గ్రహించాడు. అదేదో ఆమె నోటి ద్వారానే రాబట్టాలని నిర్ణయించాడు.

"మా బిజినెస్ ముప్పావలా కోడిపిల్ల అంటావ్? మా ప్లాన్స్ సిల్లీ అంటావ్?" అన్నాడు.



"అవును. మీరు ఒక లక్ష అమ్మకాలు పెంచడానికి పదిలక్షల బహుమతులు లాటరీ పెడుతున్నారు. ఈ నెల సేల్సు పెరిగాయనుకుందాం. వచ్చే నెల మళ్ళీ తగ్గిపోతే ఏం చేస్తారండీ..?" ఆగింది ఝాన్సీ.

అందరూ సీరియస్‌గా వింటున్నారు. ఎస్.ఎన్.ఎమ్. ముఖం రంగు మారుతున్నది.

"మళ్ళీ ఇస్తారా? ఇవ్వగలరా? ఇలా నెలనెలా ఏదో చేసి లక్షలిస్తూపోతే మీ ముప్పావలా బిజినెస్సు మూడు నిముషాల్లో దివాలా అవదండీ." అన్నది ఝాన్సీ.

ఛైర్మన్ ఆలోచనలో పడ్డాడు. "ఇంతకీ మా బిజినెస్ పెరగక పోవడానికి కారణం..? ...కూర్చో." అన్నాడు.

ఝాన్సీ కూర్చుంది. ఇపుడామె దృఢచిత్తంతో ఉన్నది. వాళ్ళు తన మాటలను సీరియస్‌గానే వింటున్నారన్న విశ్వాసం కలిగింది. అందుకే తాను చెప్పదలుచుకున్నది సూటిగా చెప్పసాగింది.



"తిండీ బట్ట కొనే జనంలో నూటికి తొంభై మంది పేదవాళ్ళు, సామాన్యులూను. వాళ్ల నొదిలేసి పదిమంది లక్షాధికారులను పట్టుకుని వేలాడుతున్నారు. వాళ్ళ సంఖ్యా పెరగదు. మీ వ్యాపారమూ పెరగదు." అన్నది.

ఛైర్మన్ రిలాక్స్‌డ్‌గా కూర్చున్నాడు. ఝాన్సీ మాటలు ఆయన మెదడులో కదిలికలు పుట్టించాయి. "అంటే?" అన్నాడు సాలోచనగా.

ఝాన్సీ ఛైర్మన్ ముఖాన్నే సూటిగా చూడసాగింది.

"నూటికి పదిమంది పెరుగన్నం తినే వాళ్ళు, తొంభైమంది పచ్చడి మెతుకులవాళ్ళు. ఎవరు తిన్నా పట్టెడన్నమే కదా! అలాంటపుడు పదిమంది లక్షాధికారుల కన్నా తొంభైమంది మామూలు వాళ్ళు ఎక్కువ కొంటారు అని తేలింది కదా!" అన్నది.

మెచ్చుకోలుగా చూశాడు గోపాల్. ఆమె నెలాగైనా తమ కంపెనీలో చేర్చుకోవాలని అతని ఉద్దేశ్యం. ఆ మాటేదో ఛైర్మన్‌తోనే అనిపిస్తే మరింత బాగుంటుందనేది అతని అంతరంగం.



"అసలు నీమాటెందుకు నమ్మాలి?" ప్రశ్నించాడు.

"ఢిల్లీ వెళ్ళే రైలును చూడండి. ఫస్ట్ క్లాసు పెట్టెలు నాలుగుంటే సెకండ్ క్లాస్‌వి పద్నాలుగుంటాయి. తిరుపతి హుండీలో కోటీశ్వరులు వేసేది పదికోట్లుంటే పేదవాళ్ళు వేసేది తొంభైకోట్లు. అందువల్ల మీరు డబ్బులు ఎక్కడ ఎక్కువో అక్కడకు వెళ్ళాలి. ఈ ఏసీలు, లాటరీలు, డైరెక్టర్ల జీతభత్యాలు ఇవన్నీ కలిసి మీ ముప్పావలా కోడిధరను మూడు రూపాయలకి పెంచే స్తున్నాయి" అన్నది.

ఎస్.ఎన్.ఎమ్. ముఖం మాడ్చిన దిబ్బరొట్టెలా తయారైంది. తనముందే ఛైర్మన్ ఝాన్సీ మాటలను ఆసక్తిగా వినడం అతనికి కంటగింపైంది. కొరకొర చూడటం మినహా ఏమీ చెయ్యలేక పోయాడు.

ఝాన్సీ కొనసాగించింది. "మీ షాపులకు నాలాంటి మామూలు వాళ్ళు రారు. మీ హంగు చూసి భయపడతారు. మీ ధరలు చూసి పారిపోతారు. అందువల్ల మీరే పేటలకు రండి. అక్కడ చిన్న చిన్న షాపులు తెరవండి. మీకు నమ్మకం కుదిరే వరకూ బస్సుల్లో షాపులు ఏర్పాటు చేసి పేటపేటకీ పంపండి. మా ఇళ్ళ గుమ్మాల్లో వారం వారం డేరాలు వేసి అమ్మండి. నిజానికిది కొత్త అయిడియేం కాదు. పూర్వం మన పల్లెల్లో వారానికో రోజు సంతలు అవీ వుండేవే...అలాగన్న మాట... మధ్యతరగతి వాళ్ళు ముప్పైమంది ఉంటే కింది తరగతి వాళ్ళు అరవైమంది ఉంటారు. ఆ పేటలకు కూడా ఆటోలలో సరుకులు పంపండి. పదిరూపాయల పేకెట్లు, ఐదురూపాయల పేకెట్లు అమ్మండి."




దార్శనికుడు, వ్యాపారద్రష్ట అయిన ఛైర్మన్‌కు ఆమె చెప్పినవన్నీ దృశ్యరూపంలో కళ్ళకు కట్టినట్లు కనిపిస్తున్నాయి. తమ కంపెనీ బస్సులు, ఆటోలు సరుకులతో వాడ వాడలకు వెళ్ళడం, సామాన్య జనం ఎగబడి సరుకులు కొనడం సాక్షాత్కరించాయి.



"మీరు ప్రైజులివ్వ నక్కర్లేదు. మీరమ్మిన బియ్యం పాకెట్లలో, పప్పు పేకట్లలో ఒక్క బెడ్డకానీ, చచ్చు పుచ్చుగానీ ఉందని నిరూపిస్తే ఐదువందల రూపాయల బహుమతి నిస్తామని ఛాలెంజ్ చెయ్యండి. చాలామంది ప్రయత్నిస్తారు. ఎవరికీ దొరకనంత శుభ్రంగా సరుకునివ్వండి. అదే పది కోట్ల పబ్లిసిటీ. అమ్మకానికి అసలైన పునాది నమ్మకం" లేచి అందరి వంకా చూసింది ఝాన్సీ.

"ఇవన్నీ నేనొక మామూలు తరగతి ఇల్లాలుగా అనుభవం మీద చెప్పాను." ముగించింది.

ఒక్క క్షణం అంతా నిశ్శబ్దం. ఝాన్సీ హృదయం ఆందోళనతో ఊగుతున్నది. ఉద్యోగార్థియై వచ్చి అనవసరంగా మాట్లాడానా అన్న డోలాయమానంలో పడ్డది.



ఛైర్మన్ ముఖం మాత్రం మెరిసింది. చప్పట్లు కొట్టాడు.

అంతే!

పదిజతల చేతులు ఆటోమేటిగ్గా చప్పట్లు కొట్టాయి. ఆనందాన్ని వ్యక్త పరచడానికి హృదయపూర్వకంగా మోగిన ఆ కరతాళ ధ్వనులు భక్తుడిని అనుగ్రహించడానికి భగవంతుడు ప్రత్యక్షమైనపుడు గుడిలో మ్రోగిన జే గంటల్లా మీటింగ్ హాలులో ప్రతిధ్వనించాయి. కోయిల పాటకు పులకించిన వసంతమైంది ఝాన్సీ.

**-(ఇంకావుంది)**

అలనాటి ఆణిముత్యాల గురించి
నేటి తరానికి అనువైన శైలిలో తెలిపే

క్లాసిక్స్ రీటోల్డ్

# నవ్వుటద్దాలు

- ఆచార్య తిరుమల

## కవుల ఆవేదన




శ్రీశ్రీ మహాప్రస్థానానికి యోగ్యతా పత్రం రాస్తూ చెలం - "కృష్ణశాస్త్రి బాధ ప్రపంచానికి బాధ. ప్రపంచపు బాధ అంతా శ్రీశ్రీ బాధ" అంటాడు. అంటే - తన బాధని ప్రపంచానికి పంచటం, ప్రపంచ బాధని తానుగా కౌగిలించుకోవటం - కవులంతా యీ రెండు రకాల్లో ఏదో ఒక రకానికి చెందినవారై వుంటారనుకున్నా, కవి వ్యక్తిగత ఆవేదన వేరు. అనుకూల పరిస్థితి లేకపోయినా, అనుకున్న ఫలితం రాకపోయినా, నచ్చని, తాను మెచ్చని, విషయాల ప్రాబల్యం పెరుగుతున్నా, చేతకానితనం వల్ల కవిలోనే కాదు ఎవరిలోనైనా ఆవేదన కలుగుతుంది. అది అంతర్గతం. అంతర్గతమైన ఆవేదన ప్రకటితమైతే బాధ అవుతుంది. బాధ ముదిరితే వ్యధ అవుతుంది. వ్యధ ముదిరితే వ్యాధి అవుతుంది.

దుఃఖంలో ఆనందాన్ని వెదుక్కునే కృష్ణశాస్త్రి గారి రోదనలా కాకుండా శ్రీశ్రీ ప్రపంచ బాధకి ప్రతినిధిలా నిలవటమే కాదు స్వయంగా యెంతో ఆవేదనని అనుభవించాడు. ఎండలో గబ్బిలంలా క్రాగిపోయాడు. వానలో నిలువునా నీరుగారిపోయాడు. శీతాకాలం కోత పెట్టగా కొరడుకట్టీ ఆకలేసి కేకలేశాడు. చివరికి భువన భువనపు బావుటాగా పైకి లేచాడు. తనపట్ల యీ ప్రపంచం నిర్దాక్షిణ్యంగానే వుందనే ఆవేదనతో 'ఆః' అంటూ

**నిప్పులు చిమ్ముకుంటూ**
**నింగికి నే నెగిరిపోతే**
**నిబిడాశ్చర్యంతో వీరు -**
**నెత్తురు క్రక్కుకుంటూ**
**నేలకు నే రాలిపోతే**
**నిర్దాక్షిణ్యంగా వీరె** - అన్నాడు.

కవుల చేత నిప్పులు కక్కించి, ఏడిపించే క్రూర ప్రపంచాన్ని చూస్తే ఎవరికి ఆవేదన కలగదు? అందుకే తెలుగు సాహిత్య చరిత్రలో ఒక యుగానికి ప్రాతినిథ్యం వహించిన శ్రీనాథ మహాకవి "కవితల్ సెప్పిన పాడనేర్చిన వృథా కష్టంబె యీ బోగపుం జవరాంద్రేగద భాగ్యశాలినులు పుంస్త్వంబేల పో కాల్పనా?" అని బాధపడ్డాడు. అంతేకాదు, తన అంత్యదశలో

**కవిరాజు కంఠంబు కౌగిలించెనుగదా**
**పురవీధి నెదురెండ బొగడదండ**
**సార్వభౌముని భుజాస్కంధ మెక్కెనుగనా**
**నగరవాకిట నుండు నల్లగుండు**
**ఆంధ్రనైషధ కర్త యంఘ్రి యుగ్మంబున**
**దగిలియుండెను గదా నిగళయుగము**
**వీరభద్రారెడ్డి విద్వాంసు ముంజేత**
**వియ్యమందెను గదా నెదురుగొడియ**
**కృష్ణవేణమ్మ గొనిపోయె నింతఫలము**
**బిలబిలాక్షులు తినిపోయె తిలలు పెసలు**
**బొడ్డుపల్లెను గొడ్డేలి మోసపోతి**
**నెట్లు చెల్లింతు టంకంబు లేడు నూర్లు?**

అని ఆవేదనతో అలమటించిపోయాడు. కవుల్ని గౌరవించలేని రాజులు గర్వంతో ధర్మకాటా నెత్తే ధర్మమూర్తుల మని విర్రవీగుతూ వుంటారు. అందలమెక్కించిన ఓ రాజుని యెదురుబడి ఏమనలేక అన్యాపదేశంగా -

**ప్రావ్య ప్రమాణ పదవీం/ కోనా మూస్తే తులేవలేపస్తే**

**వయసి గరిష్ఠ మథస్తాత్ / లఘుతరముచ్చై స్తరాం కురుషే!!**

అని తన ఆవేదనని వెళ్లగక్కాడు. అంటే - ఓ త్రాసా! నీకెంత గర్వం! ప్రమాణ పదవిని పొందానని గురుతరమైన వాటిని కిందకి నొక్కిపట్టి, తేలికైన వాటిని పైకెత్తుతున్నావు జాగ్రత్త! అని అర్థం. ఇలాంటి తక్కిళ్లు ఏకాలంలోనైనా, ఏ సమాజంలోనైనా చాలా కనిపిస్తాయి. ఇలాంటివాళ్లు పైకి ఎర్రగా బుర్రగా మావిడిపండులా పసందుగా వున్నా లోలోపల మాత్రం గట్టి టెంకలాంటి హృదయంతో వుండటాన్ని గమనించిన ఓ కవి -

**చూత ఫలావతంస! నిను జూచిన కన్నుల పండు వయ్యె!లో**

**పాతిశయంబున్ పరిమళాన్విత మయ్యె దిశౌఘుమెల్ల వి**

**ఖ్యాతి యొనర్చె నీ గుణములైనను గల్గదు నాకు నెమ్మదిన్**

**కౌతుక మెప్పు నీ హృదయ కర్కశ భావము జూడ జూడగ!!**

అంటూ ఆవేదనా పూర్వకంగా ఆ కాఠిన్యాన్ని నిరసించాడు. ఇంత కర్కశ భావంతో వున్న వారికి ఎంత కమ్మని కవిత్వం వినిపిస్తే మాత్రం ఏం లాభం? అటువంటి సందర్భంలో ఒక కవి తన కవిత్వం ఎవరికి వినిపించాడో ఏమో తన ఆవేదనని శాపంగా వినిపిస్తున్నాడిలా -

**పద్యము చెప్పిన సుకవికి**

**హృద్యముగా నియ్యనట్టి హీనాత్ముని యా**

**పద్యమె పామై కఱచును**

**ప్రద్యోదిత కీర్తికాండ! భాస్కరుకొండా!!**

సహృదయుడైన వాడెవడైనా సరే కవిత ద్వారా తనేదైనా ఆనందాన్ని పొందితే, ఆ కవికి కృతజ్ఞతా పూర్వకంగా ఏదైనా సమర్పించి తన కవితాభిమానాన్ని, రసికతని ప్రకటించాలి. అలా జరగకపోతే కవిలో అంతర్గతంగా నిరాశా నిస్పృహలే మిగిలి ఆవేదనే అల్లుకుంటుంది. కవిత్వాన్ని ఆస్వాదించటానికి రసికత కావాలి. ఆ రసికత లేని వారితో విసిగి వేసారిపోయాడు కాబోలు ఒక కవి యిలా మొరపెట్టుకున్నాడు:-

**ఇతర కర్మ ఫలాని యదృచ్ఛయా**

**విలిఖితాని స హే చతురానన!**

**అరసికేషు కవిత్వ నివేదనం**

**శిరసి మా లిఖ మా లిఖ మా లేఖ!!**

ఓ చతుర్ముఖ బ్రహ్మ! ఇతర పాపాలు అనుభవించమని నా నొసటను నీ యిష్టం వచ్చినట్టు రాయి, సహిస్తాను. కానీ నా కవిత్వాన్ని అరసికులకు నివేదించే దుర్గతిని మాత్రం నా నుదుట రాయకు, రాయకు, రాయకు - అని భావం. అలాంటి దుస్థితి ఏ సత్కవికీ రాకూడదని కోరుకోవాలి. భర్తృహరి కూడా యిలాగే "తెలిసియుఁ దెలియని నరుఁదెల్ప బ్రహ్మదేవుని వశమే!" అని బాధపడటమే కాదు - తన సుభాషిత త్రిశతికి ఆద్య ప్రకరణంగా మూర్ఖపద్ధతి నెన్నుకుని - మంచిమాట వినేవారు లేరనే ఆవేదనతో -

**బోద్ధారో మత్సరగ్రస్తాః**

**ప్రభవః స్మయ దూసితాః**




**అబోధోప హతాశ్చాన్యే**

**జీర్ణమంగే సుభాషితమ్!!**

అనే శ్లోకంలో తన కావ్యానికి శ్రీకారం చుట్టాడు. తెలిసినవారు అసూయలతో, ప్రభువులు గర్వంతో, ఇతరులేమీ తెలియక ఉండటం చేత సుభాషిత (మంచిమాట) ఎవ్వరికీ చెప్పటానికి లేక భావంలోనే లయించిపోతుందని భావం. ప్రభువులకి, పండితులకే అక్కర్లేనప్పుడు ఏ మంచిమాటైనా అజ్ఞానులైన మూర్ఖులకి కావల్సివస్తుందా?

అందుకే వంచతంత్ర కవి - యిటువంటి తెలియనివాళ్లని దృష్టిలో పెట్టుకుని తన ఆవేదన నిలా ప్రదర్శించాడు :-

**విద్వానేన విజానాతి**

**విద్వజ్జన పరిశ్రమం**

**నహి వంధ్యా విజానాతి**

**గుర్వీం ప్రసవ వేదనాం!!**

అంటే విద్వాంసుడు గ్రంథ రచనలో పడిన శ్రమ యెంతటిదో మళ్లీ అంతటి విద్వాంసుడే తెలుసుకోగలడు కానీ ప్రసవ వేదన గొడ్రాలికి తెలియనట్టు, ఇతరుడికి ఆ కష్టమేమిటో తెలియదని తాత్పర్యం. అజ్ఞానంతో కావ్యశాస్త్ర పరామర్శలు చేసి సత్కవుల్ని కించపరిచే అల్పుల్ని చూసి తిరుపతి కవులు -

**కైత యొకండుగా దిపుడు కాలము సర్వము మారె వ్యర్థపుం**

**జాతురి హెచ్చె నల్పమగు సాహితితో పెద పెద్ద పొత్తముల్**

**జాతురు తప్పు దిద్దుదురు, శూరత చచ్చె! గవీంద్రులందు సీ!**

**మూతులు కట్టి వైచి కొనబోలదె సత్కవులైన వారికిన్!!**

అంటూ తమ ఆవేదన వ్యక్తం చేశారు. ఇది భర్తృహరి 'జీర్ణమంగేసుభాషితం' వంటి వేదన. ఎంత కాలం మారినా, అల్పబుద్ధితో మహా కావ్యాల్లోని, గ్రంథాల్లోని గుణాల్ని గాక తప్పులు పట్టి దిద్దే ధైర్యం ఈ పనికిమాలిన చాతుర్యం గల వాళ్ళకు ఎక్కడనుండి వచ్చింది? తిరుపతి కవులు ఆ విషయంలో కూడా ఆవేదన పడి తమ 'పాణీగృహీత' కావ్యం ద్వారా యిలా తెలియజేశారు:-

**మునుపు మహా కవీంద్రులు సముజ్జ్వల ఫక్కినొనర్చు కబ్బముల్**

**వినుతికి నెక్కెగాని, యవివేకుల కూతలు తాటియాకులం**

**దునె నశియించె; నోటఁబడు తుంపురు లేనియు నిప్పుడచ్చు వ**

**చ్చిన కతన్ జగాన విలసిల్లెడు, యేటి కృతుల్ నశించెడున్!!**



పూర్వం తాటాకుల్లో నైనా అవివేకుల వెర్రి మొర్రి కూతలు నశించి మహాకవుల కావ్యాలే నిలిచాయి. ఇప్పుడు అవివేకుల నోటి తుంపర్లు కూడా కవితలుగా అచ్చయి వీరవిహారం చేస్తూండటం చేత మహాకావ్యాలు రావటం లేదు సరిగదా - వున్నవి కూడా నశించిపోతున్నాయి. అవివేకులీ సత్యాన్ని అంగీకరించరు. పైగా కువిమర్శలతో నిత్యం మహాకవుల రచనలకి రంధ్రాన్వేషణ చేస్తూనే వుంటారు. వాని కంటె రాశి గొప్పదని నమ్మే యీ తెలివితక్కువ వాళ్లని చూసి ఒక కవి చాలా ఘాటుగానే తిట్టి తన ఆవేదన బైటపెట్టాడు. ఆ కవి ఏమంటున్నాడో చూడండి :-

**నక్కలు బొక్కలు వెదకును**

**నక్కలతో నూరపంది యగడిత వెదకున్**

**కుక్కలు చెప్పులు వెదకును**

**దక్కడి నా లంజ కొడుకు తప్పే వెదకున్!!**

ఎంత కోపం రాకపోతే అంత తిట్టు తిడతాడు చెప్పండి? పంది పెంట వెదుక్కున్నట్టు అల్పుడు తప్పు కోసం వెదుక్కుంటాడు. ఇది పశుప్రవృత్తి. ఇది రాక్షసానందం. ఇలాంటి రాక్షసానందం కోసం ప్రాకులాడే వాళ్లు ఏ కాలంలో వున్నా తమ సమకాలికులెవ్వరి గొప్పదనాన్నీ గ్రహించరు. మెచ్చుకోరు. అందుకే, చామకూర వెంకటకవి తన విజయవిలాస కావ్యంలో అర్థాంతరన్యాసంగా "ఏ గతి రచియించిరేని సమకాలము వారలు మెచ్చరే గదా!" అంటూ పెదవి విరిచాడు.




తప్పుంటే పట్టొచ్చు, హేళన చేయొచ్చు. మరి. ఆ తప్పెవరిది? కవిదా? పాఠకునిదా? విశ్వనాథ సత్యనారాయణ గారు

**తొలినాకుల శబ్దార్థము**

**తెలియనిచో పాఠకునిది తెలియమి, యీనా**

**కుల వ్రాసినా కవి దోషము**

**కలి ముదిరిన కొలది వింత గతులను వెలయున్!!**

అంటున్నారు. ఇది విపరీత ప్రతిభాషణం. కవి ప్రభావం. కావ్యం అర్థం కాకపోవటానికి కారణం పాఠకుడి అజ్ఞానం కాదుట. అలా వాడికి అర్థం కాకుండా రాయటం కవిదే తప్పుట! విశ్వనాథ వారి వ్యంగ్యంలోని ఆవేదన నెవరు అర్థం చేసుకోగలరు? కనీస స్వభాషాజ్ఞానం లేక పరభాషా వ్యామోహంలో పడి పల్లికిలించే తెల్గులకి ఎలా చెబితే అర్థమవుతుంది? మా తండ్రిగారు శ్రీనివాసాచార్యులు గారొకసారి తెలుగుల భాషాజ్ఞానానికి నొచ్చుకుంటూ -

**కొంగు పసిండి గైకొనక కుత్సితమౌ జలతారుజూచియు**

**ప్పొంగైదు నుబ్బులింగడులబోలె త్రిలింగులు తెల్గుబాస తా**

**పింగన లేక ద్రాబలయి పింగుల కోసము నేర్చురెండు మూ**

**డింగిలి పీసు ముక్కలకు హీయని పండ్లికిలింప బోకుడీ!!**

అని హెచ్చరించారు. ఎందులోనూ ప్రావీణ్యం లేని వారికేం చెబితే అర్థమవుతుంది? ఎలా చెబితే అర్థమవుతుంది? భాషాపరంగానే కాదు ఈ అజ్ఞానవ్యామోహం జీవితమంతా నిండి వుంది. హోటళ్లు, సినిమాలు, ఫోనులతో అమూల్యమైన జీవితకాలం వ్యర్థంగా కొట్టుకుపోతూ వుంది. మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రిగారు తెనాలి పట్టణాన్ని అడ్డేసుకుని -

**ఏ పనులు తప్పినను గాని రేపు మాపు**

**మా కెనీమా సినిమాల మాట దప్ప**

**దేల కదుజెప్ప నేటి టాకీల గూర్చి**

**హస్కు కొట్టగలేని కోన్కిస్క లేడు!!**

**పేట పేటను గూడ హోటలులు, కాఫీ హోటలుల్, హోటలున్**

**హోటల్లోనను గూడ ఫోనులును. ఫోను ఫోనున సైతమున్**

**టైటైటక్కరి-చక్రి గుల్గులు గులుక్ టాకీల సంగీతమున్**

**రైటో రైటు తెనాలికే తగును లేరా యాంధ్రప్యారీ సనన్!!**

అంటూ కోన్కిస్కా గాళ్లతో లోకమెలా వుందో చూసి తమ ఆవేదన వ్యక్తం చేశారు. ఇలాంటి కోన్కిస్కాగాళ్లు, కవుల ఉత్తమ సంస్కారాన్నెలా మెచ్చుకోగల్గుతారు? ఇలాంటి వారితోనే కవులకు అగౌరవాలు, అవమానాలూ జరిగేది!

**సంగరశక్తి లేదు వ్యవసాయము సేయగలేము సంతలో**

**నంగడి వేసి యమ్ముటది యంతకు మున్నె హుళక్కి కావునన్**

**బొంగు బుజాన వేసుకొని పోయెద మెచ్చకేని, ముష్టిచెం**

**బుం గొనిపెట్టు మొక్కటి యమోఘమదే కద దంతిరాణ్నృపా!!**

అంటూ తిరుపతి కవులు తమ దేవనను గోడె గజపతిరావు రాజా వారికి అర్జీ పెట్టుకున్నారు.




చివరగా, మహాకవి జాషువా పద్యంతో ముగిస్తాను:-

**నా కవితా వధూటి వదనంబు నెగాదిగ జూచి, రూపరే**

**ఖా కమనీయ వైఖరులు గాంచి "భళీ! భళి!" యన్నవాడె "మీ**

**దే కుల"మన్న ప్రశ్న వెలయించి, చివాలున లేచిపోవుచో**

**బాకున గ్రుమ్మినట్లగును పార్థివచంద్ర! వచింప సిగ్గగున్!!**

ఇంత నీచంగా కవిని అవమానపరిచి, ఆవేదన కలిగించే లోకాన్ని, నవ్వుతూ పువ్వులు విసిరి "లోకాస్సమస్తా స్సుఖినో భవన్తు" అని యెందుకు ఆశీర్వదించాలో, ఆకాంక్షించాలో ఆలోచించండి! ●



"భారతదేశం తన గౌరవాన్ని రక్షించుకోవడం కోసం
ఆయుధాలను ప్రయోగించినా అంగీకరిస్తాను కానీ,
తనకు అవమానం జరుగుతున్నప్పుడు పిరికితనంతో నిస్సహాయంగా
చూస్తుండడాన్ని మాత్రం సహించలేను"

-మహాత్మాగాంధీ

**జాతిపిత 134వ జన్మదినం సందర్భంగా దేశం ఆయనకు
కృతజ్ఞతాపూర్వక నివాళులను సమర్పిస్తోంది.**

**అక్టోబర్ 2, 2003**

సమాచార,ప్రసార మంత్రిత్వశాఖ, భారతప్రభుత్వం

davp 2003/308

HAASAM HAASYA SANGEETHA PATHRIKA, HYDERABAD.




"రేయ్! నేనీమధ్య ఓ అమ్మాయికి కన్ను గీటా..."
"ఊరుకుందా!?"
"అస్సలేం అన్లేదు"
"ఆశ్చర్యంగా వుందే!?"
"ఇందులో ఆశ్చర్యపడటానికేముంది... ఆ సమయంలో కటిక చీకటి గదా!"



**ఈ జోక్‌ను పంపినవారు : బి.వి.ఎస్.బాబు, తెనాలి.**

"మన పురోహితుల వారికి జబ్బు చేసిందట... హాస్పిటల్ లో వున్నారట..."
"మన పెళ్లి చేశాడుగా, ఆ పాపం ఊరికేపోతుందా"





"మా ఆయన నిద్రలో ఏదేదో మాట్లాడేస్తున్నారు డాక్టర్.... నాకు భయంగా వుంది"
"మెలకువగా వున్నప్పుడు కొంచెం మాట్లాడే అవకాశం ఇవ్వండమ్మా..."



"చలిగా వుంది, ఐస్‌క్రీం తినకూడదు"
"పోనీ స్వెట్టర్ వేసుకొని తింటే!?



"రోజూ ఏడుపు మొహంతో కనిపించేవాడివి. ఇవాళేంటి స్వీట్స్ పంచుతూ ఇంత హుషారుగా వున్నావు?"
"మా ఆవిణ్ణి కొట్టినట్టు రాత్రి కలొచ్చిందిరా"



"మా నాన్నగారు పెద్ద రైటర్... బోలెడు సంపాదించారు... ఇప్పటివరకూ ఎన్నో రాశారు ఒక్కటి తప్ప..."
"ఏమిటది?"
"వీలునామా"

డిశ్చార్జ్ అయి వెళ్లబోతున్న పేషెంట్‌తో - "ఇప్పుడు తేలిగ్గానే వుంది కదూ" అని అడిగాడు డాక్టర్.
"కరెక్టే డాక్టర్! చాలా తేలిగ్గా వుంది" అంటూ జవాబిచ్చాడు పేషెంట్ పర్స్ తడుముకుంటూ....





నువ్వేంటయ్యా... మాటి మాటికీ వాళ్లింట్లోనే దొంగతనం చేస్తున్నావ్" అడిగారు జడ్జీ.
"నేను వాళ్ల ఫ్యామిలీ దొంగన్సార్"



"భార్యాభర్తలన్నాక గొడవలయినప్పుడు - ఎవరో ఒకరు సర్దుకుపోవాలి - అని మీ ఆవిడతో చెప్పొచ్చుకదా" అన్నాడు తండ్రి హితబోధ చేస్తూ
"చెప్పొన్నాన్నా... అందుకే మొత్తం సామానంతా సర్దుకొని పోయింది" అన్నాడు పుత్రరత్నం.



"మనదేశం ఎప్పటికీ పైకి రానిదెందులో?"
"ప్రపంచపటంలో!!"

**ఈ జోకులను పంపినవారు**
**నివాస్, కొంగరకలాన్ (రంగారెడ్డి జిల్లా)**

## హ్యూమర్ బాక్స్

టీచర్ : ఒరేయ్ రామూ... నీకు తెలిసిన ఒక సంస్కృతం కొటేషన్ చెప్పరా?
రాము : సర్వేంద్రియాణాం నయనం ప్రధానం.
టీచర్ : చాలా బాగుంది. ఈ మాట ఎవరన్నారో తెలుసా!
రాము : తెలుస్సార్... మెగాస్టార్ చిరంజీవి.



ఈ జోక్‌ను పంపినవారు : ఎం.శ్రేష్ఠ, హైదరాబాద్.



మనవరాలు వెళ్లిపోతుంటే తాతగారు స్టేషనుకు వచ్చాడు.
"బై... తాతా, మా హాస్టల్‌లో ఫోను చేసుకోనివ్వరు. నువ్వే రింగ్ చేయి" అందామె.
"రింగేమిటి? ఒడ్డాణమే చేయిస్తా" అన్నారు తాతగారు.

ఈ జోక్‌ను పంపినవారు : వి.మంజురాణి, హైదరాబాద్.



ఓ అడవిలో ఓ వివాహితుడు, ఓ బ్రహ్మచారి దారి తప్పి అక్కడున్న నరమాంస భక్షకులకు దొరికిపోయారు. వాళ్ళు బ్రహ్మచారిని చంపి తింటుంటే "ఎందుకు నా మిత్రుణ్ణి చంపుకు తింటున్నారు... నన్ను తినండి" అని అడిగాడు వివాహితుడు.

"కుదర్దయ్యా... నీకు పెళ్లయిందని చెప్పావ్‌గా... మెదడులేని వాళ్ళని మేం తినం..." అని చెప్పారా నరమాంస భక్షకులు.



"భార్యాభర్తలు ఈ సృష్టికి కర్త, కర్మలవుతారా? అదెలాగే?"

"బిడ్డల సృష్టికి భర్త కర్తయితే... ఆ పిల్లల్ని కనే కర్మ భార్యదే కదండీ...."

ఆపరేషన్ గదిలో -

"డాక్టర్... నన్ను చంపకండి డాక్టర్ ప్లీజ్" అంటూ ఘోషించాడు పేషెంట్ ఆవేదనతో.

"నోఛాన్స్... నిన్నొదిలిపెడితే నీమటుకు నువ్ హాయిగా బ్రతికేద్దామనా!... నీ ఫీజుల్తో బ్రతికే మా బ్రతుకేం కానూ... కుదర్దు!" అన్నారు డాక్టర్ చిద్విలాసం కత్తెర్ని చిద్విలాసంగా తిప్పుతూ...



ఈ జోక్‌లను పంపినవారు
లకనం మూర్తి, కాకినాడ.



"ఆంటీ... మా అమ్మ ఓ యాభై రూపాయలు అప్పుగా ఇమ్మంది"

"ఎందుకురా?"

"నిన్న మీ దగ్గర గ్లాసు పంచదార తీసుకుంది కదా. అది ఈ డబ్బులతో కొని ఇచ్చేస్తుందిట"

ఈ జోక్‌ను పంపినవారు
ఐ.వి.మణి, జి.ఎల్.పురం, విజయనగరం జిల్లా.

జడ్జి : వట్టవగలు దొంగతనం చేయటానికి నీకు సిగ్గు లేదూ?
దొంగ : సిగ్గుపడి ఏంచేస్తాం సార్!?. రేచీకటి పెట్టుకుని...



ఈ జోక్‌ను పంపినవారు
బి.చంద్రశేఖరయ్య, రామసముద్రం.



# బాపు విశ్వరూపం 22

కార్టూన్లతో బాటు బాపు కార్టూన్ స్ట్రిప్స్, పాకెట్ కార్టూన్స్ కూడా వేసేవారు. 1962లో ఆంధ్రపత్రిక డైలీలో 'మనవాళ్ళు', 'గిరీశం' పేర నడిపిన శీర్షికల ద్వారా సమాజపు పోకడను విమర్శించేవారు. 'శంకర్' పేరుతో ఆంధ్రపత్రిక వీక్లి శీర్షిక 'ఎప్పుడూ ఇంతే' ఆడాళ్ళు, మగాళ్ళు, ఆలుమగలు గురించి. 'బుడుగు' చిన్నపిల్లల కోసం అని వేసినా దానిలోనూ వ్యవస్థపై విసుర్లు కనబడతాయి. శ్రీ ఎం.వి.అప్పారావు, రాజమండ్రి సేకరించి పంపిన కొన్ని సెలెక్టెడ్ కార్టూన్లు :




















బుడుగు.
బాపు
'ఎవిట్రా బుడుగూ చేస్తున్నావ్' అని అడిగాను
'కళ' అన్నాడు
-అంటే చిత్రకళ్లో బొమ్మ లన్నిటికీ మీసాలూ గడ్డమూ కూడా పెట్టడమన్నమాట
అలా కాసేపు చూసి ఇప్పుడే ఇలా వచ్చా
జం జక జక జక జం జక జం
జం జక జక జక బారెడేసి మొగ్
గొడవ చెయ్యకూడదు
కవి - సినిమాకి పాటలు రాస్తున్నాడు - ష్
ఇందాకల్లా నేనూ నాన్నా ఎలట్రీ ఆఫీసు కెళ్లాం..
వాళ్లని ఛడామడా తిట్టేసి - ఇలా
గాఠిగా ప్రైవేటు చెప్పేసి వచ్చాం తెల్సా
ఇవిగో అబ్బాయిలూ ఇవి చేపలు పట్టే వల. లంబాలు పట్టుకొనే వాళ్లని పట్టే వల కాదని చెప్తే మొక్కారూ




1960లో విడుదలైన ఎన్నో మంచి చిత్రాలలో శ్రీ ప్రొడక్షన్స్ వారి




గురించి ప్రత్యేకించి చెప్పకొని తీరాలి. సంగీత పరంగా గానే కాక మొత్తం సినిమాపరంగా కూడా తెలుసుకోదగ్గ విశేషాలు ఈ చిత్రంలో ఉన్నాయి . ఈ చిత్రానికి సి.యస్.రావు దర్శకుడు. మాటలు, పాటలు సముద్రాల జూనియర్ రాయగా - ఘంటసాల నేతృత్వంలో సంగీత శాఖ 8 పాటలను, అయిదు పద్యాలను, ఒక శ్లోకాన్ని ఈ చిత్రం ద్వారా అందించింది.

1950 దశకంలో బి.యస్.రామయ్య అనే రచయిత రాసిన 'మల్లియమ్ మంగళమ్' నాటకాన్ని ఆయన అనుమతితో 'శాంతినివాసం' అనే పేరిట నటులు పద్మనాభం, వల్లం నరసింహారావు కలిసి రేఖా అండ్ మురళీ ఆర్ట్స్ బ్యానర్ పై 100కు పైగా ప్రదర్శనలిచ్చారు. మూల రచయిత బి.యస్.రామయ్య వద్ద నేరుగా హక్కులు కొనుక్కుని కొన్ని మార్పులతో 'శాంతి నివాసం' పేరుతోనే సినిమాగా విడుదల చేస్తే ప్రేక్షకులంతా విపరీతంగా ఆదరించారా చిత్రాన్ని. ఈనాటికీ ప్రజల మన్ననలను అందుకుంటున్న పాటల ద్వారా సంగీత పరంగా ప్రత్యేకమైన గుర్తింపు తెచ్చుకున్న శాంతినివాసం చిత్రంలోని ఓ మూడు పాటల గురించి ఈ సంచికలో...

శ్లో : శ్రీరామచంద్రః ఆశ్రిత పారిజాతః
సమస్త కళ్యాణ గుణాభిరామః
సీతారాముఖాంబోరుహ చంచరీకః
నిరంతరం మంగళమాతనోతు...

పాట : శ్రీ రఘురాం జయ రఘురాం ॥శ్రీరఘు॥
సీతామనోభిరాం ॥శ్రీరఘు॥
అన్నదమ్ముల ఆదర్శమైన
ఆలుమగల అన్యోన్యమైన ॥అన్న॥
తండ్రి మాటను నిలుపుటకైన
ధరలో మీరే దశరథరాం ॥శ్రీరఘు॥
వెలయు నీ యెడా నీ దివ్యమూర్తి
వెలిగే నాయెడ ఆనందజ్యోతి ॥వెలయు॥
వెలసి మా గృహం శాంతినివాసం
సలుపవె శుభగుణ శోభిత రాం ॥శ్రీరఘు॥








చిత్రం 'శ్రీరామచంద్రః ఆశ్రితపారిజాతః' శ్లోకంతో మొదలై 'శ్రీ రఘురాం జయ రఘురాం' పాటకు దారితీస్తుంది. 'రామ కర్ణామృతం' అనే కావ్యంలోని 3వ అశ్వాసంలో 105వ శ్లోకంగా ఈ 'శ్రీరామచంద్రః ఆశ్రితపారిజాతం' శ్లోకం ఉన్నదని తెలిసింది. ఈ శ్లోకాన్ని ఆదిశంకరాచార్యుల వారు రచించగా చేకూరి సిద్ధకవి ద్వారా ప్రజలకు అందిందని అభించిన ఆధారాలు తెలుపుతున్నాయి. తరువాత వచ్చే 'శ్రీరఘురాం' పాట మాత్రం సముద్రాల జూనియర్ రాసినదే. కానీ శ్లోకం నుంచి పాటవరకు ఉన్న రచనా భాగం అంతా ఆయన పేరుమీదే చాలాచోట్ల ముద్రితం అవుతూ రావటంలో ఆయన బాధ్యత ఎంత మాత్రమూ లేదు. ఈ పాటను పి.బి.శ్రీనివాస్, పి.సుశీల పాడగా నాగయ్య, దేవిక, మాస్టర్ భీమశంకరం, మాస్టర్ బాలుపై చిత్రీకరించారు. స్వతహాగా గాయకుడు, సంగీత దర్శకుడు అయిన నాగయ్యకు సంగీత దర్శకుడైన గాయకుడు ఘంటసాల మరో గాయకుడు పి.బి.శ్రీనివాస్ చేత పాడించటం ఈ పాటకు చేకూరిన ఓ విశేషంగా చెప్పుకోవాలి. హంసధ్వని రాగానికి అతి చక్కని ఉదాహరణంగా చెప్పుకోదగ్గ పాట ఇది. ఈ రాగంలో వచ్చే 'సరిగ పనిస, సనిపగరిస' స్వరాలలో 'రి'షభాన్ని వాడకుండా పాటను స్వరపరచటం ఓ ప్రత్యేకత. అయితే ఆ రాగంలో పడకూడని దైవతాన్ని 'అన్నదమ్ముల ఆదర్శమైనా' దగ్గర 'వెలయు నీ యెడా నా దివ్యమూర్తి' దగ్గర వాడడం కేవలం దైవికం అనుకోక తప్పదు మరి. 'శాంతి నివాసం' నాటకంలో పాలగుమ్మి పద్మరాజు రాయగా ఎస్.జానకి పాడగా తొలి పాటగా వచ్చే 'అంతా నీ లీల గోపాలా' అనే పాటలోని చివర్నగల 'మా శాంతి నివాసము స్వర్గసీమగా చేయవె దేవా' అనే వాక్యాలు 'శ్రీరఘురాం' పాటలో 'వెలసి మా గృహం శాంతి నివాసం సలుపవె శుభ గుణ శోభితరాం'గా రూపుదిద్దుకున్నాయి.

ఆమె : రాగాలా సరాగాలా హాసాలా విలాసాలా
సాగే సంసారం హాయ్ సుఖజీవనసారం ॥రాగాలా॥
ఆమె : పతి పద సేవయే యోగముగా
నాతికి పతియె దైవముగా ॥పతి॥
అతడు: సతి సౌభాగ్యాలె తన భాగ్యమనె
భావనయే పతి ధర్మముగ ॥సతి॥ ॥రాగాలా॥
ఆమె : మాయని ప్రేమల కాపురమె
మహిలో వెలసిన స్వర్గముగా ॥మాయిని॥
అతడు: జతబాయని కూరిమి జంటగ మెరిసే
దంపతులె ఇల ధన్యులుగా ॥జత॥ ॥రాగాలా॥



ఈ పాటను ఘంటసాల, సుశీల పాడగా కాంతారావు, దేవికపై చిత్రీకరించారు. ఘంటసాల అత్యంత ఆప్యాయంగా ఉపయోగించే రాగేశ్రీ రాగం ఈ పాటకు ఆధారం. 'శాంతి నివాసం' నాటకంలో వీటూరి రాయగా ఎస్.జానకి, పి.బి.శ్రీనివాస్ పాడిన 'అనురాగ మొలికే ఆనంద సీమ' పాటలోని 'పతి పాదసేవ పరమార్థమూ, ఇలలోన శాంతికి ఇల్లాలి చలువే' వాక్యాలు 'రాగాలా సరాగాలా' పాటలో మొదటి చరణానికి ప్రేరణ అయ్యాయి.

అతడు : రాధ రావె రాణీ రావె రాధ నీవే కృష్ణుడు నేనే
రమ్యమైన శారద రాత్రి రాసలీలా వేళ ఇదే
ఆమె : రారా కృష్ణా రారా కృష్ణా రాధ నేనే కృష్ణుడు నీవే
రమ్యమైన శారద రాత్రి రాసలీలా వేళ ఇదే
ఆమె : ఒంపులతో సొంపమరే ఇంపొసగే యమునేదీ
అతడు: సుందరి నీ వాలు జడే సొగసైనా ఆ యమునా
ఆమె : నాటి తారాకోటులు వీరె నాటి పున్నమ జాబిలివీడే
రాధ నేనే కృష్ణుడు నీవే రాసలీల వేళ ఇదే
ఆమె : విరిసిన పూ పొదలేవీ విరివనిలో విభుడేదీ
అతడు: వికసించె నీ కనులా వెలిగేనే నీ విభుడు
ఆమె : మూగవోయే మానవ మురళి
మురిసి మోగే మోహన మురళి
అతడు: రాధ నీవే కృష్ణుడు నేనే రాసలీలా వేళ ఇదే
ఇద్దరూ: దేవి రాధా మాధవలీలా పావనమ్ము బృందావనము
మనము రాధా కృష్ణులమేలే మధురమాయే ఈ వనము



ఈ పాటను ఘంటసాల, జిక్కి గానం చేయగా అక్కినేని, రాజసులోచనపై చిత్రీకరించారు. షమ్మీకపూర్, మాలాసిన్హా హీరోహీరోయిన్లుగా 1959లో వచ్చిన 'ఉఝూలా' చిత్రం కోసం శంకర్- జైకిషన్ స్వరపరచిన 'ఝూమ్‌త మౌసమ్ మస్త్ మహీనా...' పాట ట్యూన్‌ని తీసుకొని - పాట పాడే పద్ధతిలో గల షమ్మీకపూర్ స్థాయిలోని తీవ్రతను తగ్గించి, అక్కినేని ఇమేజ్‌కి తగ్గట్టు సరళంగా మృదువుగా ఈ 'రావే రాధా రాణీ రావే' పాటను తయారు చేశారు హిందుస్థానీ భైరవి రాగం ఆధారంగా స్వరపరచబడిన ఈ 'ఝూమ్‌త మౌసమ్' ట్యూన్ ప్రజల హృదయాలలో ఎంతగా ముద్రించుకుపోయిందంటే - తెలుగు వెర్షన్‌కొచ్చేసరికి 'నాటి తారాకోటులు వీరె' దగ్గర తారని, కోటుని విడదీసి అనుచిత విభాగం (Wrong split) తో పాడినా జనం అంత సీరియస్‌గా తీసుకోలేదు. ఏది ఏమైనా ఒరిజినల్‌లోని 'యాలయాలా దిల్‌లేగయా' ట్యూన్‌కి తెలుగులో పొదిగిన 'రాసలీల వేళ ఇదే' వాక్యం ఏ మాత్రం దిగిపోలేదు సరికదా అది చక్కగా ఒదిగిపోయింది. మూలనాటకం 'శాంతి నివాసం'లో పాలగుమ్మి పద్మరాజు రాయగా ఉడత సరోజిని, సత్యారావు పాడగా మీనాకుమారి, పద్మనాభం అభినయించిన 'చెలియ ఇదియే బృందావనము' పాటలోని కృష్ణుడు, రాధ, యమునా నది వంటివి 'రావే రాధా రాణీ రావే' పాటకు కవితా వస్తువులుగా ఉపయోగపడ్డాయి. -(మిగతా పాటలు, పద్యాల గురించి వచ్చే సంచికలో)



## ఆ పాట మధురం అసాధారణం

# బర్మన్ సంగీతం

సచిన్‌దేవ్ బర్మన్‌కు తన పాటంటే ప్రాణం; తన పాటే ప్రమాణం; నిర్మాత పెత్తనం గానీ, నాయకుడి ఇమేజ్ గానీ ఆయనకు అవసరం లేదు. అందుకే ప్రతి పాటనీ, ఒక సంగీత శిల్పంగా ఆయన మలచగలిగాడు. ఆ పాటకు ఏ గాయకులు న్యాయం చేయగలరు? అన్నది ఆయనకు అత్యంత ముఖ్యమైన విషయం. ఒక్కొక్క సినిమాలో ఒక ప్రధాన హీరోకు, ఆయన అలవాటు పడ్డ గాయకుడే పాడాలని గానీ, అసలు ఒక్క స్వరంలోనే అన్ని పాటలూ ఉండాలని గానీ బర్మన్ దా ఎప్పుడూ భావించలేదు. ఎంత గొప్ప **గొంతయినా, ఆ సందర్భానికీ, ఆ పాటకూ అది అతకదనుకుంటె, హాయిగా ఆ గాయకుడిని కాదని, ఇంకొరకరికి ఇచ్చేయడానికి ఆయనకు ఎలాంటి మొహమాటాలు లేవు.**

అందుకే, 'అభిమాన్(1973)'లో అమితాబ్‌కు కిశోర్, రఫీ, మన్నా ముగ్గురూ పాడారు. విచిత్రం ఏమిటంటే, ఆ సినిమాలో అమితాబ్ ప్రొఫెషనల్ గాయకుడి పాత్ర వేసారు. అయినప్పటికీ, నిర్మొహమాటంగా మూడు గొంతుల్లో ఆయన్ని పాడించారు బర్మన్ దా. ఎందుకంటే, 'మీత్ నా మిలారే మన్‌కా' కిశోర్ స్వరంలోనే బాగుంటుంది; 'తేరీ బిందియారే ' రఫీ స్వరంలోనే అంత మధురంగా ఉంటుంది. తన పాట విషయంలో బర్మన్ దా రాజీపడే ప్రసక్తి లేదు. 'ప్యాసా(1957)'లో గురుదత్‌కి రఫీ, హేమంత్ ఇద్దరూ పాడారు. 'తీన్ దేవియా(1965)'లో దేవానంద్‌కి రఫీ, కిశోర్ ఇద్దరూ పాడారు.

బర్మన్ గురించి అందరికీ తెలిసిన కథే ఇది. గైడ్(1965)' సినిమాలో పాటలన్నీ కిశోర్ చేతే పాడించాలని నిర్మాత, నాయకుడు అయిన దేవ్ ఆనంద్ అనుకున్నారు. కానీ బర్మన్ ససేమిరా అన్నారు. 'తేరే మేరే సప్నే అబ్ ఏక్ రంగ్ హై', 'దిన్ ఢల్ జాయే హాయే రాత్ న జాయే', 'క్యాసే క్యా హోగయా' రఫీ కాక మరెవరైనా పాడితే ఎలా ఉండేవో ఊహిస్తేనే భయమేస్తుంది.

ఈశాన్య భారతానికి చెందిన సచిన్ దేవ్ బర్మన్ త్రిపురలోని ఒక రాజ వంశానికి చెందినవాడు. శాస్త్రీయ సంగీతంలో తన తండ్రి వద్దే శిక్షణ పొందాడు. 1930 నాటికి లలిత, జానపద సంగీతాల్లో గాయకుడిగా మంచి పేరు తెచ్చుకున్నాడు. మొదట బెంగాలీ సినిమా రంగంలో గాయకుడిగా ప్రవేశించి తర్వాత సంగీత దర్శకుడయ్యారు. 1944 నాటికి బొంబాయి చేరుకున్నాడు. 1946లో 'ఎయిట్ డేస్' అనే సినిమాకు సంగీతాన్నిచ్చినా, 1947లో 'దోభాయ్'లో గీతాదత్ పాడిన అజరామర గీతం 'మేరా సుందర్ సప్‌నా బీత్ గయా'తో అటు బర్మన్, ఇటు గీతా కూడా హిందీ సినీ రంగంలో స్థిరపడ్డారు.

నవకేతన్‌తో ఆయన స్నేహం 1950లో 'అఫ్సర్'తో ప్రారంభమై చాలా ఏళ్ళు కొనసాగింది. అటు తర్వాత నవకేతన్ వారి టాక్సీ డ్రైవర్(1954), ఫంటూష్(1956), నౌ దో గ్యారహ్(1957), తేరే ఘర్ కే సామ్నే(1963), గైడ్(1965), జువెల్ థీఫ్(1967), ప్రేమ్ పూజారి(1974) సంగీత పరంగానూ సూపర్ హిట్టయ్యాయి. నవకేతన్ నిర్మాణం అయినా కాకున్నా, దేవానంద్‌కూ, బర్మన్‌దాకు ఉన్న అనుబంధం అసాధారణమైనది. జాల్(1952), మునీంజీ(1955), పేయింగ్ గెస్ట్(1957), కాలాపానీ(1958), సోల్వాసాల్ (1958), బొంబాయి కా బాబూ(1960), బాత్ ఏక్ రాత్ కీ(1963), తీన్ దేవియా(1965), గేంబ్లర్(1975), విజయ్ ఆనంద్ నిర్మించిన తేరే మేరే సప్నే(1971) , చుపారుస్తమ్(1973) ఇందుకు కొన్ని ఉదాహరణలు.

అసలు బర్మన్ సినిమాలు హిట్ కాకపోయినా ఆయన సంగీతం సమకూర్చిన పాటలు మాత్రం విశేష జనాదరణ పొందాయి. ఇష్క్ పర్ జోర్ నహీ(1970), శరీఫ్ బద్మాష్(1973), చుపారుస్తమ్(1975) వంటి సినిమాలు ఈ కోవకు చెందినవే. బర్మన్ సంగీతం, ఒక్కొక్క చిత్ర విజయానికీ అత్యధికంగా దోహదం చేసేది. గురుదత్ సినిమాలు బాజీ(1951), జాల్(1952), ప్యాసా(1957), కాగజ్ కే ఫూల్ (1959)(చివరిది హిట్ కాకపోయినా, ఒక మైల్‌స్టోన్ సినిమాగా విజ్ఞులు పరిగణిస్తారు) ప్రేక్షకుల నుంచి, విమర్శకుల నుంచి అపురూపమైన ప్రశంసలు అందుకోవడానికి బర్మన్ సంగీతం కూడా చాలా వరకు కారణమని ఒప్పుకుతీరాలి. ఇది ఆ సినిమాలోని ఇతర అంశాలకు అగౌరవమేమి కాదు; వాటి గౌరవాన్ని పెంచేదే.

తన మొదటి సినిమా నుంచి, చివరి సినిమా వరకూ, తన తరం సంగీత దర్శకుల్లో కాలదోషం పట్టని సంగీత దర్శకుడెవరైనా ఉంటే, అది బర్మనే. అతని సంగీతంలోని తాజాదనమే ఇందుకు కారణం. శాస్త్రీయం, జానపదం, పాప్యులర్ బాణీలు మూడింటినీ సమపాళ్లలో రంగరించి, అభిమానులు సులువుగా కూనిరాగాలు తీయగల మధురమైన గీతాలు సృష్టించడం ఆయన ప్రత్యేకత. బర్మన్ బాణీలు పండితులను ఎలా ఆశ్చర్యచకితులను చేస్తాయో, పామరులను అంతే ఆకట్టుకుంటాయి. మెలోడీ రహస్యాలు ఇంత చక్కగా ఎరిగిన సంగీత దర్శకులు తక్కువే.

ఆయన బాణీల కోసం ఏ హార్మోనియంనూ పట్టుకునేవారు కాదట. వాకింగ్‌కు వెళ్ళినపుడూ, డ్రైవ్ చేస్తున్నపుడూ, ఇంకా చెప్పాలంటే, తనకెంతో ఇష్టమైన వ్యాపకం చేపలు పడుతున్నపుడూ ఆయనకు తటిల్లతలా ట్యూన్ స్ఫురించేదట. ఈ స్పాంటెనిటీ వల్లేనేమొ ఆయన పాటల్లో అంత జీవం ఉంటుంది.



హిందీ చలనచిత్ర రంగంలోని ఏ గాయకుడినీ, గాయనినీ తీసుకున్నా, వారి అత్యుత్తమమైన పది పాటల్లో, బర్మన్ పాట తప్పక ఉంటుంది. హేమంత్‌కుమార్ పాటల్లో హై అప్‌నా దిల్ (సోల్వాసాల్,1958), న తుమ్ హమే జానో (బాత్ ఏక్ రాత్ కీ,1962), తెరీ దునియామే జీనేసే (ఘర్ నంబర్ 44,1955), జానే వో కైసే (ప్యాసా,1957) అణిముత్యాలే. అన్నీ బర్మన్ దా అందించినవే.

బహుశా కిశోర్‌కుమార్ కంఠస్వరంలోని, గాన ఫణితిలోనే వైవిధ్యాన్ని కనిపెట్టింది బర్మనేనేమో. 'ఇక్ లడకీ భీగీ భాగీసి' (చల్‌తీకా నామ్‌గాడీ,1958) కిశోర్ చేత పాడించడంలో ఆశ్చర్యం లేదు. అది అతని టైపు పాటే. పైగా అతనే నాయకుడు. కానీ 'దుఖిమన్ మేరే సున్ మేరా కెహనా' (ఫంటూష్,1956) అతని చేత పాడించడం మాత్రం సాహసమే. కిశోర్ ఆ నమ్మకాన్ని వమ్ము చేయలేదు. ఆ తర్వాత కూడా 'గాంబ్లర్ (1971)'లో 'దిల్ ఆజ్ శాయర్ హై గమ్ ఆజ్ నగ్‌మా హై' అంత అద్భుతంగానూ పాడాడు. కిశోర్‌కు ఆశాతో, లతాతో అత్యద్భుతమైన యుగళ గీతాలు ఇచ్చింది కూడా బర్మనే (పేయింగ్ గెస్ట్, నౌదోగ్యారా(1957), తీన్ దేవియా, జువెల్ థీఫ్, అభిమాన్). అసలు బర్మన్ యుగళ గీతాలు తలచుకుంటె, అన్ని వయస్సుల వాళ్ళలోనూ పులకరింతలు గ్యారంటీ. 'ఛోడ్ దో అంచల్ జమానా క్యా కహేగా' నుంచి 'తారె మేరే మిలన్ కీ యే రైనా' వరకు యుగళాల్లో అన్ని మూడ్స్‌నీ పండించగలిగిన స్వరబ్రహ్మ బర్మన్‌దా.



జాగ్రత్తగా పరిశీలిస్తే, జయదేవ్, కిశోర్‌కుమార్‌ల సంగీతానికి మూలాలు బర్మన్ శైలిలో కనిపిస్తాయి. (హమ్ దోనో, ఝుమ్రూ). ఇక కుమారుడు రాహుల్‌దేవ్‌పై తండ్రి ప్రభావం సహజమే. ఛోటే నవాబ్, అమర్ ప్రేమ్ సినిమాల్లోని పాటల్లో తండ్రి స్వరాలు వినిపిస్తూనే ఉంటాయి. 'ఆరాధన'తో కిశోర్‌కి పునర్జన్మ, రాజేశ్ ఖన్నాకు అసలు జన్మ లభించడం వెనక బర్మన్ పాత్ర మరవలేనిది. అపుడపుడు ఇచ్చినా, తలత్‌కు, ముఖేష్‌కు కూడా బర్మన్ గొప్ప పాటలే ఇచ్చాడు. 'జాయే తో జాయే కహా' (టాక్సీ డ్రైవర్), 'జల్ తే హై జిస్‌కే లియే' (సుజాత,1959) తలత్ సూపర్ హిట్లలో చేరితే, 'చల్‌రీ సజనీ అబ్ క్యా సోచే' (బొంబాయి కా బాబూ,1960), ఓ జానేవాలే హో సకే తో లౌట్‌కే ఆనా (బందినీ,1963), ముఖేశ్ సూపర్ హిట్లలో చేరుతాయి.

అలాగే మన్నాడే సత్తా గుర్తించిన కొద్ది మందిలో బర్మన్ ఒకరు. 'పూఛో న కైసే మన్ రైన్ బితాయే',(మేరీ సూరత్ తేరీ ఆంఖే), 'తేరీ నైనా తలాశ్ కర్' (తలాశ్)వంటి శాస్త్రీయ సంగీత ప్రధానమైన పాట నుంచి, 'ప్యార్ కీ ఆగ్ మే తన్ బదన్ జల్ గయా' (జిద్దీ) వంటి కడుపుబ్బ నవ్వించే పాట వరకూ మన్నాదా రేంజ్‌ని పట్టుకున్న మహనీయుడు బర్మన్ దా.

ఇక రఫీ - సాధారణంగా బర్మన్‌దా పేరు చెప్పగానే అందరికీ కిశోర్ గుర్తు వస్తాడు. బర్మన్ ప్రధానగాయకుడు కిశోర్ అని భావించేవాళ్లు ఉన్నారు. కాని జాగ్రత్తగా పరిశీలిస్తే, ఆయన కిశోర్ కంటే ఎక్కువ రఫీ స్వరాన్నే వాడుకున్నాడు. ఆయన 'ఆల్ టైమ్ గ్రేట్' పాటల్లో రఫీవే ఎక్కువున్నాయి. ఉదాహరణకు - 'జిన్హే నాజ్‌హై హింద్ పర్ వో కహా హై', 'యే దునియా అగర్ మిల్ భీ జాయే తో క్యాహై' 'సర్ జో తేరా చకరాయే' (మూడు ప్యాసా), 'బిఛ్‌డే సభీ బారీ బారీ' (కాగజ్ కే ఫూల్), తేరే ఘర్ కే సామ్‌నే లోని అన్ని పాటలూ,'ఐసే తో న దేఖో', 'కహీ బేఖయాల్ హోకర్' (తీన్ దేవియా), సాథీ న కోయి మంజిల్, దీవానా మస్తానా (బొంబాయ్ కా బాబూ), గైడ్‌లోని మూడు సోలోలు, 'హమ్ బేఖుదీ మే తుమ్ కో పుకారే చలే గయే' (కాలా పానీ), ఖోయా ఖోయా చాంద్, అప్‌ని తో హర్ ఆహ్ ఎక్ తూఫాన్ హై (రెండూ కాలా బజార్,1960), అకేలా హు మై ఇస్ దునియామే (బాత్ ఏక్ రాత్ కీ,1962), మేరా మన్ తేరా ప్యాసా (గాంబ్లర్).. ఇలా ఇంత పెద్ద హిట్లు కాకపోయినా, ఇంకా చాలానే ఉన్నాయి, రఫీ, బర్మన్ కాంబినేషన్‌లో గొప్ప పాటలు. ఇందాకే చెప్పినట్లు, ఏ మూడ్‌కి, ఏ స్వరరచనకు ఏ గాయకుడు లేదా గాయని కుదురుతారన్న విషయంలో బర్మన్‌కున్నంత స్పష్టత మరెవరికీ లేదనిపిస్తుంది. లతా, ఆశాల విషయంలో కూడా ఆయన చాలా జాగ్రత్తగా ఈ పద్ధతిని పాటించారు. పేయింగ్ గెస్ట్‌లో యుగళ గీతాలన్నీ ఆశాకు ఇచ్చి విషాదభరితమైన 'చాంద్ ఫిర్ నికలా' మాత్రం లతాకు ఇవ్వడం ఒక ఉదాహరణ. ఆ రోజుల్లో, లతాకు ఒక్క పాటయినా ఇవ్వని సంగీత దర్శకులు ఉండేవారు కారు (ఓపీ నయ్యర్ మినహా. కానీ ఆయన కేసు వేరు). బర్మన్ మాత్రం, ప్యాసా, కాలా బజార్, సుజాత, కాగజ్ కే ఫూల్, బొంబాయి కా బాబు సినిమాల్లో లతాను తీసుకోలేదు. (వారి మధ్య ఏదో గొడవ జరిగిందని అనుకుంటారు.) గీతాదత్, ఆశాభోంస్లేల సంగీత జీవితంలో బర్మన్ దా నిర్వహించిన పాత్ర చాలా గొప్పది. 'ప్యాసా' పాటలు గీతాలోని వైవిధ్యాన్ని బయటకు తీసుకువస్తే, సుజాత, బందినీ, లాజ్వంతీ, ఆశా స్వరం లోతులను ప్రపంచానికి చాటి చెప్పాయి.

ఏ గాయకుడైనా బర్మన్ పాటంటే, ప్రత్యేక శ్రద్ధతో పాడినట్లుంటుంది. లతా ఒక ఇంటర్వ్యూలో బర్మన్‌దా ఎంత పర్ఫెక్షనిస్టో చెప్పారు. తను అనుకున్నట్టుగా పాడేవరకూ ఎన్ని టేకులైనా వదిలిపెట్టేవారు కాదని ఆమె అన్నారు. అందుకే, లతా ఆయనకు 'నభూతో నభవిష్యతి' అన్నట్టుగా పాడింది. గైడ్‌లోని 'పియా తోసే నైనా లాగేరే' 'మోసే చల్ కి యె జాయె', 'ఆజ్ ఫిర్ జీనేకి తమన్నా హై', ఘర్ నంబర్ 44 లో 'ఫైలీ హుయి హై సపనోంకి బాహే', కైసే కహూలో కైసే కహూ, తోసే మిలన్ కీ మై బతియా', జువెల్ థీఫ్‌లోని 'హోటోంపే ఐసి బాత్' అభిమాన్‌లోని 'నదియా కినారే', 'పియాబినా', 'అబ్‌తో హై తుమ్ సే' శర్మీలీలోని 'మేఘాఛాయే ఆధీరాత్' ఇందుకు కొన్ని ఉదాహరణలు మాత్రమే. కిశోర్ కూడా బర్మన్ కోసం ప్రత్యేకంగా పాడే వాడేమో అనిపిస్తుంది. 'ఫూలోంకి రంగ్ సే, దిల్‌కీ కలమ్‌సే' (ప్రేమ్ పూజారి) పాడినంత అందంగా బహుశా తన మొత్తం సంగీత జీవితంలో అతను ఏది పాడి వుండడు.

ఈ సూత్రం గాయకులందరికీ వర్తిస్తుంది. ఆఖరికి గాయకుడిగా తన

ప్రతిభను కూడా బర్మన్ గొప్పగా అంచనా వేసాడు. మామూలుగా హేమంత్‌కో, మన్నాడేకో ఇచ్చే కొన్ని పాటలను తనే పాడి, అసాధారణమైన తన ప్రతిభను చాటుకున్నాడు. బందినీలోని 'ఒరే మాఝీ, మేరే సాజన్ హై ఉస్‌పార్' విని ఒళ్లు గగుర్పొడవని వాళ్లుండరు. అలాగే 'వహా కౌన్ హై తేరా ముసాఫిర్' (గైడ్)లోని తాత్వికత, 'సఫల్ హోగి తేరీ ఆరాధనా' (ఆరాధన)లోని ఓదార్పు, 'సున్ మేరీ బంధూరే, సున్ మేరీ మిత్‌వా (సుజాత)లోని విషాద మాధుర్యం వినాలేతప్ప వర్ణించలేం.

ఇది పంచమ్‌దా యుగం. ఇప్పటి గాయకులు, శ్రోతలు, సంగీత దర్శకులు కూడా రాహుల్ దేవ్‌ని తలచుకున్నంతగా సచిన్‌దేవ్‌ని తలుచుకోకపోవడం ఆశ్చర్యకరం; విషాదకరం కూడా. రాహుల్ తక్కువ వాడని కాదు. కానీ తండ్రి అంశని ఎవరూ మాటవరసకైనా పేర్కొనకపోవడం ఆశ్చర్యమే. రాహుల్ దేవ్ బర్మన్ కాలానికి గొప్ప సంగీత దర్శకులు చాలా తక్కువ మంది మిగిలారు. సచిన్‌దా ఎలాంటి వాళ్ళతో పోటీ పడ్డారో తలుచుకుంటే ఆశ్చర్యం వేస్తుంది. నౌషాద్, మదన్‌మోహన్, రోశన్, ఓపినయ్యర్, శంకర్ జైకిషన్, సి.రామచంద్ర-ఇలాంటి వాళ్లు బర్మన్‌కు కంపెనీ. అందరి మధ్య, సంఖ్యలో తక్కువ సినిమాలకు సంగీతం సమకూర్చినా, అగ్రస్థానంలో నిలబడ్డం బర్మన్ ప్రత్యేకత. కథను, కథలోని మూడ్‌ని, పాత్రల చిత్తవృత్తినీ గాయకుల ప్రతిభనూ - అన్నిటినీ దృష్టిలో ఉంచుకుని, ఆపాతమధురమూ, అసాధారణమూ అయిన పాటలను అందించిన బర్మన్‌దా 1975లోనే 'యే దునియా అగర్ మిల్ భీ జాయే తో క్యాహై' అనుకుని వెళ్ళిపోయినా, ఆయన పాటలు, వాటి జ్ఞాపకాలు మనకు ఈ పాటని గుర్తుకుతెస్తాయి.

'జీవన్ కే సఫర్ మే రాహే, మిల్ తే హై బిచఢ్ జానేకో
ఔర్ దే జాతే హై యాదే, తనహాయి మే తడపానేకో' (మునీమ్జీ,1955)

బర్మన్ పాటల్ని ఏకాంతంలో పాడుకుని చూడాలి. గొప్ప అనుభూతి కలుగుతుంది.

**- మృణాళిని**

# ఎస్.డి.బర్మన్ హిట్స్

**చిత్రం: పేయింగ్‌గెస్ట్(1957) రచన: మజ్రూహ్‌సుల్తాన్‌పురి గానం: లతా**

చాంద్ ఫిర్ నిక్‌లా మగర్ తుమ్ న ఆయే
జలా ఫిర్ మేరా దిల్ కరూఁ క్యా మై హాయ్
యే రాత్ కహతీ హై వో దిన్ గయే తేరే
యే జాన్‌తా హై దిల్ కి తుమ్ నహీఁ మేరే
ఖడీ హూఁ మై ఫిర్ భీ నిగాహేఁ బిఛాయే
మై క్యా కరూఁ హోయి కి తుమ్ యాద్ ఆయే ॥చాంద్॥
సులగ్ తే సీనేసే ధువాఁ సా ఉడ్‌తా హై
లో అబ్ ఆవో కి దమ్ ఘుట్‌తా హై
జలాగయే తన్‌కో బహారోఁ సాయే
క్యా కరూం హోయ్‌కి తుమ్ యాద్ ఆయే ॥చాంద్॥

**చిత్రం: నౌ దో గ్యారా(1957) రచన: మజ్రూహ్ సుల్తాన్‌పురి గానం: కిశోర్**

హమ్ హై రాహి ప్యార్ కే హమ్ సే కుఛ్ న బోలియే
జో భి ప్యార్ సే మిలా హమ్ ఉసి కే హో లియే ॥హమ్‌హై॥
దర్ద్ భి హమేఁ కబూల్, చైన్ భి హమేఁ కబూల్
హమ్‌నే హర్ కలి కో హార్ మేఁ పిరోలియే
జో భి ప్యార్ సే మిలా
ధూప్ థీ నసీబ్ మేఁ తో ధూప్ మే లియా హై దమ్
చాందిని ఖిలి తో హమ్ చాందిని మేఁసే లియే ॥జో భి ప్యార్ ॥
దిల్ కా ఆస్‌రా లియే హమ్ తో బస్ యూ హి జియే
ఇక్ కదమ్ హఁస్ లియే ఇక్ కదమ్ రో లియే ॥జో భి ప్యార్॥
రాహ్ మేఁ పడేఁ హై హమ్ కబ్ సే ఆప్‌కి కసమ్
దేఖియే తో కమ్ సే కమ్ బోలియే న బోలియే ॥జో భి ప్యార్ ॥

**చిత్రం: టాక్సీడ్రైవర్(1954) రచన : సాహిర్‌లుథియాన్వి గానం: తలత్**

జాయే తో జాయే కహా
సమ్‌ఝేగా కౌన్ యహాఁ దర్ద్ భరే దిల్ కే జుబాఁ
మాయూసియోం కా మగమా హై జీనేఁ
క్యా రహ్ గయా హై ఇస్ జిందగీ మేఁ
రూహ్ మే గమ్, దిల్ మేఁ ధువా-జాయే తో....
ఉన్‌కా భీ గమ్ హై అప్‌నా భీ గమ్ హై
అబ్ దిల్ కీ బచనే కీ ఉమ్మీద్ కమ్ హై
ఇక్ కశ్‌తీ సౌ తూఫాఁ - జాయే తో....

**చిత్రం: కాలా బజార్(1960) రచన:శైలేంద్ర గానం:రఫీ**

అపనీ తో హర్ ఆహ్ ఇక్ తుఫాన్ హై
ఊపర్ వాలా జాన్‌కర్ అంజాన్ హై , అపనీ తో....
అబ్ తో హఁస్‌కే భీ అపనీ కిస్మత్ కో చమకా దే
కానోం మేఁ కుఛ్ కహదే జో ఇస్ దిల్ కో బహలా దే
యే భి ముష్‌కిల్ హై తో క్యా ఆసాన్ హై, ॥ఊపర్ వాలా॥
సర్ పర్ మేరే తు జో అపనా హాథ్ హి రఖ్ దే
ఫిర్ తో భటకే రాహి కో మిల్ జాయేంగే రాస్తే
దిల్ కి బస్తి బిన్ తేరే విరాన్ హై, ॥ఊపర్‌వాలా॥
దిల్ హి తో హై ఇస్‌నే షాయద్ భూల్ భి కి హై
జిందగీ హై భూల్‌కర్ హి రాహ్ మిలతీ హై
మాఫ్ కర్ బందా భీ ఎక్ ఇన్‌సాన్ హై, ॥ఊపర్‌వాలా॥

**చిత్రం: గైడ్(1965) రచన:శైలేంద్ర గానం: రఫీ**

క్యా సే క్యా హో గయా బేవఫా తేరే ప్యార్ మేఁ
చాహా క్యా క్యా మిలా బేవఫా తేరే.....
చలో సుహానా భరమ్ తో టూటా జానా కే హస్‌నా క్యా హై
కహతీ హై జిస్‌కో ప్యార్ దునియా క్యా చీజ్ బలా హై
దిల్ నే క్యా న సహా బేవఫా తేరే ప్యార్ మేఁ ॥క్యా సే..॥
తేరే మేరే దిల్ కే బీచ్ అబ్ తో సదియోం కే ఫాస్‌లే హై
యకీన్ హోగా కిసే కి హమ్ తుమ్ ఎక్ రాహ్ సంగ్ చలే హై
హోనా హై ఔర్ క్యా బేవఫా! తేరే ప్యార్ మే ॥క్యా సే...॥

**చిత్రం: ప్యాసా(1957) రచన:సాహిర్‌లుథియాన్వి గానం: గీతాదత్**

జానే క్యా తూనే కహీఁ, జానే క్యా మైనే సునీ
బాత్ కుఛ్ బన్ హీ గయీ, థర్‌థరాహట్-సీ హుయీ
జాగ్ ఉఠే ఖ్వాబ్ కయీ, బాత్ కుఛ్ బన్ హీ గయీ ॥జానే క్యా॥
నైన్ ఝుక్-ఝుక్ కే ఉఠే, పాఁవ్ రుక్-రుక్ కే ఉఠే
ఆ గయీ చాల్ నయీ, బాత్ కుఛ్ బన్ హీ గయీ ॥జానే క్యా॥
జుల్ఫ్ సీనే పర్ గిరీ, ఏక్ ఖుశ్‌బూ-సీ ఉఠీ
ఖుల్ గయే రాజ్ కయీ, బాత్ కుఛ్ బన్ హీ గయీ ॥జానే క్యా॥

అక్టోబర్ 22 సాహిర్ లుథియాన్వి వర్ధంతి సందర్భంగా...













# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

చిత్రం

కభీ కభీ

రచన

సాహిర్ లుధియాన్వి

సంగీతం

ఖయ్యామ్

గానం

ముకేశ్, లతా మంగేష్కర్

అభినయం

అమితాబ్ బచ్చన్, రాఖీ, శశికపూర్

## కభీ కభీ మేరే దిల్ మేఀ ఖయాల్ ఆతా హై

అ/ఆ : కభీ కభీ మేరే దిల్ మేఀ ఖయాల్ ఆతా హై
కి జైసే తుర్ఝుకో బనాయా గయా హై మేరే లియే (2)
తూ అబ్ సే పెహలే సితారోం మేఀ బస్ రహీ థీ కహీఀ (2)
తుఝే జమీఀ పే బులాయా గయా హై మేరే లియే (2)
అ/ఆ : కభీ కభీ మేరే దిల్ మేఀ ఖయాల్ ఆతా హై
కి యే బదన్ యే నిగాహేఀ మేరీ అమానత్ హైఀ (2)
యే గేసువోం కీ ఘనీ ఛాఀవ్ హై మేరీ ఖాతిర్
యే హోంఠ్ ఔర్ యే బాహేఀ మేరీ అమానత్ హై (2)
అ/ఆ : కభీ కభీ మేరే దిల్ మేఀ ఖయాల్ ఆతా హై
కి జైసే బజ్‌తీ హైఀ శహనాయియాఀ సీ రాహోం మేఀ (2)
అ : సుహాగ్ రాత్ హై ఘూంఘట్ ఉఠా రహా హూఀ మైఀ
ఆ : సుహాగ్ రాత్ హై ఘూంఘట్ ఉఠా రహా హూఀ మైఀ
సిమట్ రహీ హై తూ షర్మాకే అప్‌నీ బాహెూఀ మేఀ (2)
ఆ : కభీ కభీ మేరే దిల్ మేఀ ఖయాల్ ఆతాహై
కి జైసే తూ ముఝే చాహేగీ ఉమ్ర్ భర్ యూఀహీ
ఉఠేగీ మేరీ తరఫ్ ప్యార్‌కీ నజర్ యూఀహీ
అ : మైఀ జాన్‌తా హూఀ తూ గైర్ హై మగర్ యూఀహీ (2)
కభీ కభీ మేరే దిల్ మేఀ ఖయాల్ ఆతా హై
ఆ : కభీ కభీ మేరే దిల్ మేఀ ఖయాల్ ఆతా హై

'కభీ కభీ' వంటి ఆల్‌టైమ్ రొమాంటిక్ గీతాన్ని వ్రాసినది 'యే దునియా అగర్ మిల్ భీ జాయే తో క్యా హై' (ప్యాసా) వంటి హార్ట్ - హిటింగ్ పాటను వ్రాసిన సాహిర్ లుధియాన్వియే అంటే నమ్మబుద్ధి కాదు. ఇది ఆయన వెర్సటాలిటీకి నిదర్శనం. ప్రేమలోని మాధుర్యం తెలుపుతూ 'మిల్తీ హై జిందగీ మేఁ ముహబ్బత్ కభీ కభీ' వ్రాసిన ఆయన కలం ప్రాక్టికల్‌గా 'ఔర్ భీ గమ్ హైఁ జమానే మేఁ ముహబ్బత్ కే సివా' (లోకంలో ప్రేమ కాక ఇంకెన్నో బాధలున్నాయి) అని కూడా చాటింది. గురుదత్ తీసిన 'ప్యాసా'కు స్ఫూర్తినిచ్చిన 'పర్‌ఛాయియాఁ' అనే సాహిర్ కవితా సంకలనం లోని కవితలే రెండు దశాబ్దాల తర్వాత వచ్చిన 'కభీ కభీ' లో పాటలుగా మారాయి. ఆ పాటలే 'మైఁ పల్ దో పల్ కా షాయర్ హూఁ', 'కభీ కభీ మేరే దిల్ మేఁ ఖయాల్ ఆతా హై'. ఈ పాటలు అప్పట్లో దేశమంతా మారుమ్రోగిపోయాయి. సాహిర్‌కు అమరత్వాన్ని సంపాదించిపెట్టాయి.

దేవ్ ఆనంద్ నవ్‌కేతన్ బ్యానర్‌లో సాహిర్ తన కెరియర్ ప్రారంభదశలో ఎన్నో మ్యూజికల్ హిట్స్ వచ్చాయి. 'బాజీ' 'టాక్సీడ్రైవర్', 'హమ్ దోనో', 'కాలాపానీ', 'సి.ఐ.డి' చిత్రాలతో దేవ్ ఆనంద్ - సాహిర్ - ఎస్.డి.బర్మన్‌ల టీమ్ విజయకేతనం ఎగురవేసింది. గురుదత్ - సాహిర్‌ల అనుబంధం 'ప్యాసా' వంటి కళాఖండానికి ప్రాణం పోసింది. ఆ తర్వాత సాహిర్, బి.ఆర్.చోప్రా చిత్రాలకు అద్భుతమైన పాటలు వ్రాశారు. 'ధూల్ కా ఫూల్', 'వక్త్', 'గుమ్‌రాహ్', 'హమ్‌రాజ్' చిత్రాలలోని పాటలు చలన చిత్రాలలో కవిత్వానికి తలమానికంగా నిలిచాయి. బి.ఆర్.చోప్రా తమ్ముడు యష్‌చోప్రా 'దాగ్' చిత్రంతో తన సొంత బ్యానర్ ప్రారంభించినపుడు సాహిర్ అందించిన సాహిత్యం అన్నీ హిట్ పాటలనే ఇచ్చింది. ఆ తర్వాత సాహిర్ - యష్ చోప్రా కలిసి 'త్రిశూల్', 'దీవార్', 'కాలా పత్థర్' చిత్రాలలో హిట్ పాటలు అందించారు. 'కభీ కభీ' అయితే ఎవర్‌గ్రీన్‌గా నిలిచిపోయింది.

యష్ చోప్రా యాక్షన్ చిత్రాలు, రొమాంటికి చిత్రాలు సమపాళ్ళలో తీసిన దర్శకుడు. 'ఇత్తెఫాక్' చిత్రాన్ని పాటలు లేకుండా రూపొందించినా ఆయన చిత్రాలలో సంగీతానికి ఎంతో ప్రాముఖ్యత ఉంటుంది. 'కభీ కభీ' చిత్రం ఇందుకు భిన్నమేమీ కాదు. ఖయ్యూమ్ సాబ్ సంగీతం చిత్రం ఆద్యంతం ఆహ్లాదం కలిగిస్తుంది. శశికపూర్, అమితాబ్ బచ్చన్, వహీదా రెహమాన్, రాఖీ, రిషికపూర్, నీతూ సింగ్ వంటి భారీ తారాగణంతో ఈ చిత్రం రూపొందించబడింది. చిత్రం విడుదల సమయంలో న్యూమరాలజిస్టు సలహా ప్రకారం చిత్రం పేరు ఇంగ్లీషులో వ్రాసినపుడు Kabhi Kabhi చివర 'e' అక్షరం చేర్చారు. అందుకే చిత్రం పేరు Kabhi Kabhie అయింది. చిత్రసీమలో సెంటిమెంట్లు ఇలా ఉంటాయి. ఈ చిత్రం స్ఫూర్తితో కరణ్ జోహార్ దర్శకత్వం వహించిన 'కభీ ఖుషీ కభీ గమ్' చిత్రం పేరులో కూడా రెండవ 'కభీ' చివర 'e' చేర్చారు.

చిత్రంలో అమిత్ అనే యువకవి, అతని అభిమాని అయిన పూజా ప్రేమించుకుంటారు. అతని కవితలకు ఆమె ప్రేరణ అవుతుంది. కానీ ఆమె తల్లిదండ్రులు ఆమెకు వేరే సంబంధం చూసి పెళ్ళి చేస్తారు. ఆమె భర్త విజయ్‌కి కూడా అమిత్ కవితలంటే ఇష్టం. తొలిరాత్రి ఆమెకు అమిత్ వ్రాసిన కవితల పుస్తకం బహుమతిగా ఇచ్చి ఆమెను ఒక కవిత పాడమంటాడు. ఆ కవితే 'కభీ కభీ'. ఒక పురుషుని భావాలు స్త్రీ గళంలో పాటగా రావటం చాలా అరుదు. స్త్రీ భావాలు పురుషుని గాత్రంలో రావటం తరచుగా జరిగేదే. ఈ పాటలో అమిత్ భావాలు పూజా గొంతులో



పలుకుతాయి. అమిత్‌గా అమితాబ్ బచ్చన్, పూజాగా రాఖీ, విజయ్‌గా శశికపూర్ నటించారు.

'కభీ కభీ' అంటే అప్పుడప్పుడు. ఖయాల్ అంటే తలపు. సితారే అంటే తారలు. జమీఁ అంటే భూమి. 'మేరే లియే' అంటే 'నా కోసం' అని.

అప్పుడప్పుడు నా మదిలో తలపొకటి మసలుతుంది
నిన్ను దేవుడు మలచినది నా కోసమేనని
నీవింతకు ముందు తారల్లో ఉండేదానివనీ
నిన్ను భువికి రప్పించినది నా కోసమేననీ

ప్రేయసి ప్రేమలో మునిగిన ప్రియుడికి ఎన్నో ఊహలు వస్తాయి. ఆ ప్రియుడు కవి అయితే ఇక చెప్పేదేముంది. ఆమెను దేవుడు తన కోసమే చేశాడనిపిస్తుంది. దివిలో ఉండవలసిన తారకలాంటి ఆమె తన కోసమే భువికి రప్పించబడిందనిపిస్తుంది.

బదన్ అంటే శరీరం. నిగాహేఁ అంటే చూపులు. గేసూ అంటే కేశాలు, కురులు. ఘనీ ఛాఁవ్ అంటే దట్టమైన నీడ. 'మేరీ ఖాతిర్' అన్నా 'నా కోసం' అనే. హోంఠ్ అంటే పెదవులు. బాహేఁ అంటే కౌగిలి. అమానత్ అంటే ఆస్తి, సొత్తు.

**అప్పుడప్పుడు నా మదిలో తలపొకటి వస్తుంది**
**ఈ తనువు, ఈ చూపులు నా సొత్తని**
**చిక్కని ఈ కురుల నీడ నా కోసమని**
**ఈ పెదవులు, ఈ కౌగిలి నా సొత్తని**

ఆమె తనువు, చూపులు, పెదవులు, కౌగిలి అన్నీ తన సొంతమనిపిస్తాయి అతనికి. జీవితాంతం కలసి ఉండాలని కలలు కంటాడు. ఆమె నీడలో సేదతీరాలని ఆశిస్తాడు. ఇవన్నీ తలచుకొని ఆమె పాడుతుంటే తీరని కోరికల విషాదం పలుకుతుంది.

శహనాయీ అంటే సన్నాయి. రాహ్ అంటే దారి. సుహాగ్ రాత్ అంటే తొలిరాత్రి. ఘూంఘట్ అంటే మేలిముసుగు. సిమట్‌నా అంటే ఒదగటం. షర్మానా అంటే సిగ్గుపడటం.

**అప్పుడప్పుడు నా మదిలో తలపొకటి మెదలుతుంది**
**మన వలపు దారుల్లో సన్నాయి నాదాలు మోగుతున్నాయని**
**తొలిరేయి నీ మేలిముసుగు నే తొలగిస్తున్నానని**
**బిడియంతో నీలో నీవే ఒదిగిపోతున్నావని**

వివాహానికి సంకేతమైన సన్నాయినాదాలు వినిపించటమంటే వివాహం గురించి కలలు కనటమే. తొలిరేయి గురించి ఎన్నో ఊహలు; ఆమె సిగ్గుపడటం కూడా ఊహించుకోవటం అతని అమిత ప్రేమకు చిహ్నం. ఉత్తరాదిన మేలిముసుగు సంప్రదాయం ఉంది. మేలిముసుగు తొలగించి ముఖం చూపించటాన్ని 'ముఁహ్‌దిఖాయీ' అంటారు. తన మేలిముసుగును అతనే తొలగిస్తాడని ఆశించిన ఆమె కోరిక కోరికగానే మిగిలిపోయింది.

'ఉమ్ర్ భర్' అంటే 'జీవితమంతా' అని. నజర్ అంటే చూపు. గైర్ అంటే పరాయి. 'యూఁహీ' అంటే 'ఇలాగే' అని. 'ఊరికే' అనే అర్థంలో కూడా వాడతారు.

**అప్పుడప్పుడు నా మదిలో తలపొకటి వస్తుంది**
**నీవు నన్ను కడదాకా ఇలాగే ప్రేమిస్తావని**
**ప్రేమ నిండిన చూపుతో ఇలాగే చూస్తావని**
**నీవు నా దానివి కాదని తెలుసు, అయినా ఊరికే**
**అప్పుడప్పుడు నా మదిలో తలపొకటి తొంగిచూస్తుంది**

ఆమె సౌందర్యం, ఆమెను తనదానిని చేసుకోవటం గురించే కాక జీవితాంతం ఆమె తోడుగా ఉండాలని కూడా అతను కోరుకున్నాడు. చివరిదాకా ఆమె తనను ప్రేమించాలని కోరుకున్నాడు. 'మైఁ జాన్‌తా హూఁ తూ గైర్ హై మగర్ యూఁహీ' అనే లైన్ కవితలోనిది కాదు. పూజా పెళ్ళయిన తర్వాత అమిత్ భావాల్ని చెప్పే లైన్ ఇది. ఆమె తనది కాకపోయినా ఆమె తనను ప్రేమిస్తూనే ఉంటుందని ఆశిస్తున్నాడు.

ముకేశ్, లతాల గళాలలో ఈ పాట ప్రేమ మాధుర్యాన్ని, ప్రేమ మిగిల్చే వేదనని అద్భుతంగా ఆవిష్కరించింది. నేటికీ ఈ పాట నిత్యనూతనంగా ఉండటం సాహిర్ - ఖయ్యామ్ - ముకేశ్ - లతాలు సాధించిన విజయం.

**- పి.వి.సత్యనారాయణ రాజు**

# ‘నువ్ విజిలేస్తే ఆంధ్రాసోడా బుడ్డీ’

## పాట కథా, కమామీషూ



‘నువ్ విజిలేస్తే ఆంధ్రాసోడా బుడ్డీ’ అనే పాట ఎలా పుట్టిందన్న చర్చలో సంగీత దర్శకుడు ఎమ్.ఎమ్.కీరవాణి చెప్పిన విషయాలివి.

‘తప్పుచేసి పప్పుకూడు’ అనే సినిమాకి పాటలు కంపోజ్ చేయడానికి మోహన్‌బాబుగారి ఆఫీసులో సిట్టింగ్స్ జరుగుతూండేవి. కోదండరామిరెడ్డి గారు, కో-డైరెక్టర్ బాలుగారు, మోహన్‌బాబుగారు, సుద్దాల అశోక్‌తేజగారు వీళ్ళంతా ఉంటూండగా రోజూ నేను రావడం - కంపోజ్ చేసి మధ్యాహ్నం బ్రేక్ తీసుకోవడం - అనే పద్ధతిలో



కంపోజింగ్ అవుతుండగా... ఒకరోజు మధ్యాహ్నం భోంచేసిన తర్వాత ఎందుకో స్వీట్ తినాలనిపించింది. భోంచేసిన తర్వాత మస్ట్‌గా స్వీట్ తినే హాబిట్ ఉండేది నాకు. సరే "ఏమున్నాయి" అని అడిగితే "ఏమి లేవు సార్ తెమ్మంటారా" అన్నాడు ప్రొడక్షన్ కుర్రాడు. 'వద్దులే నేనే తెచ్చుకుంటాను... కూర్చొని కూర్చొని బోరుకొట్టింది' అని చెప్పి, పుల్లారెడ్డి స్వీట్స్ స్టాల్‌కి వెళ్ళి, అక్కడ రెండు మూడు రకాల స్వీట్స్.... (నాకు జీడిపప్పు బెల్లం అచ్చు అంటే బాగా ఇష్టం) ప్యాక్ చేయమని చెప్పి నిలబడి చూస్తున్నాను. అక్కడ లోపల పనిచేసేవాళ్లు... ఆపరేషన్ థియేటర్‌లో డాక్టర్స్, సిస్టర్స్ తొడుక్కుంటారు చూడండి... అలాంటి గ్లవ్స్ తొడుక్కుని క్లీన్‌గా స్వీట్స్ ప్యాక్ చేస్తున్నారు. వాళ్ళు అంత సిస్టమేటిక్‌గా స్వీట్స్ ప్యాక్ చేయడం అవన్నీ చూసి వెయిటింగ్‌లో వున్న నాకు ఒక ఐడియా వచ్చింది.

'నీ అధరామృతం పుల్లారెడ్డి, అరకేజి అప్పుగా ఇస్తే కడతా వడ్డీ మీద వడ్డీ' అని 'పుల్లారెడ్డి'కి 'వడ్డి'ని ప్రాసగా అనుకొని వెంటనే దానికి ట్యూన్ సరదాగా అనుకొని మోహన్‌బాబుగారికి వినిపించాను. "తమాషాగా బాగుందికాని మన సినిమాలో పడదేమో బాబూ, మన సినిమాకి వేరే టైప్‌లో కావాలి" అని ఆయన అన్నారు. సో... నేను దాన్ని స్టాక్‌లో పెట్టాను.

తర్వాత వి.యం.సి. దొరస్వామిరాజు గారు మొట్టమొదట నాకు పరిచయం లేని ఓ డైరెక్టర్‌తో సినిమా తీసేటప్పుడు "చంద్రబోస్‌గారు, నేను కూర్చొని మంచి మాస్ సాంగ్స్ కంపోజ్ చేస్తామండి. మాకు వదిలేసేయండి" అని అన్నాం. మామీదున్న నమ్మకంతో 'అలాగే కానివ్వండి' అన్నారాయన. అప్పుడు ఈ పాటని డెవలప్ చేయడం జరిగింది. దీనికి 'నువ్ విజిలేస్తే ఆంధ్రా సోడా బుడ్డీ' అని చంద్రబోస్‌గారు ఎన్.టి.ఆర్ మాస్ ఇమేజ్‌కి తగినట్టుగా పాట రాయడం, ప్రాజెక్ట్ ఛేంజ్ అయినప్పుడు అది రాజమౌళికి బాగానచ్చి పెట్టుకుంటాననటం... ఆ పాట ఫైనల్‌గా 'సింహాద్రి' సినిమాకి ఒక మెయిన్ సాంగ్‌గా నిలిచిపోవటం... ఆ తర్వాత ప్రేక్షకాదరణ పొందడం ఇదంతా మీకు తెలిసిందే.

ఇప్పుడు పాట పుట్టిన తర్వాత స్టోరీ చెప్తానండి. కొన్నిపాటలకి పుట్టక ముందర ఇంట్రస్టింగ్ స్టోరీ ఉంటే కొన్నిటికి హిట్ అయిన తర్వాత ఉంటుంది. ఈ పాట విని సీతారామశాస్త్రి గారు "అధరామృతం లిక్విడ్ కదా! లిక్విడ్ ఎక్కడన్నా కేజీలలో ఉంటుందా? లీటర్‌లో అని ఎందుకనలేదు?" అని కొంచెం సరదాగా అన్నారు. 'ఇలా అన్నారు శాస్త్రిగారు' అని నేను ఇంటికెళ్ళి నా వైఫ్‌తో చెప్పాను. 'ఇంట్లో భార్యలు అన్ని వండిపెడుతుంటే - ప్రొఫెషన్‌లో మునిగి తేలడం తప్ప జనరల నాలెజ్ లేదు మీకు' అని తిట్టింది. 'ఎందుకలా తిడతావు' అన్నా. 'నూనె కేజీ ల్లెక్కనే అమ్ముతారు. నూనె లిక్విడ్ కాదా! అలాగే తేనె కూడా... ఇన్ని లీటర్ల తేనె అని ఎవ్వరు అమ్మరు. చెప్పండి శాస్త్రిగారికి' అన్నది సరదాగా. ఇలా సరదాగా మేం ఒకరికొకరం అనుకోవడం మాకు పరిపాటే.

'నీ అధరామృతం పుల్లారెడ్డి అంటే ఏంటో అని తెలిసిన వాళ్ళు పాడితే బాగా వస్తుందేమో - టిప్పు కన్నా బాలు గారు పాడితే బెటర్‌గా ఉంటుందేమో...' అని కొందరు అన్నారండి. నేను కూడా ఓ.కే అనుకున్నాను. లాస్ట్ మినిట్‌లో మాకు టైమ్ లేక టిప్పు వాయిసే ఉంచాం. రాజమౌళి డైరెక్షన్ చేసిన 'స్టూడెంట్ నెం1'లో టిప్పు పాడిన 'కూచిపూడికైనా' హిట్ అవడంతో 'ఇదీ బాగానే వుంది ఉంచేద్దాం' అనుకున్నాం. సినిమా ఫీల్డ్‌లో సెంటిమెంట్లు ఎక్కువ కదండి. అందుచేత అలా ఉంచడం జరిగింది.

ఈ పాటలోని 'నీ గుర్రం కోసం తెచ్చా నేనే వెచ్చనైన గడ్డి...' అనే వాక్యం మీద ఘాటు ఘాటుగా విమర్శలు వచ్చాయి. శ్రేయసునీల్ అనే ఆవిడ అమెరికా నుంచి ఓ వెబ్‌సైట్‌లో బాగా తిట్టారు కూడా.

ఈ ఒక్క పాట ప్రీవియస్ ప్రాజెక్ట్‌లోంచి నచ్చి తీసుకున్నాం. ఈ పాటను ఎలా షూట్ చేయాలి అనే డిస్కషన్ వచ్చినప్పుడు, అప్పుడు పనిచేసిన డ్యాన్స్ డైరెక్టర్ "ఈ పాట పేలదండీ సినిమాలో డ్యాన్స్‌కి అనువుగా బీజియమ్స్ లేవు" అని రిమార్కు పాస్ చేసాడు. సరే దొరస్వామిరాజుగారికి నాకు ఉన్న అప్యాయానుబంధం వల్ల నేను వైల్డ్‌గా రియాక్టవ్వలేదు. తర్వాత రాజమౌళికి ఈ ప్రాజెక్ట్ వెళ్ళినప్పుడు ఆ రిమార్క్సు చేసిన డ్యాన్స్ డైరెక్టరుతో కాకుండా వేరే డ్యాన్స్ డైరెక్టరుతో తీసి నిరూపించాడు. ఇంతవరకూ నేను చెప్పింది సత్యం.

ఇక ఈ పాట గురించి సరదాగా ఊహించి ఏమైనా చెప్పమంటే - 'కోక బ్యాంకు లాకర్‌లోనా దాచుకోకు వేడి, చెక్కులిస్తే చిక్కొస్తుందే ఇచ్చుకోవే డీడీ' అన్నారు చంద్రబోస్‌గారు. అంటే ఏ ప్రొడ్యూసర్ ఆయనకి చెక్కిస్తే బౌన్సయిందో మనకు తెలియదు. సినిమా ఫీల్డ్‌లో ఆయనకుగల అనుభవాన్ని ఆధారం చేసుకుని చెక్కుకంటే డీడీ బెటర్ అని ఫీలై దాన్నే లిరిక్‌లో రాశారేమో...!? అని నా ఊహ.

**ఇలా కీరవాణి 'హాసం'తో తన మనోభావాలు పంచుకుంటూండగా స్టూడెంట్ నెం1, సింహాద్రి చిత్రాల దర్శకుడు రాజమౌళి ఆ రూమ్‌లోకి అడుగుపెట్టారు. 'నువ్ విజిలేస్తే ఆంధ్రా సోడాబుడ్డీ' పాటను ఎంతో జనరంజకంగా చిత్రీకరించిన ఆయన్ని ఇంటర్వ్యూ చేయాలనిపించి, అడగ్గానే - వెంటనే స్పందించి - అడిగిన ప్రతి ప్రశ్నకూ ఆనందంగా - ఆసక్తిదాయకంగా ఆయనిచ్చిన సమాధానాలివి.**

స్టూడెంట్ నెం 1 అయిపోయిన తర్వాత వి.యం.సి తో మా పెద్దన్న (కీరవాణిని రాజమౌళి 'పెద్దన్న' అని పిలుస్తారు) మ్యూజిక్ డైరెక్షన్‌లో ఎన్.టి.ఆర్‌తో ఓ ఫిల్మ్ మొదలైందండి. జనరల్‌గా పెద్దన్న చేసిన పాటలు వినడం అలవాటండి. విని ఇది బాగుంది ఇది బాగాలేదు అని అనుకుంటూ ఉంటాం. అలా ఈ పుల్లారెడ్డి సాంగ్ కూడా వినిపించాడు. సెకండ్ థాట్ లేకుండా ఇమ్మీడియట్ లైకింగ్. దాంతో పాటు 'ఈ పాట మనకి కాకుండా పోతోందే' అని చాలా బాధపడ్డాను. నాకు మాస్ సాంగ్స్ చాలా ఇష్టం. అటు తిరిగి ఇటు తిరిగి ఆ ప్రాజెక్ట్ నాకే వస్తుందని ఎక్స్‌పెక్ట్ చేయలేదు. రాగానే చాలా హ్యాపీగా ఫీలయ్యాను.

ఏడు రోజులు షూట్ చేశాం ఈ పాటని. మనకున్న డ్యాన్స్ డైరెక్టర్లో రాజశేఖర్ బెస్ట్ డైరెక్టర్. ప్రతిది కూడా ఇలా ఉంటే బాగుంటుంది ఇలా ఉంటే బాగుంటుంది అనుకున్నాం. జనరల్‌గా ఫాస్ట్ బీట్ ఉంది కాబట్టి ఎక్కువగా డ్యాన్స్ స్టెప్పులు పెట్టేస్తారు. ఎంత బీట్ ఉన్నా కంటిన్యూస్‌గా బిగినింగ్ నుంచి ఎండ్ వరకూ స్టెప్స్ కాకుండా ఆ మాస్ కందేటట్లుగా ముందు లుంగీ కట్టుకొని వస్తూంటే జనాలు చూసి పారిపోతుంటే సోడాబుడ్డీ తీసుకొని పైకేసి పట్టి... అలా ఒక చిన్న స్టోరీ లాగ చేసాం.

**సినిమాలో ఈ పాట ఇరికించినట్టుగా లేదూ?**

డెఫినెట్‌గా ఇరికించినట్లేనండి. కథలో వచ్చే సాంగ్ ఏమీ కాదు. కాకపోతే స్క్రీన్‌ప్లే సూత్రాలు కొన్ని ఉంటాయండి. సాడ్ సీన్ వచ్చిన వెంటనే కామెడీ సీన్ రాకూడదు. క్లయిమాక్స్ వచ్చేసరికి బేస్ పడిపోకుండా డెవలపవుతూ రావాలి. కథలో ఇన్‌వాల్వ్ అవుతూ వెళ్ళాలి. స్క్రీన్‌ప్లే ఒక సైన్స్‌లాంటిది. సైన్స్‌లో కొన్ని ఫార్ములాలు ఉన్నట్టు, అవి ఎక్కడా బ్రేక్ కాకుండా స్క్రీన్‌ప్లే రెడీ చేస్తామండి. బట్ కమర్షియల్ సూత్రాలు వేరండి. ఎట్ టైమ్ వి కెన్ బ్రేక్ దట్ రూల్. క్లయిమాక్స్‌కు ముందు మంచి ఊపున్న పాట ఒకటి ఇస్తే ఆడియన్స్ యాక్టివేట్ అయి కూర్చుంటారు అన్నది కమర్షియల్ సూత్రం. స్క్రీన్‌ప్లే ప్రకారం అయితే అది తప్పు. బట్ స్క్రీన్‌ప్లే సూత్రాలు వేరు, కమర్షియల్ సూత్రాలు వేరు. కథలో ఇముడుతూ అక్కడ పాట రావడం అనేది ఇంకా బెటర్. దాంట్లో అర్గ్యుమెంట్ లేదు. బట్ కమర్షియల్ సూత్రం ప్రకారం అక్కడ బ్రేక్ సాంగ్ పెట్టినా కూడా ఇట్స్ ఓకే.

**అలా స్టూడెంట్ నెం1 లో కూడా పెట్టారా?**

పెట్టాను. 'ఏంచెట్టి చేశాడే ఆ బ్రహ్మ' పాట. నిజానికి స్టూడెంట్ నెం1లో ఆ లాస్ట్ సాంగ్ అవశ్యకత కథకి ఏమాత్రం లేదండి.

**ఇదే సూత్రం మీద భవిష్యత్తులో కూడా చేస్తారా?**

అది ప్రాజెక్ట్ బట్టి ఉంటుంది. ఆ ప్లేస్‌లో ఆడియన్స్‌కో ఊపున్న పాట



పెడితే ఎనర్జీ రిజనరేటవుతుందని అనిపిస్తే ఫ్యూచర్‌లో కూడా పెడతాను.

'బాషా' సినిమాలో రజనీకాంత్ ప్రత్యర్థిని ఫట్‌మని కొట్టగానే ఎలక్ట్రిక్ పోల్‌లొంచి విద్యుత్ రవ్వలు రాలినట్టు ఈ పాటలో కూడా ఎన్.టి.ఆర్ సోడాబుడ్డీ వెనక్కి విసిరేస్తే వచ్చినట్టు చూపించారు. అలాంటి వైలెంట్ ఎఫెక్ట్‌లు స్టంట్‌సీన్స్‌లో వుండడం సహజం... మరి మీరు ఇలాంటి రొమాంటిక్ సాంగ్‌లో పెట్టడం ఎంత వరకూ కరెక్టు?

కమర్షియల్ స్టైయిల్ అంతేనండి. బేసిక్‌గా అది సూపర్ హీరోయిజమండి. రాముడు ఒక బాణం వేస్తే ఏడు తాటి చెట్లు పడిపోయాయి అంటే బేసికల్‌గా రాముడు దేవుడన్నది పక్కన పెట్టితే అది సూపర్ హీరోయిజం. ఆల్‌మోస్ట్ 100 రోజులు కంప్లీట్ అయిపోయిన తర్వాత కూడా ఇవాళ విజిలేస్తే ఆంధ్రాసోడాబుడ్డీ అనగానే ఎన్.టి.ఆర్, లుంగీ, నిక్కరు, మెళ్ళో రుమాలు, కళ్ళజోడు, బీడీ, సోడాబుడ్డీ వెనక్కి విసరటం, రవ్వలు రాలడం ఇవే గుర్తొస్తున్నాయంటున్నారంతా... సో... జనం సూపర్ హీరోయిజం లైక్ చేస్తారని బుజువైనట్టే కదండీ... ■

ఆ: నువ్ విజిలేస్తే ఆంధ్రా సోడాబుడ్డీ.. ॥2॥
అది వినబడుతుంది అలజడి రేగి
జారుతుంది మిడ్డీ..
అ: నీ అధరామృతం పుల్లారెడ్డీ.. ॥2॥
అరకేజి అప్పుగా ఇస్తే కడతా వడ్డీ మీద వడ్డీ.. ॥నువ్॥
అ: కన్నెబాడి కాదమ్మో అది జీడిపప్పు జాడీ..
నిన్ను చూసి పట్టా తప్పే పడుచు రైలు గాడీ..
ఆ: ఎన్ని కోట్ల విలువుంటుందో నువ్వు కాల్చు బీడీ..
ఎప్పుడంకుల్ అవుతాడయ్యో నిన్ను కన్న డాడీ..
అ: వేస్తా బేడీ.. చేస్తా దాడి.. సొగసుల బావిని తోడి..
ఆ: రారా రౌడీ దాదా కేడీ రాత్రికి చూసెయ్ త్రీడి
నీ గుబ్బం కోసం తెచ్చా నేనే..
నీ గుబ్బం కోసం తెచ్చా నేనే వెచ్చనైన గడ్డీ ॥నీ అధ॥
ఆ: నువ్వు విజిలేస్తే ఆంధ్రా సోడా బుడ్డీ..
అ: డ్డీ.. డ్డీ.. డ్డీ..
అ: కోక బ్యాంకు లాకర్లోనా దాచుకోకు వేడి..
చెక్కులిస్తే చిక్కొస్తుందే ఇచ్చుకోవే డీడీ..
ఆ: నువ్వు తాకకుంటే పువ్వు పోవునంట వాడి..
సుబ్బరంగా సుఖపడిపోరా దాన్ని నువ్వు వాడి..
అ: అరె పుంజుకు కోడి.. పంటకు పాడి..
నువ్వూ నేనొక జోడీ..
ఆ: చింతల్‌పూడి చిలకల్‌పూడి పోదామా జతకూడి..
ఓరయ్యో నీది చెయ్యేకాదు..
అ: ఓయ్
ఆ: ఓరయ్యో నీది చెయ్యేకాదు.. విశాఖ ఉక్కు కడ్డీ ॥నువ్॥
ఆ: వేస్కో వేస్కో... విజిలేస్కో..

'నువ్‌విజిలేస్తే...' పాటకు
పేరడీగా - సెప్టెంబరులో వచ్చిన
గణపతి నవరాత్రులలో విశాఖపట్నం నుండి
విడుదలైన ఓ ఆడియో క్యాసెట్‌లోని కొంత భాగమిది.
ఈ పాటకు రచన: మద్దివేని శ్రీనివాస్
సంగీత నిర్వహణ: జి.ఎల్. నాందేవ్, నవీన్‌కుమార్
గానం: జి.శ్రీనివాస్, మద్దివేని శ్రీనివాస్.

దరువేస్తే ధనధన డప్పుల మోత
చిందుల్లో గలగల గజ్జెల మోత
గణపతి పండుగ నవరాత్రుల్లో సంబరాల మోత ॥దరువేస్తే॥
ఊరురా ఉత్సవాల జోరు
ఉప్పొంగే సంతోషాల హోరు
బొజ్జా గణపతి నిమజ్జాల్లో భక్త జనుల జోరు ॥దరువేస్తే॥
మూషికాన్ని ఎక్కినవాడు ముల్లోకాలేలేవాడు
ముందు పూజలందుకునేటి
ముద్దుల గణపతి పండుగ
ఏకదంతమున్నవాడు ఏనుగు శిరసున్నవాడు
ఎల్లలోకాలను ఏలగ
ఎట్లా బైలెల్లె సూడు
నింగీ నేలా ఏకం చేసే నిమజ్జాల జాతర
ఉమా మహేశ్వర ముద్దుల తనయుని
ఊరేగించే మోతరా
ఆ దేవుళ్ళంతా చిందులువేసే...
ఆ దేవుళ్ళంతా చిందులు వేసే
భూలోకపు వింత ॥దరువేస్తే॥

## చంద్రబోస్ స్పందన...

**'నువ్ విజిలేస్తే ఆంధ్రా సోడాబుడ్డీ' పాటపై వచ్చిన విమర్శల గురించి చంద్రబోస్‌తో ప్రస్తావించగా ఆయన ఇచ్చిన వివరణ ఇది.**



'అన్నంతో తీరని ఆకలి - నీటితో తగ్గని దాహం ఉందీ, దానికి ఈడు విస్తరిలో అందాల భోజనం వడ్డించు' అనే ప్రయోగాలు చాలా పాటలలో వచ్చాయి. 'నీ ఆకలి అనే గుర్రానికి నా అందం అనే వెచ్చనైన గడ్డిని (హాఫ్ బేక్డ్ అనుకోవచ్చు లేదా హాట్ ఫాస్ట్‌ఫుడ్ అనుకోవచ్చు) ఆహారంగా అందజేయ దలచుకున్నాను' అనే భావాన్ని కనుక తీసుకుంటే ఆ విమర్శల్లో అర్థమే లేదనిపిస్తుంది.

రాజాగారూ! పాటలపట్ల మీకున్న పరిజ్ఞానం వల్ల, పాటల పరిశోధన పట్ల మీకున్న ఆసక్తి వల్ల, సినీ సంగీత సాహిత్యాలకు మీరు చేస్తున్న కృషి వల్ల అడిగే అర్హత మీకుంది చెప్పే బాధ్యత నాకుంది.

ఈ పాటకు లభించిన జనాదరణ చూసిన తర్వాత, ఇంత వివరించిన తర్వాత, ఇంకెవరు ఈ ప్రశ్నడిగినా మౌనం వహించటం తప్ప నేను ఇంకేమీ చేయలేను.

**1**

రచన: భాస్కరభట్ల రవికుమార్
గానం : రఘుకుంచే, కౌసల్య

ఆ: ఏనాటికీ మనమొకటేనని ఏ చీకటి ఇటు రాలేదని
పొరపాటుగా అనుకున్నామని తెలిసిందిలే కలగన్నామని
కన్నీరు జోరయ్యింది ఆ నీరు ఏరయ్యింది నువ్వు లేక సంతోషమా
వాకిట్లో వాసంతాలు ఆనాటి సాయంత్రాలు నువ్వులేక శూన్యం సుమా
అ: నా తోనే నువ్వు వుంటానని ఆ రోజే నువ్వు అన్నావని
ఎలా నేను మరిచేది ఓ నేస్తమా ॥ఏనాటికీ॥
ఆ: నీ కోసమే మిగిలున్నానిలా నువ్వురాక నేనింక ఎన్నాళ్లిలా
అ: నా గుండెలో నీ ఆలోచనా నా కంటి పాపల్లో ఆవేదనా
ఆ: ఇది నీ మౌనరాగాల సంకీర్తనా ఇలా చూడు ఏ వైపు అడుగేసినా
అ: నీలోనే సగమున్నాననీ నీ కోసం మిగిలున్నాననీ
ఎలా నీకు తెలిపేది ఓ నేస్తమా ॥ఏనాటికీ॥
ఆ: మరుపన్నది ఇటు రాదే ఎలా నా మనసుకేమైంది లోలోపలా
అ: వలపన్నది చెలరేగే అలా ఎదలోన దాగుండి పోదే ఎలా
ఆ: జడివానలా వచ్చి తడిపేయవా ప్రియా అంటు ప్రేమార పిలిచేయవా
అ: నీవైపే ఎద లాగిందని నీ చూపే అది కోరిందని
చెలీ నీకు తెలిశాక చెలగాటమా ॥ఏనాటికీ॥
అ: నా తోనే నువ్వు వుంటానని ఆ రోజే నువ్వు అన్నావని
ఎలా నేను మరిచేది ఓ నేస్తమా



**2**

రచన: కందికొండ
గానం : రవివర్మ, రేవతి

అ: గోల్డ్‌రంగు పెదవులు బాగున్నావి...
కో: ఓఓఓ... ఓఓఓ...
అ: నన్ను నీ వైపురా రమ్మన్నావి
కో: ఓఓఓ... ఓఓఓ...
అ: వైట్‌కొంగు వన్నెలు మస్తున్నావి
నా చిన్ని గుండెను కోస్తున్నావి
ఆ: కోలో కోలో కోలో సారో కొంగుచాటు రైకతీసి రారో
ఏలో ఏలో ఏలో యారో పెదవుల్ని పెదవుల్తో మారో
అ: పున్నమిలో వెన్నెలలా చంద్రముఖి చెంతకొస్తాలే...
వస్తాలే... వస్తాలే... వస్తాలే... ॥గోల్డ్॥
అ: రాశిలో కన్యలా వాసిలో రంభలా
ఎందుకో నువ్విలా నచ్చుతున్నావే...
కో: ఓఓఓ... ఓఓఓ....
ఆ: చూపుతో కింగులా స్పీడుతో సుందరా
గుండెలో సూటిగా గుచ్చుతున్నావే
కో: ఓఓఓ .... ఓఓఓ
అ: అబ్బా సొంపుల పాపా అలా జారకె సోపా
ఒక ముద్దు ముద్దరేసుకుంటె రంగుల చేపా
ఆ: జల్లుమని గిల్లుమని కోరుకుంది రా మరి
అ: కమ్ముకుంటె కౌగిలిలో తీరకుంది ఈ చలి
ఆ: జల్లుమని గిల్లమని కోరుకుంది రా మరి
అ: కమ్ముకుంటె కౌగిలిలో తీరకుంది ఈ చలి
ఆ: పున్నమిలో వెన్నెలలా చెయ్యిపట్టి చెంతకొస్తావా..
వస్తావా.. వస్తావా... వస్తావా... ॥గోల్డ్॥
ఆ: కాశిలో నీటిలా గంగలో వరదలా
లవ్వుతో నన్నిలా ముంచుతున్నావే
కో: ఓఓఓ .... ఓఓఓ
అ: పువ్వులో తేనెలా ఏటిలో చేపలా
చిలకపచ్చ కోకలా మస్తుగున్నావే
కో: ఓఓఓ.... ఓఓఓ
ఆ: ఇలా ఇప్పుడు ఇట్టా గిచ్చి చంపుతె ఎట్టా
ప్రతి దానికడ్డముంది ఒక వేళాపాళా
అ: అవును అని కాదు అని ఆడుకోకే సుందరి
ఆ: వేస్తున్నా ఆగుమరి మల్లెపూల పందిరి
అ: అవును అని కాదు అని ఆడుకోకే సుందరి
ఆ: వేస్తున్నా ఆగుమరి మల్లెపూల పందిరి
అ: పున్నమిలో వెన్నెలలా చంద్రముఖి చెంతకొచ్చేసా..
వచ్చేసా... వచ్చేసా... వచ్చేసా.... ॥గోల్డ్॥

**3**

రచన : విశ్వా
గానం : స్మిత

ప: ఏలో ఏలో ఎన్నియల్లో తేలే ఈడే తేనియల్లో
అల్లి బిల్లి యవ్వనాల్లో... యవ్వనాల్లో... యవ్వనాల్లో...
నింగి నేల వేడుకల్లో ఈడే వచ్చే పల్లకీలో
కన్నె జాజి జావళీల్లో... జావళీల్లో... జావళీల్లో...
ఏలో ఏలో ఎన్నియల్లో కూసే గువ్వ కొమ్మలల్లో
వచ్చే మాఘం ఎన్నినాళ్ళో.. ఎన్నినాళ్ళో
కోలో కోలో కన్నెవళ్ళో వచ్చి వాలే వానవిల్లో
రేగే నాలో కోరికేదో ... కోరికేదో... కోరికేదో...
నిన్నమొన్నల్లో కానరాని వన్నెలోచ్చాయి మేనిలో
ఊరుకోనంటు ఊసులేవో ఉరకలేశాయి తలపుల్లో ॥ఏలో ॥
చ: నింగిలోని తారలన్నీ నిచ్చెనేసి అందుకో
మెరుపుతీగె కోసుకొచ్చి కురులలోన తురుముకో
వెన్నెలమ్మ వాకిట ముగ్గులేసి ముంగిట
వింత వింత వేడుకే చేయి
కొత్తదారి కోరితే హాయి
ఆకతాయి అల్లరేనోయీ ॥ఏలో ఏలో॥
చ: కలతలన్నీ పక్కనెట్టి మమతలన్నీ అల్లిపో
పగలు రేయి పదిలమైన ప్రేమలేదు పంచుకో
రేగితున్న గాలిలా ఉరకలేసే ఏరులా
సాహసంతో సాగిపోవాలి
కొత్త పాటె పాడుకోవాలి
అంబరాలే అందుకోవాలి ॥ఏలో ఏలో॥



రచన: కందికొండ
గానం : కౌసల్య

**4**

కో:థోం థోం తన థోంతన థోంతన ధీం ధీం అ ఆ ఆ
థోం థోం తన థోంతన థోంతన ధీం ధీం అ ఆ ఆ
ఆ: రామ రామ రామ నీలి మేఘ శ్యామ ఆ
కో:సా.... సనిపని సా.... ఆ.....
ఆ: రామ రామ రామ నీలిమేఘ శ్యామ
రావా రఘుకుల సోమ భద్రాచల శ్రీరామ
మా మనసు విరబూసే ప్రతి సుమగానం నీకేలే
కరుణించి కురిపించే నీ ప్రతి దీవెన మాకేలే
నిరతం పూజించే మాతో దాగుడు మూతలు నీకేలా
రెప్పలు మూయక కొలిచాము కన్నుల ఎదుటకు రావేలా
రామ... రామా....
రామ రామ రామ నీలిమేఘ శ్యామ
రావా రఘుకుల సోమ భద్రాచల శ్రీరామా ఆ... ఆ...



రచన : చక్రి
గానం : హరిహరన్, కౌసల్య

**5**

అ: మోనా మోనా మోనా మీన కనుల సోనా
నీ పలుకే నా వీణ నీదా డిజిటల్ టోనా
ఆ: సుకుమార మాటలతో నీ వశమే నేనైతే
మహావీరా చూపులతో నా తనువే నీదైతే
అ: నా గుండెల్లో మాటేదో త్వరగా నీ చెవి చేరాలి
నువ్వాడే సరదాటేదో విన్నర్ నేనే కావాలి॥మోనా॥
అ: హిమమేదో కురియాలి చెక్కిళ్ళు తడవాలి
నా కంటి కిరణాలే నిలువెల్లా తాకాలి
ఆ: మనమేదో చేయాలి చిరుగాలి వీయాలి
తలపేంటో అడిగిందంటూ కౌగిట్లో చేరాలి
అ: చలిగిలి చేసెను మోనా తొలిముద్దులకై రానా
చలిగిలి చేసెను మోనా తొలి ముద్దులకై రానా
ఆ: జరిగేది ఏమైనా జరగాలి కలలాగ
అ: ఆనందం అంబరమై నను నేను మరవాలా॥మోనా॥
ఆ: జపమేదో చెయ్యాలి హృదయాలు కలవాలి
గగనాన తారల తోడై గళము విప్పి పాడాలి
అ: జతలన్నీ మురియాలి ఒకటైన మన చూసి
కథలల్లుకోవాలి ఘన చరితై నిలవాలి
ఆ: భ్రమలే నిజమే అగునా బ్రతుకే నీవనుకోనా
భ్రమలే నిజమే అగునా బ్రతుకే నీవనుకోనా
అ: చింతేలా ప్రియ భామా నీచెంత నే లేనా
ఆ: కొంతైన ఓపిక ఉంటే సొంతం నే కాలేనా॥మోనా॥

రచన: కందికొండ
గానం : శంకర్‌మహదేవన్, కౌసల్య

**6**

అ: సున్ సున్ సుందరి ఊరించె క్యాడ్బరీ
చేస్తానే రామరి సోకుల్ని రాబరీ
నువ్వేనా నిండు గోదారి ఓ బాలామణి
వెల్లువలా రావే మరి నా సోకు గని
రానంటె ఎట్టామరి ....రి పరువాల పంచాక్షరి... రీ
రానంటె ఎట్టామరి... రి పరువాల పంచాక్షరి....రీ...
ఆ: కమ్ కమ్ కమ్ సుందరా ఆ.... ఆ.... ఆ...
గుండెల్లో తొందరా హా.... హా....
అ: చంద్రకళ పైడి వల నీకు నాకు దూరమిలా
ఇంకా ఎన్నినాళ్ళు చెప్పవె లీల
ఆ: గుండెల్లో చేరి...చేరి... గొడవే చేస్తాలే
అ: పున్నమిలో వెన్నెలలా తుంటరీ నీ కన్నులిలా
పిలిచి చంపుతుంటే ఏం చెయ్యాలి
ఆ: చూపులతో చూపు కలపవోయ్ పిల్లడు
వలపేదో పంచి పెట్టవోయ్
అ: సన్నజాజి తీగలాగ అల్లుకుంటె ఆ పైనా
పోమన్నా పోనే మరి... రి... నిందలొద్దె నీలాంబరీ...
ఆ: కౌగిలంటే ఓ.కె. కాని... నీ కవ్వింతే ఒద్దోయ్ మరి॥సున్॥
అ: రూపమతి నిన్ను చూసి ఉన్న మతి చెదిరిపోయి
మనసే చిన్నపాటి చెరువయ్యిందే
ఆ: ఆ చెరువులోకి..లోకిలోకి... చేపయి వస్తాలే
అ: కొండపల్లి బొమ్మలాంటి కోమలాంగి నవ్వు విని
వయసే నీవైపు పరుగులు తీసె
ఆ: ఇన్‌స్పైరై పోమాకురోయ్ పిల్లడు
ఎక్స్‌పైరై పోతావురో...రో..
అ: ఇంత దూరమొచ్చినాక ఇంటి తలుపులేసుకుంటె
బెట్టుచేస్తె ఎట్టామరి... రి... కథలమారి కాదాంబరి... రి
ఆ: ఆగకుంటె కట్టెయ్ తాళి... ఇచ్చేస్తా బిగి కౌగిలి ॥కమ్॥
అ: సున్ సున్ సున్ సుందరి ఊరించె క్యాడ్బరీ
నువ్వేనా నిండు గోదారి... ఓ బాలామణి
వెల్లువలా రావే మరి నా సోకుగని
రానంటె ఎట్టామరి.... రి పరువాల పంచాక్షరి... రీరీ
రానంటె ఎట్టామరి.....రి పరువాల పంచాక్షరి.... రీరీ ...



పాటల పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు 'రాజా' పర్యవేక్షణలో 'హాసం' అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.



## తారాగణం

నాగార్జున అక్కినేని, అశిన్, రక్షిత, ప్రకాష్‌రాజ్, సంగీత, మోహన్‌రాజ్, అలీ, ఏ.వి.యస్., బెనర్జీ, వినోద్‌బాల, చైతన్య, రాజు

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| సినిమాటోగ్రఫీ | : శ్యామ్ కె. నాయుడు |
| ఎడిటింగ్ | : మర్తాండ్ కె. వెంకటేష్ |
| యాక్షన్ కో - ఆర్డినేటర్ | : విజయ్ |
| ఆర్ట్ డైరక్టర్ | : చిన్నా |
| స్టిల్స్ | : అంజిబాబు |
| పి.ఆర్.ఓ. | : పులగం చిన్నారాయణ |
| ప్రొడక్షన్ కంట్రోలర్ | : రాంబాబు .కె, కె.వి.కృష్ణవర్ధన్ |
| ప్రొడక్షన్ మేనేజర్ | : రవి |
| పబ్లిసిటీ డిజైనర్ | : ధని ఏలే |
| కో-డైరక్టర్ | : వి.వి.యస్.ఆర్.ప్రసాద్ |
| అసోసియేట్ డైరక్టర్ | : సాయిశ్యాం |
| అసిస్టెంట్ డైరక్టర్స్ | : సత్య, శేషు, నాని, గోపి, వీర |
| మ్యూజిక్ | : చక్రి |
| సమర్పకులు | : దానయ్య - భగవాన్ |
| కథ, స్క్రీన్‌ప్లే, నిర్మాత, దర్శకత్వం | : పూరీ జగన్నాథ్ |
















# శివమణి

9 8 4 8 0 2 2 3 3 8

పూరి జగన్నాథ్

శ్యామ్ కె. నాయుడు చక్రి మార్తాండ్ కె. వెంకటేష్




# ఇండిపాప్ గోల్డెన్ బోయ్

# 'సోను నిగమ్'



* పాటలు పాడటం... నటించడం... వేదికల మీద లైవ్ షోలు ఇవ్వడంతో పాటుగా సోను సంగీత దర్శకత్వం మీద దృష్టి నిలిపాడు. సుజీత్ కుమార్, ఆయన కుమారుడు జతిన్ సీరియల్స్‌కు, బాబుల్ సుప్రియో పాటలకు తాను స్వరాలు సమకూర్చానని సోను చెబుతూ - "అయితే పూర్తి స్థాయి సంగీత దర్శకుడిగా మారటం కంటే - పాటలు పాడటమే నా కిష్టం" అంటున్నారు.
* కుటుంబానికి అమిత ప్రాధాన్యమిచ్చే సోను - ఇప్పుడు ఓ ఇంటివాడయ్యాడు. పార్టీలకు, ఫంక్షన్స్‌కు మొదటి నుండీ అతను దూరమే! 'మీ భవిష్యత్ ప్రణాళికలేమిటి?' అని అడిగితే - "నా కుటుంబానికి సరిపడ డబ్బు సంపాదిస్తాను. ఆ తర్వాత సినిమా రంగాన్ని వదిలేస్తాను. పట్టణాలకు దూరంగా ఓ పల్లెకు వెళ్ళి - పొలాల మధ్యలో ఓ చిన్న కుటీరం నిర్మించుకుని ఆవుల్ని, గేదెల్ని, కోళ్ళను పెంచుతాను. నా ఇంట్లో రేడియోగానీ, టెలివిజన్‌గానీ వుండనివ్వను. అక్కడ మిషన్‌లా కాకుండా ఓ మనిషిగా బతకాలనుకుంటున్నాను" అని చెప్పాడు సోను.
* పాత గాయకుల పాటల్ని పాడి పాపులారిటీ పొంది- ఇప్పుడు తనకంటూ ఓ గుర్తింపును తెచ్చుకున్న సోను నిగమ్ 'మహ్మద్ రఫీ, మైఖేల్ జాక్సన్ తనకి స్ఫూర్తి నిచ్చిన గాయకులు' అని చెబుతున్నాడు. అంతేకాదు. 'గాయకుడిగా మహ్మద్ రఫీలాగా ఓ లెజెండ్‌గా పేరు తెచ్చుకోవాలన్నది తన కల' అనీ అన్నాడు.

'విజయానికి ఎందరో తండ్రులు-
అపజయం మాత్రం అనాథ' అని సామెత. ఇవాళ సంగీత ప్రపంచంలో రాణిస్తున్న చాలామంది గాయనీ గాయకుల కెరీర్ అనాథ జీవితంలానే సాగింది. ఎక్కడో... ఎప్పుడో... ఓ అదృష్ట వీచిక వాళ్ళ మీదనుండి ప్రయాణించి- ఆ ప్రతిభకు గుర్తింపు తేవడంలో కష్టాలు, కడగండ్లు.... దాటి ఇవాళ లక్షలాది అభిమానుల్ని సంపాదించుకున్నారు వారు. అందులో 'ఇండిపాప్ గోల్డెన్ బోయ్' సోను నిగమ్ ఒకరు.

## బాల్యం నుంచే సరిగమల సాంగత్యం:

జులై 30న హర్యానాలోని ఫరీదాబాద్‌లో సోను నిగమ్ జన్మించాడు. తల్లి శోభానిగమ్, తండ్రి ఆగమ్‌కుమార్ నిగమ్ ఇద్దరూ గాయనీ గాయకులే. దాంతో సోనుకి బాల్యంలోనే సరిగమల సాంగత్యం కనబడింది. ఇతను పుట్టాక, కెరీర్ దృష్ట్యా ఆగమ్‌కుమార్ ఢిల్లీ చేరారు. అక్కడ సోను 12వ తరగతి వరకు చదువుకున్నాడు. చిన్నతనం నుండే తండ్రితో కల్సి పెళ్ళిళ్ళకు, పార్టీలకు వెళ్ళి పాటలు పాడేవాడు. 3 వ యేట నుండే గీతాలాపన ప్రారంభించిన సోను వేదిక మీద పాడిన తొలి పాట 'క్యా హువా తేరా వాదా'. 'హమ్ కిసీ సే కమ్ నహీ'లోని ఈ పాటతో ప్రేక్షకుల ప్రశంసల జల్లులు భారీగానే ఈ బాల గాయకుడిపై పడేవి. చిన్నతనం నాటి లక్ష్యాల గురించి సోను చెబుతూ "అమ్మా నాన్నా గాయకులు కాబట్టి మూడేళ్ళ వయసులోనే పాడటం అలవాటైంది. అయితే నాకు గాయకుడు కావాలనే కోరిక చిన్నతనంలో ఉండేది కాదు. సైంటిస్ట్ అవ్వాలని, లేదంటే ఆస్ట్రోనమర్ కావాలని వుండేది. కాస్త పెరిగి పెద్ద అయ్యాక- ప్రపంచం చూడాలనే కోరికతో 'ఇండియన్ ఫారిన్ సర్వీస్'లో చేరితే బాగుంటుందే అనుకునే వాణ్ణి" అని చెప్పారు.

సోను తండ్రికి చక్కటి గాత్రం వున్నా ఆయన సంగీత ప్రపంచంలో పెద్దగా రాణించలేదు. దానికి సోను వివరణ ఇస్తూ- ఇక్కడ రాణించాలంటే కేవలం ప్రతిభ వుంటే సరిపోదు. వచ్చిన అవకాశాన్ని సరిగ్గా వినియోగించుకోవాలి. ముఖ్యంగా ఎంతో కష్టపడాలి. ఇక మా నాన్నగారి విషయానికి వస్తే ఆయన పరమ బద్ధకిస్టు. పైగా ఎదుటివాడు ఎంత పెద్దవాడైనా- తల వంచనంటారు. బహుశా ఇదే కారణంగా ఆయనకి రావాల్సినంత పేరు రాలేదని నాకనిపిస్తుంది"

అంటున్నాడు. అయితే తండ్రి కలల్ని నిజం చేయటం కోసం సోను నిగమ్ 18 సం॥రాల ప్రాయంలో ఢిల్లీ నుండి ముంబైకి అడుగుపెట్టాడు. ఇప్పటిలా అప్పుడు నూతన గాయనీ గాయకులకు అవకాశాలు అంత సులభంగా లభించేవి కావు. ఓ పక్క కెరీర్‌ని గురించి తాపత్రయ పడుతూనే మరో పక్క కరస్పాండెన్స్ కోర్సులు చేస్తూ డిగ్రీ పట్టా పుచ్చుకున్నాడు. విశేషం ఏమంటే సోను చైల్డ్ ఆర్టిస్ట్‌గా 'కామ్‌చోర్', 'హమ్ సే హై జమానే', 'తక్దీర్', 'బేతాబ్' చిత్రాలలో నటించాడు.

## నేపథ్య గాయకుడిగా...

సోనుకి నేపథ్య గాయకుడిగా తొలి అవకాశం సంగీత దర్శకులు అమర్-ఉత్పల్ ఇచ్చారు. 'ఆజా మేరీ జాన్' చిత్రంలో 5 పాటలు సోను నిగమ్ పాడారు. అయితే అన్ని రకాలుగా అందరినీ ఆ పాటలు సంతృప్తి కలిగిస్తేనే - వాటిని వుంచుతామని లేదంటే వేరే గాయకులతో పాడిస్తామని రికార్డింగ్ సమయంలోనే వారు సోనుకి చెప్పారు. చివరకు అదే జరిగింది. ఐదు పాటల్లో ఒక పాట మాత్రమే స్థానం పొందగలిగింది. అయితే ఆ పాటను విన్న గుల్షన్ కుమార్ వెంటనే సోనును పిలిపించి- అభినందించి 'బేవఫా సనమ్' చిత్రంలో పాడే అవకాశం కల్పించాడు. అందులోని 'అచ్ఛా సిలా దియా తునే మేరే ప్యార్ కా...' పాట గొప్ప విజయాన్ని పొందింది. దాంతో ఇక సోను వెనుతిరిగి చూసుకోవాల్సిన అవసరం కలగలేదు.

చిత్రాలకు నేపథ్య గాయకుడిగా వుంటూనే బుల్లితెర మీద తనదైన ముద్ర వేశాడు. నేపథ్య గాయకుడిగా 1994లో జీటీవీ అంత్యాక్షరి కార్యక్రమానికి ఆహ్వానించింది. అందులో ఇతర గాయనీ గాయకుల్ని సోను నిగమ్, పూర్ణిమ ఓడించారు. అప్పుడే గజేంద్రసింగ్ దృష్టి సోను మీద పడింది. వెంటనే సోను యాంకర్‌గా 'సారిగమ' కార్యక్రమాన్ని రూపొందించాడు. 1995 మే 1వ తేదిన మొదటి ఎపిసోడ్ ప్రసారమైంది. 2000 జూన్ 5 వరకూ సోనునే ఈ కార్యక్రమాన్ని విజయవంతంగా నిర్వహించాడు. ఈ కార్యక్రమం కారణంగానే సోనుకి ఎందరో ప్రముఖ సంగీత దర్శకుల పరిచయం ఏర్పడింది. అలానే ఆ సంగీత సాగరంలోని పెద్దల ప్రతిభ గురించి తెలుసుకున్నాక- మరోసారి సంగీతాన్ని ఓ గురువు ద్వారా సాధన చేయాలని సోను అనుకున్నాడు. అంతకుముందు కొద్దికాలం పాటు ఢిల్లీలో మహ్మద్ తహీర్ దగ్గర నేర్చుకున్నా - సరిగమ కార్యక్రమ నిర్వహణ సమయంలో ఉస్తాద్ గులామ్ ముస్తఫాఖాన్ దగ్గర మరిన్ని మెళకువల్ని అధ్యయనం చేశాడు.



✳ కెరీర్ కోసం ఆరాట పడుతూ ప్రారంభదశలో సోను స్కూటర్ మీదనే తిరుగుతూ రోజుకి 30 పాటలు కూడా పాడాడు.... ఇప్పుడు నాలుగు కార్లు మెయిన్‌టైన్ చేస్తూ - రోజుకో పాట మాత్రమే పాడుతున్నాడు.

✳ 'సరిగమ' కార్యక్రమం సందర్భంగా నౌషాద్ సాబ్‌ను కలవటం జీవితంలో ఓ గొప్ప అనుభూతి అంటాడు సోను.

✳ నేను చాలా కష్టపడి పనిచేస్తాను. అదే నాకు హెల్ప్ అవుతుంది. పాడటం, స్టేజ్‌షోలో పాల్గొనడం, నటించడం ఏదైనా కావచ్చు.... దాని మీద నూటికి నూరు శాతం శ్రద్ధ చూపుతాను. రోజుకి 4,5 గంటల మించి నిద్రపోను. ఒక్కోసారి రోజుకి ఓ గంట మాత్రమే నిద్రపోయిన సంఘటనలూ వున్నాయి అంటారు సోను.



భార్య మధురిమతో సోనునిగమ్

## పాప్ గాయకుడిగా...

అందం, హాస్య చతురత, సౌమ్యం... ఇవే సోను విజయానికి కొంత కారణం. సాధించిన దానిపట్ల గర్వంగానీ, తోటి వారి పట్ల చిన్న చూపు గానీ లేకపోవటంతో సోను అనతి కాలంలోనే చక్కటి గాయకుడిగా గుర్తింపు పొందాడు. 'సరిగమ'తో వచ్చిన పాపులారిటీతో 1997లో 'సప్నోంకీ బాత్' పాప్ ఆల్బమ్‌ను రూపొందించాడు సోను. దానిని టి.సిరీస్ విడుదల చేసింది. అయితే ఆ తర్వాత విడుదలైన కిస్మత్, దీవానా, మౌసమ్... మంచి పేరు తెచ్చి పెట్టాయి. 2000 లో విడుదలైన 'జాన్'తో సోను కెరీర్ పాప్ గాయకుడిగా టాప్‌కి రీచ్ అయ్యింది. అలానే ఆ తర్వాత విడుదలైన 'యాదే' కూడా ఆ స్థానాన్ని స్థిరపరిచింది. సోను నిగమ్ గాత్రమే కాదు - అతని శరీరమూ ఆకర్షణీయమైంది కావటంతో ఈ పాటల ఆల్బమ్‌ను ప్రమోట్ చేయడానికి తీసిన వీడియో ఆల్బమ్‌లో అతనే నటించాడు. అతని సరసన రియాసేన్, మాలినీ శర్మ, బిపాషాబసు నటించారు. ఈ వీడియో ఆల్బమ్‌కు విపరీతమైన వీక్షకాదరణ లభించటంతో సోనులోను నటుడిని వెలికి తీయాలనే కోరిక బాలీవుడ్ దర్శక నిర్మాతలకి కలిగింది. దాంతో సోను వెండితెర మీద నటించడానికి ముందుకొచ్చాడు. ఇప్పటికి రెండు మూడు చిత్రాలు విడుదలైనా - గాయకుడిగా వచ్చిన పేరు మాత్రం నటుడిగా రాలేదు. ఇదో రకంగా అతనికి నిరాశ కలిగించే విషయమే అయినా - గాయకుడిగా అతన్ని అభిమానించే వాళ్ళకి వరం అని చెపాలి. అచ్చిరాని నటనను వదిలి ఇప్పుడు మళ్ళీ సోను పాటల మీద మనసు పెడుతున్నాడు.

### తెలుగులోనూ....

పరభాషా గాయకులతో సైతం ఓర్పుగా పాడించుకునే మన సంగీత దర్శకులు ఇప్పుడు సోనూనిగమ్‌తోనూ తెలుగులో పాటలు పాడిస్తున్నారు. సినిమాగా సక్సెస్‌కాకపోయినా ఆడియోగా విజయం సాధించిన 'ప్రాణం'. అందులోని పాపులర్ సాంగ్ 'నిండు నూరేళ్ళ సావాసం.... స్వర్ణమువ్వాలి వనవాసం' పాటను సోనునిగమ్, మహలక్ష్మి గానం చేశారు. అలానే ఇటీవలే విడుదలైన 'విష్ణు' చిత్రంలో మోహన్‌బాబు తనయుడు విష్ణువర్ధన్‌బాబు ఇంట్రడక్షన్ సాంగ్ 'వందనం... వందనం... మీరే నా జీవితం' పాటను, అదే చిత్రంలో 'నీ పేరే తనపైన... తన పేరే యదపైన' పాటనూ సోను గానం చేశాడు. కె.కె. తరహాలో హై టచ్‌లోనూ - శ్వాసను బిగపట్టి పాడగలిగే సోనుకు తెలుగులో మరిన్ని అవకాశాలు వచ్చే వీలుంది. అయితే ఉదిత్‌నారాయణ్ తరహాలో ఓ 'హిట్' పట్టాలి... అంతే!

**- వి. అరుణ సత్యవతి**

అక్టోబరు 26 ఎస్.రాజేశ్వరరావు వర్ధంతి సందర్భంగా....





# కొమ్మ కొమ్మకో సన్నాయి...



## చల్లగాలిలో హృదయమునాతటిపై

# (ర)సాలూరు మురళి...

'పాటపాడుమాకృష్ణా పలుకు తేనెలొలుకునటుల'

అని నిఖిల రసామృతమూర్తి అయిన శ్రీకృష్ణుణ్ణి ఓ గోపికాగాత్రుడైన గోపకుడు సినీ బృందావనంలో తీయగా వేడుకున్నాడు. దానికి 'నీ అంత హాయిగా తీయగా నేను పాడగలనా' అని కృష్ణుడు తన సందేహం వెలిబుచ్చాడు. ఇదెంతో రమణీయంగా బాపు కార్టూనీకరించారు.

కొందరు మహనీయులను పరిచయం చేసుకోడానికే ఒక్కొక్క జీవుడు ఒక్కొక్క జన్మనెత్తుతాడేమో - ఆ పరిచయం, పరిమళం లేని జన్మ మోడు. జన్మకు పరిమళాన్ని పరవశాన్ని కలిగించే మహనీయులలో శ్రీ సాలూరు రాజేశ్వరరావు గారు ఒకరు.

పాత అనీ కొత్త అనీ పామరులు వింగడించుకునే ఆపాతమధురమైన సంగీత క్షీర సముద్రంలో వటపత్రశాయిగా తేలినా, శేషశాయిగా వాలినా ఆ రస రత్నాకరాన్ని ఈదజాలినా, ఆయనకే చెల్లింది.

అనునాసికమైన ఆయన గాత్ర ధర్మాన్ని అనుసరించి పాడనిదే పాట కాదని నమ్మి తమ తొలి రోజుల్లో అలాగే పాడిన, పాడడానికి ప్రయత్నించిన మహా గాయకులు ఎందరో! బాలసరస్వతి, రాజేశ్వరరావు కలిసి పాడిన యుగళ గీతాలలో (పాదరింటిలోనుండి) ఎవరెవరో తెలుసుకోడానికి ప్రయత్నం చేసిన వారున్నారంటే ఇవాళ కట్టుకథగా అనిపిస్తుంది. అంత లలితం రాజేశ్వరుడి గాత్రం. భావగీతం అనేది తెలుగులో పలికింది ఆయన - పలికించింది ఆయన - అటు తరువాత ఘంటసాల గారితో సహా లలిత సంగీతగానం అలాగే చేశారు.



అంటే అపచారమేమో! ఘంటసాల అంతటివారు తమ తొలి భావగీతాలను గానం చేసిన పద్ధతి చూస్తే రాజేశ్వరుడి గాత్ర ధర్మాన్ని, గాన ధోరణిని అనుసరించినట్లు వినిపిస్తుంది! పెండ్యాల గారు తమను ఎవరు ప్రశంసించినా వినయంతో 'అలా అనకండి - ముందు రాజేశ్వరరావు పేరు చెప్పి తరువాత ఇంకొకరిని చెప్పండి' అనేవారు. సంగీతం, సంస్కారం, సంగీత సంస్కారం వున్న నాటి మహనీయులను స్మరించడమే సుఖం కదా!

రాజేశ్వరరావు గారిని కేవలం సంగీత దర్శకుడు గానే చూడలేదు ఆంధ్రప్రజలు. ఆయన్ని ఆరాధనాభావంతోను, అనురాగంతోను కూడా సంభావించారు. సినిమా రంగంలో ఆయనదొక విశిష్ట వ్యక్తిత్వం. ఆయన మీద వున్నన్ని జోకులు, కథలు, ఆయన విసిరే చెణుకులను గూర్చిన ప్రస్తావనలు ఎన్నో! రాజేశ్వరరావు గారి మాటలకు 'శ్లేష' వుండేదని సాహితీవేత్తలే అనుకునేవారు. ఆయన మెచ్చుకుంటే గుచ్చుకునేదని గులాబి రెమ్మతో కొట్టినట్టు వుండేదని అనుభవాలుగా చెప్పుకునేవారు.



'చంద్రలేఖ' చిత్రానికి జెమినీ సంస్థలో ఆయన సంగీత దర్శకుడిగా వున్న రోజుల్లో ఎస్.ఎస్.వాసన్ (జెమినీ అధినేత)తో 'అయ్యా మీరు లక్ష్మీపుత్రులు - మేము సరస్వతీ సేవకులం - మా వ్యవహారంలో వేలు పెట్టకండి.. కావలసింది చెప్పండి, అంతే' అన్నారట రాజేశ్వరరావు గారు. అప్పటినుంచీ పొరపొచ్చాలు వచ్చి ఆయన జెమినీ సంస్థ నుంచి బయటకు వచ్చేశారు. 'చంద్రలేఖ' చిత్రానికి పాశ్చాత్య ధోరణిలో చేసిన కొన్ని పాటలు, నేపథ్య సంగీతం తరువాత అనేకులకు ఆధారమైనాయి.

శ్రీ రాజేశ్వరరావుగారి 'మల్లీశ్వరి' దేశవిదేశాలలో సంగీతానికి ప్రముఖంగా పేరు తెచ్చుకుంది. బి.యన్.రెడ్డి, రాజేశ్వరరావు, దేవులపల్లి వారు కలిసి అపూర్వ కళాఖండంగా దానిని తీర్చిదిద్దారు. ఆంధ్రదేశంలో కంటె తమిళనాడు, కన్నడ రాష్ట్రాలలో ఆ చిత్రానికి ఎక్కువ ఆదరణ లభించింది. హంపీ విజయనగర సామ్రాజ్య వైభవానికి అద్దం పట్టే ఆ చిత్రంలో సంగీతం కథానాయిక అయిందంటే అతిశయోక్తి కాదు. 'మనసున మల్లెల మాలలూగెనే, కోతీ బావకు పెళ్ళంట, పరుగులు తీయాలి గిత్తలు ఉరకలు వేయాలి, ఆకాశవీధిలో, నెలరాజా వెన్నెల రాజా, ఎందుకే నీకింత తొందర... ఇలా చెప్పుకుంటూ పోతే అన్నీ అన్నే... అపురూప రాగహారాలే.. మల్లీశ్వరి అలంకారాలుగా కనిపిస్తాయి. 'కోతీబావ' పాటలో జానపదపు జాణతనం - 'ఆకాశవీధిలో' పాటలో భీంప్లాస్ రాగరంజనం - 'ఎందుకే నీకింత తొందర' పాటలో ఖమాన్ ఘుమాయింపులు - 'పరుగులు తీయాలి' పాటలో మధ్య మధ్య వచ్చే నెరవళ్ళతో సాగే హమ్మింగులు - అలా వుండగా కాపీ రాగపు కవ్వింపులతో జావళీయంగా సాగిన 'పిలచిన బిగువటరా' - లలిత గీత పద్ధతిలో వినిపించే టి.జి.కమలాదేవి పాడిన 'ఝుం ఝుం ఝుం తుమ్మెదా' - భానుమతి పాడిన 'నెలరాజా' - వీటన్నిటితో పాటు 'నోమీ నోమన్నలాలో' - ఉషా పరిణయం యక్షగానం - రాజేశ్వరుడి రాగ యోగానికి దర్పణాలు.

మల్లీశ్వరిని రాణివాసానికి పంపే ఘట్టం తెలుగు సినిమా చరిత్రలోనే గుండెలు బరువెక్కించే అద్భుత కరుణ రసాత్మక బాష్పగంగా మణికర్ణికా ఘట్టం - అది అలా చిత్రించిన బి.యన్.రెడ్డి గారిని, ఆ ఘట్టంలో నటించిన దొరస్వామి, రుష్యేంద్రమణి, భానుమతి, అత్త (నటిపేరు వెంకుమాంబ అనుకుంటాను) నీ, ఆ సెట్ నిర్మించిన ఎ.కె.శేఖర్‌ని అన్నిటికీ మించి హంపీ విజయనగర శిల్పవీణలు ఆ దృశ్యాలకి నేపథ్యంగా మూర్ఛనలు చేస్తున్నాయా అనిపించే నేపథ్య సంగీతం, అందులో రాజేశ్వరుడు చూపిన ప్రతిభ, చరిత్ర జ్ఞానం ఆంధ్రులు మరువలేనిది. మరపురాకూడనిది.

ఏయే వాద్యాల సమ్మేళనంతో ఏ రాగంలో ఏ తాళంలో ఏ మధురిమ పుడుతుందో ఆయన లాగా తెలిసినవారు ఏ ఒకరిద్దరో!

రాజూపేద, చెంచులక్ష్మి, విప్రనారాయణ, భక్తప్రహ్లాద, భలేరాముడు, మిస్సమ్మ, ఇద్దరు మిత్రులు, కాలం మారింది, భీష్మ, రాణీరత్నప్రభ, బొబ్బిలియుద్ధం, కురుక్షేత్రం, రాధాకృష్ణ, దేవదాసు మళ్లీ పుట్టాడు వంటి చిత్రాలకు రాజేశ్వరరావు సంగీతం ప్రాణం పోసింది.

జేబులో బొమ్మ (రాజూపేద), నీలగగన ఘనశ్యామా (చెంచులక్ష్మి), 'కిస్మత్'లోని 'మేరే బుల్ సొరహాహై'కి దీటుగా చేసిన ఓహో మేఘమాలా (భలేరాముడు) ఏమిటో నీమాయ, రావోయిచందమామ, కరుణించు మేరిమాతా, ఆడువారి మాటలకు (మిస్సమ్మ), విప్రనారాయణ వంటి చిత్రాలలో ప్రతి పాటా స్వరకుసుమాల తోటగా పరిమళించింది. 'భీష్మ'లో పదవ పాటతో 'భీష్మ సుజాత'గా ఒక నటికి బారసాల జరిగింది. ఈడొచ్చిన తెలుగింటి ఆడపిల్లల చెమ్మచెక్కల పాట (బొబ్బిలియుద్ధం) ఒకతరం తరం పాడుకున్న పాట, 'ఎందుకోయీ తోటమాలీ అంతులేని యాతన' వంటి పాటలేమి, 'నా నియమాలు నీరైపోయినా' వంటి మాటలేమి ప్రాణగంధాలు వెదజల్లే విధంగా రాజేశ్వరరావు స్వరీకరించారు.

నేను రాసిన కొన్ని పాటలు రాజే'స్వర' పరిచయంతో పరిమళించాయి. అన్నపూర్ణ వారి 'రాధాకృష్ణ' చిత్రంలోని 'నా పలుకే కీర్తన' అన్నపాట, 'సాగర మథనం'లో ఇది మోహిని చేసిన నాట్యం' (ఈ పాట చరణాలలో 'లాస్యం'

అని నేను ఒక పదం వాడితే అది వద్దు వేరే ఏదైనా మాట వాడండి అని నన్ను సాధించారు మాస్టారు-) అలాగే 'కురుక్షేత్రం'లో 'అలకల కులుకుల అలివేణీ భామామణీ సత్యభామామణీ' అనే పాట ఎంతో మధురంగా తీర్చి తీయగా పాడించారు రాజేశ్వరరావుగారు. అలాగే 'దేవదాసు మళ్లీ పుట్టాడు' చిత్రంలో క్లయిమాక్సు పాట 'దిక్కులు కలిసే సమయం - ఇది సూర్యుడు చూడని ఉదయం' స్వరబద్ధం చేసే సమయంలో నరనరాలలో స్వరాలు 'నాట్యం చేస్తూ ప్రకంపిస్తున్నట్లు ఆయన ఊగిపోయారు. ఆ సమయంలో స్వరసంచారం చేస్తూ సన్నివేశం కోసం ఇతర మైత్రీ రాగాలను పలకరిస్తూ ఎన్నో ఎత్తులకీ, లోతులకీ ఆయన వెళ్లిపోతుంటే (అవన్నీ అనేక కారణాల వల్ల పాటలో చోటుచేసుకోలేదు) కన కన రుచిరా అనాలో విన విన రుచిరా అనాలో తెలియలేదు.



శాసనాలకు తలవంచని సుతిమెత్తని కత్తి శ్రీరాజేశ్వరరావు - అవిద్య, అహంకారం, అజ్ఞానం కళను శాసిస్తే తట్టుకోవడం ఆయనకు చేతయ్యేది కాదు. ఆయన కోపతాపాలూ లలితాలే - ఒకవేళ పెడితే శాపాలూ లలితగీతాలే - ఒక మహాగాయకుడు తనకు పాడుతున్నప్పుడు 'మాస్టారూ! చాలాబావుంది సార్, ఇక టేక్ చేసెయ్యడమే, మీరు శ్రుతిలో పాడితే' అన్నంతటి జాణతనం ఆయనది! అలాగే ఒక కంపెనీలో నిర్మాత నటుడు దర్శకుడు అయిన వారొకరు వారి పరివారం పదిమందీ కుర్చీలలో కొలువుతీరి ఆయనను చాపమీద కూర్చోబెట్టి (అనుకునే వసతి కూడా కాకుండా హాలు మధ్యన) కంపోజింగు చేయమన్నప్పుడు... అది ఎంతకీ తెమలనప్పుడు తలా ఒక ప్రశ్న వేస్తూ, జవాబులు ఆశించినప్పుడు లేచి నిలబడి పై కండువా దులిపి బుజాన వేసుకుని 'అయ్యా ఇదేదో సుప్రీంకోర్టులో ముద్దాయిని క్రాస్ ఎగ్జామినేషన్ చేసినట్టు వుంది గాని, కంపోజింగులాలేదు. ఇంతమంది జడ్జీలైతే ఎవరిని తృప్తి పరచాలి? నాకు సెలవు యిప్పించండి' అని వెళ్లిపోయిన వ్యక్తిత్వం ఆయనది.

ఆ స్వర సమ్రాట్టు మీద తవ్వినకొద్దీ ఎన్నో కథలు పుట్టుకొస్తాయి. ఇవి నిజంగా జరిగిన వాస్తవ సంఘటనలే. మహాకవి శ్రీశ్రీ ఉవాచలాగానే సాలూరు వారి సరస చతురోక్తులు కూడా సంపుటీకరించవచ్చు. రైలు ఇంజన్ కూత ఏ రాగం మాస్టారూ అంటే 'అది చిత్తరంజన్ కర్మాగారంలో తయారైంది గనుక చిత్తరంజని అందాం' అన్న సమయస్ఫూర్తి ఆయనది.

మరోసారి 'అయ్యా! తమరిచ్చిన మాటలు అవే, అవి మారలేదు. వాటికి నేను చేసిన ట్యూన్లు ఆరు. ఆరూ ఆరు రాగాలలో చేసినా మీకు ఏదీ నచ్చలేదు. ఇక ఆరున్నొక్క రాగం తప్ప నేను చేయకలిగింది, మీరు మెచ్చగలిగింది కనపడడం లేదు' అన్న దిట్టతనం ఆయనలో వుంది.

'ఏమిటి గురువుగారూ! అన్నీ అవే... యిచ్చినవే... పాత ట్యూన్లే యిస్తున్నారు?' అని నిర్మాత అడిగితే 'అవే కథలు, అదే హీరో హీరోయిన్లు, అన్నీ పాత పద్ధతిలోనే వుంటే కొత్తవి ఎలా వస్తాయి సార్' అని ఎదురుప్రశ్న వేసిన చమత్కారి.

కర్ణ ప్రియ కర్ణాటక హిందుస్తానీ మనోధర్మ లలిత సంగీతమనే వాక్య సమాజానికి కర్త, కర్మ, క్రియ రాజేశ్వరరావు ఒక్కరే. ఒక టీవీ ఇంటర్వ్యూలో ఏది నిజమైన సంగీతం అనే ప్రశ్నకు 'చల్లగాలిలో యమునా తటిపై' అనే రాజేశ్వరరావు పాటను ఆలపించి 'ఇదే నా జవాబు' అని చెప్పారు శ్రీ కె.వి.మహదేవన్.

మహాకవి తిక్కన కవితాప్రపంచ రవి. ఆయనను స్తుతించని ఆంధ్రకవి లేడు. కానీ ఆయన చేత కీర్తింపబడిన కవి ఆదికవి నన్నయ్య ఒక్కడే. అలాగే మామ, పెండ్యాలవంటి వారి చేత స్తుతింపబడిన మహాసంగీత దర్శకుడు రాజేశ్వరుడు ఒక్కడే.

**-వేటూరి సుందరరామమూర్తి**



# వెన్నెలకంటి వెలుగులు

## వెన్నెలకంటి పదాలు



జానపద పసరాజు
హాస్యాన రసరాజు
కొసమెరుపు కొసరాజు
ఓ వెన్నెలమ్మా



భావాల జాబిల్లి
లలిత కవితావల్లి
అతడె దేవులపల్లి
ఓ వెన్నెలమ్మా



అనుప్రాస పరిపాటి
అనువాదమున మేటి
ఆరుద్ర ఘనపాటి
ఓ వెన్నెలమ్మా



అగ్గి వంటిది మాట
పెగ్గు వంటిది పాట
అదియె శ్రీశ్రీ బాట
ఓ వెన్నెలమ్మా

### ఘంటసాల క్విజ్ - 10 విజేతలు

మొదటి బహుమతి
శ్రీ పురాణం సుబ్రహ్మణ్యం, మార్కాపురం.

రెండవ బహుమతి
శ్రీ ఎస్. సూర్యనారాయణ, హైదరాబాద్.

మూడవ బహుమతి
శ్రీ ఎస్.కేశవ అయ్యంగార్, నరసాపురం.

### కరెక్టు సమాధానాలు

1. పింగళి నాగేంద్రరావు
2. వక్కలంక సరళ
3. దేవదాసు
4. పాతాళభైరవి
5. రాజా-పేద

### బహుమతులు

మొదటి బహుమతి: ఎ) 'బహుదూరపు బాటసారి' (ఘంటసాల ప్రైవేట్ పాటలు) డబుల్ డిస్క్/ స్వరసుధ ఘంటసాల 31 గాయనీ మణులతో పాడిన సినీ గీతాల డబుల్ డిస్క్ హెచ్.ఎం.వి.వారిది.
బి) ఘంటసాల పాడిన గోల్డెన్ అవార్డ్స్ పాటల క్యాసెట్. హెచ్.ఎం.వి. వారిది.

రెండవ బహుమతి: 'బహుదూరపు బాటసారి' (ఘంటసాల ప్రైవేట్ పాటలు) డబుల్ డిస్క్ హెచ్.ఎం.వి.వారిది.

మూడవ బహుమతి: ఎ) ఘంటసాల, ఎల్.ఆర్.ఈశ్వరి యుగళ గీతాల 'లవ్‌మి నెరజాణ' హెచ్.ఎం.వి. వారి సింగిల్ సి.డి.
బి) ఘంటసాల పాడిన గోల్డెన్ అవార్డ్స్ పాటల క్యాసెట్. హెచ్.ఎం.వి.వారిది.

# ఎలుక వచ్చె ఇల్లు భద్రం



ఇలపావులూరి మురళీమోహనరావు

**16**

**హెచ్చరిక**

[illegible] గుండె జబ్బుల్తో [illegible] కామెడీ యాక్ట్ 2003 ప్రకారం ఈ సీరియల్‌ చదవడం నిషేధం.

ఒకవేళ మీ పొట్టచెక్కలైతే పత్రిక నుండి ఎలాంటి పరిహారం రాదు. ఈ హెచ్చరిక ఈ సీరియల్ పూర్తయ్యేంత వరకు అమలులో ఉంటుంది.



## జరిగినకథ



వెంకట్రావు, సుందరిల ఇంట్లో ఓ ఎలుక చేరి నానా రభసా చేస్తూంటుంది. దాన్ని చంపడానికి పెట్టిన మందుమ వాళ్ల పాప రుచిచూడడంతో ఉత్తుత్తి పరీక్షల పేరిట డాక్టర్లు వేలాది రూపాయలు ఖర్చుపెట్టిస్తారు. ఎలుకలబోను పెడితే దాన్ని ఎలుక కొరికేస్తుంది. మేనేజరు ఇంటినుండి పిల్లిని తెస్తారు. అది ఎలుకను పట్టకుండా పడినిద్రపోతూ ఉంటే వెంకట్రావు మండిపడతాడు. తిండిపెట్టక మాడుస్తాడు. మర్నాడు చీలికలు పేలికలై కనిపించింది ఎలుక. అప్పటినుండి పిల్లి కనబడడం మానేస్తుంది. కంగారుపడుతూండగానే కొన్నాళ్లకు ఆరుకూనలతో సహా అటకమీద ప్రత్యక్షమవుతుంది. పిల్లి కూనలలో ఒకటి చనిపోవటంతో పక్కింటి ఆండాళ్ళమ్మ సలహాతోవెంకట్రావు ప్రాయశ్చిత్తం చేయించాలని పురోహితుడు శాస్త్రిని కలుస్తాడు. శాస్త్రి వెంకట్రావు ఇంటికి వచ్చి శాంతుల పేరిట ఇరవై వేల రూపాయలు అడుగుతాడు. దానికి వెంకట్రావు ఒప్పుకోకపోవటంతో శాస్త్రి వారిని నరకబాధలు తప్పవని భయపెట్టి వెళ్లిపోబోతుంటే బతిమాలి లోపలకు తీసుకువస్తాడు వెంకట్రావు. శాంతి చేయటానికి కావలసిన వస్తువుల చిట్టా చెపుతుంటాడు శాస్త్రి.

(ఇక చదవండి)

"యమభటులు వందమందని పురాణాలు ఘోషిస్తున్నాయి. తలా అయిదు రూపాయలైనా దక్షిణ ఇవ్వకపోతే ఆ కోపం మనసులో పెట్టుకుని ఏ రాత్రి సమయంలోనో వచ్చి ఓ కొరడా దెబ్బవేస్తాడు. ఆ మేరకు తోలు లేచిపోతుంది."

"వద్దులేండి ఇంత చేసి ఐదు రూపాయల దగ్గర కక్కుర్తిపడటం దేనికి? అలాగే చేద్దాం."

"శుభం... ఇక చిత్రగుప్తుల వారిని కూడా మనం కొంచెం జాగ్రత్తగా చూసుకోవాలి. ఆయన కిష్టమైనవి మంచి జరీ అంచు పంచెలచావులు, బంగారు జరీ ఉత్తరీయాలు. అవి పట్రండి."

"అబ్బో... మామూలువు సరిపోవా?"

"అమ్మో... ఆయన ఒక కూడిక, తీసివేత తప్పువేసినా మీరు కొన్ని వందల సంవత్సరాలు నరకంలోనే ఉండవలసి వస్తుంది. చిత్రగుప్త ప్రసన్నం చాలా ముఖ్యం. ఆయన చిట్టా విప్పితే యముడు కూడా నోరెత్తడు."

"మొత్తానికి కిరాణాషాపు, రైతుబజారు, బట్టల షాపు మా యింట్లోనే పెట్టిస్తున్నారు."

"నరకబాధ అలాంటిది ఆ బాధలు తప్పించుకోవడానికి తాపసులు వేల సంవత్సరాలు ఒంటికాలు మీద తపస్సులు చేసేవారని వేదాలు ముఖం మీద కొట్టినట్లు చెబుతున్నాయి."

"ఆ నరక బాధ సంగతి దేవుడెరుగు. ఇదే పెద్ద నరకబాధగా ఉంది. అసలు ఈ తతంగాలు చెయ్యక పోతే ఏమౌతుందిట!"

"సుందరీ.. నువ్వెళ్ళి కాఫీ పట్రామ్మా." అన్నారు శాస్త్రిగారు. సుందరి లోపలికెళ్ళింది.

"వెంకట్రావుగారూ.... అమ్మాయి ముందు చెప్పడం బాగుండదని ఊరుకున్నాను. మీరు చేసిన పాప ఫలం అప్పుడే ఎలా కొట్టిందో అర్థం కాలేదా?"

"ఏమైంది?"

"నిన్నరాత్రి ఏం జరిగింది? ఉత్తిపుణ్యానికి పోలీసువారిచేత చావుదెబ్బలు తిన్నారే! మీ తప్పేమీలేకపోయినా పోలీసువాడు డొక్కలు ముక్కలు చేశాడే... నిజానికి వాడు పోలీసుకాదు. పోలీసు రూపంలో వచ్చిన యమభటుడు! మీ పాపం అప్పుడే చిత్రగుప్తుడి చిట్టాలోకి ఎక్కి ఆ పాపఫలం శాంపిల్ చూపించడానికి తన భటుడిని రక్షకభటుడి రూపంలో పంపాడు. శాంతి చేయించాలని మనసులో ఉద్దేశ్యం ఉంది కాబట్టి ఆ సమయంలో మేమంతా వచ్చాం." అన్నారు శాస్త్రిగారు.




వెంకట్రావు వళ్ళంతా చెమటతో తడిసి ముద్దైంది.

* * *

"ఎంతైనాయి సరుకులు?" అడిగింది సుందరి.

"ఐదువేలయ్యాయి. ఏడుస్తూ ఇచ్చాడు షాపువాడు" చెప్పాడు వెంకట్రావు.

"దేనికి? అన్ని సరుకులు వాడిదగ్గర కొంటున్నందుకు సంతోషించాలి గానీ"

"అప్పుకదా... అందుకు... ఇంతకూ ఈ శాస్త్రిగారు రాలేదేంటి?"

"ఫోన్ చెయ్యండి"

శాస్త్రిగారికి రింగ్ చేశాడు వెంకట్రావు.

"హలో... శాస్త్రిగారున్నారా?"

"లేరండీ.... గవర్నర్ గారింట్లో వరలక్ష్మీ వ్రతం ఉంది. అక్కడికి వెళ్ళారు."

"అరె... ఈరోజు మాయింట్లో శాంతి పూజలు చేయిస్తానన్నారే"

"ఎవరండీ మీరు?"

"నేను వెంకట్రావును."

"మీరా అంకుల్. అయితే తప్పకుండా వస్తారు."

"ఎప్పుడు?"

"గవర్నర్ గారి బంగాళానుంచి నేరుగా మీ ఇంటికే వస్తారు."

"ఎన్ని గంటలకు?"

"పన్నెండింటికల్లా వస్తారు. ఈ లోపల మీరేమీ తినకండి."

"నేను ఆకలికి అస్సలుండలేను తల్లీ."

"అందరూ అంతే అంకుల్... ఈలోపల మీరు స్నానం చేసి ఆంటీతో కలిసి విష్ణుసహస్రనామాలు చదువుతుండండి. డాడీకి కొంచెం పని తగ్గుతుంది."

"మంచిది తల్లీ... గవర్నర్ గారిల్లేనా ఇంకా అట్నుంచి వెళ్ళే ఇళ్ళు ఇంకేమైనా ఉన్నాయా?"

"లేదంకుల్.. ఒకటే."

"మంచిది." ఫోన్ పెట్టేశాడు వెంకట్రావు.

సుందరికి విషయం చెప్పాడు.

"ఆ నామాలు నాకు నోరు తిరగవు నువ్వు చదువుతుండు నేను వింటుంటాను." అన్నాడు

"ఏం చేస్తాం ఖర్మ... తప్పుతుందా?" విష్ణుసహస్రనామాలు చదవటం మొదలు పెట్టింది సుందరి.

వెంకట్రావు 'మమ' అనసాగాడు.

శాస్త్రిగారింట్లో-

"ఏమంటాడమ్మా వాడు?" అడిగారు శాస్త్రిగారు.

"నమ్మేశాడు నాన్నా." పక పక నవ్వింది రంగవల్లి.

"నిన్న సమయానికి ఫోన్ చేశావు. లేకపోతే ఇరవైవేలు నష్టపోయేవాళ్ళం." పెద్దగా నవ్వారు

శాస్త్రిగారు.

"నువ్వు అంతసేపు రాకపోయేసరికి అనుమానం వచ్చింది. అందుకే చేశాను."

"నా బంగారు తల్లి.. ఏభై తులాల బంగారం, పదిలక్షల కట్నంతో నీ వివాహం రంగరంగ వైభవంగా జరిపిస్తాను."

"పో నాన్నా... నీకంతా తొందరే."

"నా తల్లే... నా తల్లే..." కూతురి బుగ్గలు ప్రేమగా నిమిరారు శాస్త్రిగారు.

"ఏమిటి ఏదో బంగారం అంటున్నారు." నవ్వుతూ కాఫీతో వచ్చింది శాస్త్రిగారి భార్య సోమిదమ్మ.

"అహా... ఏంలేదు. నా కూతురును బంగారం అంటున్నాను."

"ఏం కాదులెండి నాకు వినపడుతునే ఉంది. కలెక్టరు చేసినట్టు ఫోన్ చేస్తేనే ఏభైతులాల బంగారం అంటున్నారే. మరి చీఫ్ మినిష్టర్ చేసినట్లు చేసినందుకు నాకెంతిస్తారో..."

"నీకేమే... ఇప్పటికే నిలువెత్తు బంగారం ఉంది. కొత్తగా చేయించినా పెట్టడానికి నీ వంటిమీద చోటేదీ?"

"అయితే ఇవాళ్టినుంచీ వళ్ళు పెంచుకుంటాన్లెండి"

విరగబడి నవ్వుకున్నారు ముగ్గురూ.

"భోజనం చేసి వెళ్తారా?"

"ఈ పూట వద్దులే. అక్కడ భారీగా చేయిస్తున్నాను. సాయంకాలం వంట చెయ్యకు. ఆ పదార్థాలన్నీ తెస్తాను. నాలుగు రోజులకు సరిపడా తినవచ్చు."

"అలాగే... వరమాన్నంలో దండిగా జీడిపప్పు, ద్రాక్ష, బాదం పప్పు వెయ్యమని చెప్పండి.

"అరెరెరె... బాదం పప్పు చెప్పడం మరిచానే..."

"ఫరవాలేదు. సూర్యుడి కిష్టమని చెప్పి తెప్పించండి"

"ఓ... అలాగే..."

"ఓ యాభై తమలపాకులు బియ్యం మీదపెట్టి ప్రతిదాంట్లో పది జీడిపప్పులు,




నాలుగు ఖర్జూరాలు పెట్టించండి. ఓ యాభై ఎండు కొబ్బరి చిప్పలు పట్రండి షాపువాడు అడుగుతున్నాడు."

"అలాగే తెస్తాను"

"మరి వక్కలు చెప్పారా?"

"అయ్యో.... మర్చేపోయాను."

"మండినట్టే ఉంది. సాయంత్రానికి కిలో వక్కలైనా ఇస్తానని చెప్పి షాపువాడి దగ్గర డబ్బులు కూడా పుచ్చుకున్నాను. ఇంట్లో అరకిలో కూడా లేవు. అవి గూడా తెప్పించండి."

"మరి ఊరుకుంటానా? బాగా గుర్తుచేశావు. ఇక నాకు టిఫిన్ వడ్డించు. వెళ్తాను. ఇప్పటికే పదకొండయింది."

"రండి.. రండి.. నిముషంలో వడ్డిస్తాను."

నవ్వుతూ వంటింట్లోకెళ్ళింది సోమిదమ్మ.

"నాన్నా... నీ పంచెలు మరీ మురికి పట్టి ఉన్నాయి. మంచి జరీధోవతులు కొనుక్కోరాదూ." అన్నది రంగవల్లి.

నవ్వారు శాస్త్రిగారు.

"కావాలంటే నేనిపుడు రెండు కార్లు మెయిన్‌టెయిన్ చెయ్యగలను. కానీ పురోహితులెప్పుడూ పేదవారుగానే కనిపించాలి. పాతడొక్కు సైకిల్ మీదనే తిరగాలి. తాంబూలంలో మనం అనుకున్నదానికంటే దక్షిణ ఎక్కువ కనిపించినా ముఖం అసంతృప్తిగానే పెట్టాలి. మూడుపూట్ల భోజనం చేసినా ఒంటి భోజనమే అనిపించాలి. పార్టీ ఎన్ని కానుకలిచ్చినా చాలలేదనే చెప్పాలి. అప్పుడే మేమంటే గౌరవం పెరుగుతుంది" చెప్పారు.

"మరి నువ్వు అనుభవించేదెప్పుడు నాన్నా?" అమాయకంగా అడిగింది రంగవల్లి.

"నా పిచ్చితల్లీ... మీరంతా రోజూ పట్టుబట్టలు కట్టుకుని వంటినిండా నగలు పెట్టుకుని తిరుగుతుంటే నేను అనుభవిస్తున్నట్లే, ఉండడం ముఖ్యం కానీ ప్రదర్శించడం కాదమ్మా.. పద టిఫిన్ చేద్దాం."

ఇద్దరూ వంటింట్లోకి వెళ్ళారు.

"టైం పన్నెండయింది. ఇంకా రాలేదు శాస్త్రిగారు. విష్ణు సహస్రనామాలు మూడు సార్లు చదవడం పూర్తయింది. ఒకసారి ఇంటికి వెళ్ళి రాగూడదూ." విసుగ్గా అన్నది సుందరి.

"అబ్బబ్బబ్బ.. వీళ్ళతో పెద్ద తలనొప్పి పోయింది. ఒకే రోజు నాలుగైదు ఒప్పుకుంటారు. అవతలివాళ్ళను విసిగిస్తారు. సరే నేను వెళ్ళొస్తా." బయట కొచ్చి స్కూటర్ స్టార్ట్ చేశాడు వెంకట్రావు.

ఇంతలోనే శాస్త్రిగారు శరవేగంతో సైకిల్ మీద వచ్చారు. ఊపిరి పీల్చుకున్నాడు వెంకట్రావు.

"మీకోసమే బయలు దేరుతున్నా." అన్నాడు వెంకట్రావు.

"మీరు ఎదురు చూస్తుంటారనే ఆశీర్వచనాలు చదవమని గవర్నర్ గారి భార్య ఎంత మొత్తుకున్నా కనీసం కాఫీ అయినా తాగకుండా ఉరుకులు పరుగులతో వస్తున్నా. ఆలస్యానికి క్షమించాలి." అన్నారు శాస్త్రిగారు.

"ఇంత బిజీగా ఉంటారు. కనీసం ఒక మోటార్ సైకిల్ కొనుక్కోవచ్చుగదా."

"అయ్యో రామ! నా బ్రతుక్కు అదొకటి! సైకిల్‌కు పంచర్ పడితేనే బాగుచేయించే రికానా లేనివాడిని. ఇక మోటారు వాహనం నడపటం నావల్లేమవుతుంది? పైగా దానికి ఇంధనం కొనాలాయె, మీరంటే సర్కారీ కొలువు కాబట్టి కారైనా కొనగలరు."

"పేరుకు సర్కారీ కొలువు. సర్కారు దగ్గర ఖజానా ఎప్పుడూ ఖాళీగా ఉన్నట్లే మాజేబులూ ఎప్పుడూ ఖాళీయే రండి..రండి.. మొదలు పెడదాం."

లోపలికొచ్చారిద్దరూ.



"అమ్మాయ్... విష్ణు సహస్రనామాలు నిష్టగా చదివావా?"

"మూడుసార్లండీ"

"అరెరె! ఒక్కసారే చదవమని చెప్పానే...

"టైముంది గదాని కాలక్షేపం కోసం ఇంకో రెండుసార్లు చదివేను. మంచిదే గదా!"

"ఏం మంచిది? మూడు సార్లంటే మూడువేల నామాలు. వాటిని త్రిమూర్తుల చేత భాగిస్తే వెయ్యి... వెయ్యిని దిక్పాలకులతో భాగిస్తే ఒక్కొక్కరికి నూట పాతిక. అంటే ఇప్పుడు నూటపాతిక తాంబూలాలు పళ్ళెంలో పెట్టాలి. అదే ఒక్కసారి చదివివుంటే నలభై రెండు తాంబూలాలతో సరిపోయేది..."

"అప్పటికీ ఇహచాలులే నోరు నెప్పి పుడుతున్నదని విసుక్కున్నాను. అయినా వింటేగా... ఏదో గొప్ప భక్తురాలి మాదిరిగా స్కూలు పిల్లాడు పాఠం అప్పజెప్పినట్లు టకటక చదివేసింది." కోపంగా అన్నాడు వెంకట్రావు.

"దీన్లో ఇంత తిరకాసుందని నాకేం తెలుసు? దేవుడి పేర్లే గదా అని చదివాను" ముఖం ముడుచుకుని అన్నది సుందరి.

"నరెపోనివ్వమ్మా దేవతల ప్రీత్యర్థం ఎంతపెడితే అంత మంచిది వెంకట్రావుగారూ... మీరు టిఫినేం చెయ్యలేదు కదా?" అన్నారు శాస్త్రి గారు.

"లేదండీ. కడుపు దహించుకుపోతున్నది."

"కావాలంటే పాలు పుచ్చుకోండి. మనం పూజకు కూర్చుంటే ఇహ మూలశంకకు కూడా లేవరాదు. కనుక అలాంటివేమైనా ఉంటే ముగించుకుని పాగతాగాలనుకుంటే ఒకేసారి నాలుగైదు సిగరెట్లు కాల్చేసి స్నానం చేసిరండి."

"మీరు మాత్రం నశ్యం పీల్చచ్చు పూజ జరుగుతున్నపుడు."

"నశ్యం మాకు ఔషధం లాంటిది. దాని మీద నిషేధం లేదు. శాస్త్రంలో ఏం చెప్పారో తెలుసా?

వేశ్యల కౌగిలికంటెను
సశ్యశ్యామల సిరుల విషయముల కంటెన్
నశ్యము జనులకు కడు ఆ
వశ్యము శారీర రుజలనివారణ కొరకై

అంటే శరీరంలోని అన్ని రోగాల నివృత్తి కొరకు నశ్యం పీల్చడం అవసరం అన్నారు. కావాలంటే మీరూ ఒక పట్టుపట్టచ్చు.

"వద్దులెండి. నశ్యం డబ్బా చూస్తేనే నాకు తుమ్ములొస్తాయి. నేను వెళ్ళి స్నానం చేసొస్తా. మీరీ లోపల కాఫీ తాగండి" బాత్‌రూమ్‌లోకి వెళ్ళాడు వెంకట్రావు.

"అమ్మాయ్.. జీడిపప్పు, వక్కలు, బాదంపప్పు, మూడు కట్టల ఆకులు, నూట పాతిక ఐదు రూపాయల బిళ్ళలు, ఒక వెండి పళ్ళెంలో పది కిలోల బియ్యం తెచ్చి నాముందు పెట్టు. నేను దేవతలకు సంభావనలు పంచుతాను" అన్నారు శాస్త్రిగారు.

"వక్కలు, బాదంపప్పు తేలేదండీ... నిన్న మీరు చెప్పారా?" అడిగింది సుందరి.

"పోకలు, పిస్తాలు అని చెప్పానుగదమ్మా... వెంకట్రావు గారికి అర్థం కాలేదేమో..."

ఇంతలో వెంకట్రావు తల తుడుచుకుంటూ వచ్చాడు.

"ఏవండీ... నిన్న తెచ్చిన సరుకుల్లో వక్కలు, బాదంపప్పు లేవుట. మర్చిపోయారా?" అడిగింది సుందరి.

"నిన్న అది చెప్పలేదే" భృకుటి ముడిచి అన్నాడు వెంకట్రావు.

"పోకలు, పిస్తాలు అని చెప్పార్ట. మీకు వినపడుండదు. తొందరగా పట్రండి" అన్నది సుందరి.

"ఇంట్లో వక్కపొడి ఉంది. అది పెట్టండి తాంబూలాల్లో" చెప్పాడు వెంకట్రావు.

"అన్నన్న... ఎంతమాట? అవి పనికిరావండీ. వక్కలు అగ్ని దేవుడికి అత్యంత ప్రీతి పాత్రమైనవి. బాదం పప్పు చంద్రుడు ఇష్టపడే ఆహారం. వారిద్దరినీ తృప్తి పరచకపోతే ఇంట్లో పొయ్యి వెలగదు. వెలుగుండదు." అన్నారు శాస్త్రిగారు.

"అబ్బా... పోనివ్వండి... ఎలాగోలా సర్దండి" విసుగ్గా అన్నాడు వెంకట్రావు.

ఇంతలో సుందరి లోపల్నుంచి కేకపెట్టింది.

-(ఇంకావుంది)

---

# ఘంటసాల క్విజ్

మొదటి బహుమతి : రూ. 250/-
రెండవ బహుమతి : రూ. 200/-
మూడవ బహుమతి : రూ. 150/-
మరియు ఘంటసాల కలర్ ఫోటో

**క్విజ్ రూపకల్పన, సమర్పణ, నిర్వహణ**
డా॥ కె.వి.రావు,
వ్యవస్థాపకులు,
పద్మశ్రీ ఘంటసాల గానసభ,
28, 1-1-79, ఆర్టీసీ క్రాస్‌రోడ్స్,
హైదరాబాద్ - 500 020.



## క్విజ్‌నెం-12

1. ఘంటసాల, అక్కినేని కలిసి పాడిన చిత్రం?
జ: ..............................

2. సంగీత దర్శకుడు ఆదినారాయణరావు రచన, సంగీతం చేయగా ఘంటసాల పాడిన చిత్రం?
జ: ..............................

3. ఘంటసాల - నటి, గాయని, నిర్మాత సి.కృష్ణవేణి కలిసి పాడిన తొలి చిత్రం?
జ: ..............................

4. ఘంటసాల సంగీత దర్శకత్వంలో నటి జయలలిత పాడిన చిత్రం?
జ: ..............................

5. ఒకే పాటను ఘంటసాల, రామకృష్ణ విడివిడిగా పాడారు. ఆ పాట పల్లవి?
జ: ..............................

పంపినవారి పేరు : ______________________

చిరునామా : ______________________

______________________

**నిబంధనలు:**

ఎ) పోటీలో పాల్గొనగోరేవారు పక్కన ప్రచురించిన కూపన్ మాత్రమే నింపి కవరులో పంపాలి. కూపన్ కాకుండా మరే విధంగా పంపినా ఆ ఎంట్రీ స్వీకరించబడదు.

బి) కవరుపై 'ఘంటసాల క్విజ్' అంటూ పేర్కొనటం మరచిపోకూడదు.

సి) ప్రకటించిన బహుమతులను నగదుగా గాని, ఆడియో క్యాసెట్లుగా గాని, సీడీలుగా గాని విజేతలకు 'పద్మశ్రీ ఘంటసాల గానసభ - హైదరాబాద్' వారిచే నేరుగా పంపటం జరుగుతుంది.

డి) ఏ బహుమతి కైనా ఒకరు కన్నా ఎక్కువగా విజేతలుంటే తుది నిర్ణయం 'పద్మశ్రీ ఘంటసాల గాన సభ' వారిదే!

ఇ) ధారావాహికంగా కొనసాగే ఈ క్విజ్ పోటీలలో ఏ కేటగిరీలోనైనా వరసగా 5 సార్లు విజేతగా ఎన్నికైనవారికి ఓ ప్రముఖవ్యక్తి ద్వారా హైదరాబాద్‌లో మరొక ఆకర్షణీయమైన బహుమతిని అందజేయటం జరుగుతుంది.

**కూపన్‌లు 31-10-2003 లోగా చేరాలి**

**కూపన్‌లు పంపవలసిన అడ్రసు**
'హాసం- హాస్య సంగీత పత్రిక'
502, శ్రీ బాలాజీ నిలయం, 13-1-212,
మోతీనగర్, హైదరాబాద్-500 018.

# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

| తమిళం | | తెలుగు | |
|---|---|---|---|
| చిత్రం | : నానుమ్ ఒరు పెణ్ | చిత్రం | : నాదీ ఆడజన్మే |
| రచన | : కణ్ణదాసన్ | రచన | : దాశరథి |
| సంగీతం | : ఆర్.సుదర్శనం | సంగీతం | : ఆర్.సుదర్శనం |
| గానం | : పి.సుశీల | గానం | : పి.సుశీల |



ఎ.వి.ఎం. సంస్థ తమిళంలో నిర్మించిన 'నానుమ్ ఒరు పెణ్' (నేనూ ఒక స్త్రీనే) చిత్రం విశేష ప్రజాదరణ పొందడంతో ఆ చిత్రంలో కీలకమైన పాత్ర పోషించిన ఎస్.వి.రంగారావు మరికొందరితో కలిసి ఆ చిత్రాన్ని 'నాదీ ఆడజన్మే' పేరిట తెలుగులో నిర్మించారు.

అనగనగా ఒక బడుగు మనిషి. ఆ మనిషికి ఇద్దరు చెల్లెళ్లు. ఇద్దరూ చెల్లెళ్లూ గుణవంతులే కాని పెద్ద చెల్లెలికి చదువుకునే వీలు చిక్కలేదు. పైగా ఆమె కారు నలుపు. ఆ ఊళ్లోనే ఒక డబ్బున్న పెద్దమనిషికి ఇద్దరు కొడుకులు. వాళ్ళలో పెద్దవాడు చిత్రకారుడు, భావుకుడు. పెద్దమనిషికి ఒక బావమరిది. ఆ బావమరిది పన్నాగం వల్ల నల్లని పిల్ల - ఈ పెద్దమనిషికి పెద్దకోడలవుతుంది. కోడలు నల్లనిదని అందరూ ఏవగించుకుంటారు. మామగారికీ ఆమె అంటే పడదు. ఆ ఇంటి తోటలో శ్రీ కృష్ణుడి విగ్రహం ఒకటి కొలువుతీరి ఉంటుంది. తన నల్లదనాన్ని అసహ్యంచుకొనేవారు ఆ నల్లనయ్యను ఎందుకు పూజిస్తున్నారో అర్థంకాదామెకు. తన పరిస్థితిని ఆ కన్నయ్యకే విన్నవించుకొనే సన్నివేశం కోసం - కణ్ణదాసన్ ఒక పాట రాశారు. ఆ పాటను పి.సుశీల గానం చేశారు. తమిళ చిత్రంలో విజయకుమారి ధరించిన పెద్దకోడలు పాత్రను తెలుగు చిత్రంలో సావిత్రి ధరించారు.

నలుపు రంగు నాయిక కథతో వచ్చిన ఈ చిత్రం స్ఫూర్తితో ఆ తర్వాత నలుపు రంగు నాయకుల కథలూ, నలుపురంగు నాయికల కథలూ, ఇద్దరు కవలలలో ఒకరు నల్లగా ఉన్న విచిత్ర కథలూ తెరకెక్కాయి!

నల్లని కృష్ణుడిని ఉద్దేశించిన ఆ తమిళగీతం ఇది:

కణ్ణా కరుమై నిఱక్ కణ్ణా - ఉన్నైక్
కాణాద కణ్ణిల్ల్లయ్ - ఉన్నై
మఱువ్ పొరిల్ల్లయ్ కణ్డు వెఱుప్ పొరిల్ల్లయ్ -
ఎన్నైక్కణ్డాలుమ్ పొఱుప్పాదిల్ల్లయ్ ॥కణ్ణా॥
మనమ్ పార్క్క మఱుప్పోర్మున్ మడైత్తాయ్ కణ్ణా!
నిఱమ్ పార్త్తు వెఱుప్పోర్మున్ పడైత్తాయ్ కణ్ణా!
ఇనమ్ పార్త్తు ఎన్నైచ్చేర్క్క మఱన్దాయ్ కణ్ణా - నల్ల
ఇదమ్ పార్త్తు శిలైయాగ అమర్న్దాయ్ కణ్ణా! ॥కణ్ణా॥
పొన్నాన మనమొన్డు తన్దాయ్ కణ్ణా - అదిల్
పూప్పోన్ల నినై వొన్ఱై వైత్తాయ్ కణ్ణా!
కణ్ పార్క్క ముడియామల్ మఱైత్తాయ్ కణ్ణా
ఎన్దక్కడన్ తీర్క్క ఎన్నై నీ పడైత్తాయ్ కణ్ణా! ॥కణ్ణా॥

### తమిళ గీతానికి భావానువాదం:

కన్నయ్యా (కన్నా)! నలుపు రంగు కన్నా - నిన్ను
చూడని కనులు లేవే - నిన్ను
(కాదనే) వద్దనే వారు లేరు, చూచి ఏవగించుకొనేవారు లేరు
నన్ను చూసినా సహించేవారు లేరు
మనసు చూడడానికి నిరాకరించేవారి ముందు సృష్టించావు కన్నా
రంగు చూసి ఏవగించుకొనే వారి ముందు సృష్టించావు కన్నా

తగిన జోడి చూసి నను చేర్చడానికి మరచిపోయావు కన్నా
మంచిచోటు చూసుకొని శిలగా కుదిరావు కన్నా
బంగారు మనసొకటి ఇచ్చావు కన్నా అందులో
పువ్వు వంటి ఆలోచన (జ్ఞాపకం) ఒకటి ఉంచావు కన్నా
నన్ను చూడలేకుండా మరుగు పరిచావు కన్నా - ఏ
ఋణం తీర్చడానికి నన్ను నీవు సృష్టించావు కన్నా!

"రంగును బట్టీ రూపాన్ని బట్టీ వేషభాషలను బట్టీ మనుషులను అంచనా వేయకూడదు" అని పెద్దలు చెబుతూ ఉంటారు. అయితే ఆ పెద్దల మాటను అందరూ అన్ని సందర్భాలలోనూ పాటిస్తున్నారని చెప్పడం కష్టం.



కథానాయిక నల్లనిదని అందరూ ఆమెను ఏవగించుకుంటున్నారు. తన మనోవ్యథను ఆమె, నల్లనివాడయిన కన్నయ్యకే విన్నవించుకొంటున్నది. ఆ నల్లనయ్యను చూడాలని అందరూ ఉవ్విళ్లూరుతూ ఉంటారు. ఆయనను కాదనేవారు లేరు. కానీ నాయికస్థితి అటువంటిది కాదు. ఆమెను ఆదరించేవారే లేరు.

ఆ కన్నయ్య ఆమెను ఎటువంటి పరిస్థితిలో పడవేశాడు? మనసు చూడడానికి నిరాకరించేవారి ముందూ రంగు చూసి ఏవగించుకొనే వారిముందూ ఆమెను సృష్టించాడు. అనువు కాని యింటికి కోడలిని చేశాడు. ఇన్ని చేసి మంచి చోటు చేసుకొని శిలగా అమరిపోయాడు ఆ కన్నయ్య.

తన రంగు నలుపే కాని మనసు బంగారం. ఆ బంగారు మనసులో సున్నితమైన భావం ఒకటుంది. అయితే ఆ భావాన్ని కంటికి కనబడనీక మరుగు పరచాడట ఆ కన్నయ్య. 'ఏ అప్పు తీర్చడానికి నన్ను పుట్టించావయ్యా కన్నయ్యా' అని బాధపడుతున్నది ఆ నాయిక.

తమిళగీతం బాణీనే అనుసరించినా దాశరథి రాసిన తెలుగు పాట వాణి కొంచెం భిన్నంగా ఉంది.

నల్లని కన్నయ్యను చూడనివారూ, పూజించని వారూ లేరు. అయితే నల్లగా ఉన్న కారణం చేత తనను అందరూ నిందిస్తున్నారని (తెలుగు చిత్రం) నాయిక బాధపడుతున్నది.

తమిళగీతంతో పోల్చి చూడగా ఈ పాట సన్నివేశంలో తెలుగు చిత్రం నాయికలో ఆత్మవిశ్వాసం కొద్దిగా ఎక్కువగా ఉన్నట్టు కనిపిస్తుంది. అత్తవారింట తన గుణం మెచ్చేవారు లేరు. కన్నయ్య తనను వెలిచేసే వారికి బలి చేశాడు. తానేమో సిరిచూసుకొని ఆమెను మరిచాడు. గుడి చూసుకొని మురిశాడు. తనకు బంగారు మనసునిచ్చి అందులో అందాల గుణాన్ని పొదిగాడు. ఏం లాభం? మోముపై నలుపు పులిమినాడు!

ముందే కట్టిన వరుసకు మాటలు పొదగడంలో సౌలభ్యం ఉన్నట్టే ఇబ్బందీ ఉంటుంది. 'అందాల గుణమును పొదగడం', 'మోముపై నలుపును పులమడం' వంటి పదబంధాలలో సౌలభ్యం కనిపించదు. 'మోముపై నలుపు' అనడం వల్ల నాయిక ముఖం మాత్రమే నల్లగా ఉందన్న అభిప్రాయం రావచ్చు!

ఈ తెలుగు పాట కూడా తమిళ మాతృకలాగా విశేషమైన ప్రాచుర్యం గడించి మంచి పాటగా వాసికెక్కింది. దాశరథి రాసిన ఆ తెలుగు గీతం ఇది:

కన్నయ్యా నల్లని కన్నయ్యా
నిన్ను కనలేని కనులుండునా
నిన్ను ప్రేమింతురే
నిన్ను పూజింతురే
నన్ను గనినంత నిందింతురే ॥కన్నయ్యా॥
గుణమెంచలేనింట పడవేతువా
నన్ను వెలివేయు వారికే బలిచేతువా ॥గుణ॥
సిరి చూచుకొని నన్ను
మరిచావయ్యా ॥సిరి॥
మంచి గుడి చూసుకొని నీవు
మురిసేవయ్యా ॥కన్నయ్యా॥
బంగారు మనసునే ఒసగినావు
అందు అందాల గుణమునే పొదిగినావు ॥బంగారు॥
మోముపై నలుపునే పులిమినావు ॥మోము॥
ఇట్లు నన్నేల బ్రతికించ
దలచినావు ॥కన్నయ్యా॥

- పి.ఎస్.గోపాలకృష్ణ

## కొంటెకొశ్చెన్లు - తుంటరి జవాబులు




**బి. బాలమురళీకృష్ణ, హైదరాబాద్.**

ప్ర: పాజిటివ్ యాటిట్యూడ్ ఎంతవరకు ఉండొచ్చు?

జ: హెచ్.ఐ.వి. పాజిటివ్ కానంతవరకు.

**వి.మంజురాణి - హైదరాబాద్.**

ప్ర: టింగరి ఇల్లాలు?

జ: 'మన అబ్బాయి పరీక్ష అటకెక్కిందే పెళ్ళామా' అని అంటే 'పచ్చళ్ళ జాడీలు పగిలిపోతాయేమోనండీ' అంటూ గాభరా పడేది.

**మామిడి మహేంద్ర - పూణే**

ప్ర: డాక్టర్‌కి క్రికెట్ పిచ్చి ఉంటే?

జ: పేషంట్ టెంపరేచర్ చూసి '104 నాట్ అవుట్' అంటాడు.

## పేరు - రిపేరు



అన్నయ్య - ఠాగూర్ - ఐతే - తమ్ముడు - జానీ

- లట్టుపల్లి శ్రీనావాస్‌రెడ్డి, కొంగర్‌కలాన్.

తొలిచూపులోనే - నాలోవున్న ప్రేమ - నీతో - ఎలా చెప్పను

- శ్రీ, ఆచంట.

పెళ్ళాం ఊరెళితే - పెళ్ళాంతో పనేంటి - ప్రేయసి రావే

- కె.యస్.రామారావు, విజయనగరం



## చిలిపి లిపి




| | |
|---|---|
| 1/4 కోళ్ళు | = పావు కోళ్ళు |
| Car Darkness | = కారు చీకటి |

- వై.ధీరజ్‌కుమార్, నందిగామ.

| | |
|---|---|
| Sun the day sun the D | = సందడే సందడి |
| Put School | = పెట్టుబడి |

- మేడా మస్తాన్‌రెడ్డి, పూణే.

## ఈ రూటేవేరు

| | | |
|---|---|---|
| Powder Hand | = | పొడి చెయ్యి |
| Flower Hand | = | విరి చెయ్యి |
| Elephant Hand | = | కరి చెయ్యి |

- ఎమ్.ఎల్.వి. కృష్ణమాచార్యులు, హైదరాబాద్.



## డబుల్ రోల్




ఒరే... **రోహితు** ఆ పు**రోహితు**డితో గొడవెందుకురా నీకు...
నీలి మందు ఎక్కువై **నీ లంగా నీలంగా** మారిందే...

**- వై.క్రాంతిసాగర్, ఏలూరు.**

మా స్కూల్లో **సార్లు** పాఠాలు రెండు **సార్లు** చెబుతారు
ఆ గడ్డ**పార**తో తవ్వితే నాకు అ**పార**మైన నిధి దొరికింది

**-వై. ధీరజ్ కుమార్, నందిగామ.**

## చిలిపి కవిత

ప్రేమలో పడటం ఒక తీయని మత్తు
ప్రేయసి కోసం చెయ్యాలి ప్రతిరోజూ కసరత్తు
పెళ్ళయ్యాక ఎలా వచ్చి పడుతుందో క్షణానికో విపత్తు
అంచేత వెయ్యాలి రోజుకో ఎత్తు
ఎంత చేసినా చివరికవుతాం చిత్తు చిత్తు
అదే ఆడవారిలో వున్న గొప్ప మహత్తు
ఏనాటికీ అంతుచిక్కని గమ్మత్తు

**- తాళాభక్తుల లక్ష్మీప్రసాద్, విశాఖపట్నం**



## పేరడీ పేరేడ్



ప: నను బాధింపక నడిచి వచ్చితివా
మరి సాధింపగ తలచి వచ్చితివా... ఓ బాలా... ॥నను॥
చ: మతి చెదిరిన తికమకతో అల్లదిగో రాధమ్మా
గతి తప్పిన చూపులతో అదిగదిగో పాపమ్మా
బరువెక్కిన చెక్కిలితో ఇదిగిదిగో మరో భామా
అడుగడుగూ అణువణువూ
నీ కోరకై వెతుకుచుండగా ॥నను॥
చ: తాటకి అంశాలతో రాక్షసిగా పుట్టావు
ఇరుగూ పొరుగిళ్ళలో ఇక్కట్లే పెంచావు
మొరటు చేతి వాటముతో
జగమొండిగా నిలిచావు
ఆ అల్లుని గుండెలో... బల్లెంగా .... వుండాలని ॥నను॥

**- తెలికిచెర్ల రామకృష్ణ, విజయనగరం.**

**'బుద్ధిమంతుడు' చిత్రంలో "నను పాలింపగ నడచి వచ్చితివా" పాటకు పేరడీగా...**

## షార్ట్‌కట్స్




| | | |
|---|---|---|
| శిల్పాలా లక్ష్మి | = | శిల |
| దొంపర్తి గవర్రాజు | = | దొంగ |
| ఈదర గణపతి | = | ఈగ |
| దోరట్ల మహేశ్ | = | దోమ |

**- అడవి లలితశ్రీ, విజయనగరం.**

చిత్ర స్వర సుందరి



# లతా మంగేష్కర్



ప్రఖ్యాత నేపథ్య గాయకుడు,
బహుభాషా కోవిదుడు, కవి, రచయిత
'కళైమామణి', 'గానకళా సార్వభౌమ' బిరుదాంకితులు

**డా॥ పి.బి.శ్రీనివాస్**

'హాసం' పాఠకుల కోసం
తన అభిమాన గాయని జీవిత చరిత్రను
అక్షరబద్ధం చేస్తున్న సీరియల్ ఇది

కిందటి నెల (సెప్టెంబర్) 28వ తేదీన "లతా మంగేశ్కరు" 75వ ఏట (ప్లాటినమ్ జూబ్లి ఇయర్) అడుగుపెట్టడం లతా అభిమానులందరికీ, ఆ తేదీ, ప్రత్యేక పర్వదినం. ఈ రోజుల్లో డెబ్భైయేళ్ళు జీవించడమే విశేషం. ఆ విధంగా చూస్తే సంగీతవృత్తి సాగిస్తూ ఆరు దశాబ్దాలకి పైగా, విశిష్ట కీర్తి గౌరవాలతోనూ, అఖండైశ్వర్యంతోనూ, అశేష ప్రజాదరణతోనూ, లతా ఏకచ్ఛత్రాధిపత్యం నిరూపిస్తూ ఏలుతున్నారంటే అది అసాధ్య, అపూర్వ సాధన అనక తప్పదు.

ఆ సాధనని పురస్కరించుకునే "సహారా" మున్నగు ఛానల్స్ (టి.వి.)లో లతా గౌరవార్థం ప్రత్యేక కార్యక్రమం ఏర్పాటు చేసి, లతా సమక్షంలో, ఇతర గాయనీ గాయకుల చేత ఆమె పాడిన అనేక మెలొడీలు పాడించి కృతజ్ఞతాపూర్వకంగా తమ బాధ్యత నెఱవేర్చుకున్నారు. నిజానికి లతా రికార్డుల రికార్డు సేల్స్ (అమ్మకం) వలన బాగుపడిన సంస్థలూ, వ్యక్తులూ ఆనందించి అభినందించే అభిమానులు కూడా అసంఖ్యాకులు పైన ఉదహరించిన కార్యక్రమంలో గాయనీ గాయకులందఱూ, తమ అభిమాన గాయనికి నమస్కారాలందజేసి మఱీ ఆమెకి ఆమె గీతాలే పాడి వినిపించారు. వారు పాడే సమయాన లతా ముఖ భావాలను పరికిస్తే, ఆమె ఎంతటి "అగాధ గంభీర వ్యక్తి" అనే విషయం అవగాహన అవుతుంది. ఆమె జన్మదిన సందర్భాన సాక్షాత్తూ భారత ఉపప్రధాని శ్రీ ఎల్.కె.అద్వానీ, తమ ప్రశంసలతో పాటూ ప్రత్యేకమైన మెమెంటో కూడా బహూకరించడం ఆమె అంతస్తుకి నిదర్శనం - అద్వానీ గారికి నచ్చిన లత పాట "జ్యోతికలశ్ ఛల్‌కే".

ఆవేశపూరితమైన గాయిక లత. ముఖ్యంగా శోకగీతాలు పాడేటప్పుడు, కన్నీళ్లని అదుపులో పెట్టుకోలేకపోవడం ఆమెకు పరిపాటి. సన్నివేశాన్ని అర్థం చేసుకుని, దానికి తగిన ఆవేశంతో పాడడం సాధారణంగా గాయనీ గాయకులకులందఱికీ అలవాటే అయినా అందులో కూడా లతది ప్రత్యేకత.

బైజూబావ్‌రా చిత్రంలో, ట్రాజడీక్వీన్ మీనాకుమారి పాడవలసిన శోక గీతాన్ని రికార్డు చేసిననాడు, ఒక వింత జరిగింది. ఆర్కెస్ట్రా రిహార్సల్సు పూర్తి అవగానే, లత వచ్చి అతి తక్కువ రిహార్సల్సు చేసి, వెంటనే టేక్‌కి రెడీ అవగానే, సౌండ్ ఇంజనీరు ఈషన్‌ఘోష్, పల్లవీ, చరణం అయిన క్షణాన, కట్ అన్నారట. కారణం ఆర్కెస్ట్రా బిట్ అవగానే రెండో చరణాన్ని "సమం" (beat)పైన ఎత్తుకోవలసిన లత పాడకపోవడమే. మొదట నౌషాద్‌కి ఏమైందో తెలియక కంగారు పడ్డారట. తీరాచూస్తే, లతా మైక్రోఫోన్ పక్కనే వున్న స్టూల్ మీద చతికిలబడి, ఏడుస్తూ కనబడిందట.

నౌషాద్ ఆదుర్దాగా ఏమైందని అడగ్గా, "సన్నివేశానికి తగినట్టు లిరిక్‌కి మీరు చేసిన



ట్యూన్ ప్రభావం, నామనస్సుని కరిగించి వేసింది. ఆ ఇమోషన్‌ని దాటుకుని రెండో చరణం అందుకోలేకపోయాను" అని వివరించిందట ఆ మనస్విని! "అసలు ఆ ప్రభావం "భైరవ్" (మాయామాళవగౌళ) రాగంలోనే వుంది. నీలో గల భావుకత వలన, ఆ ప్రభావం మఱింత హెచ్చింది. ఇందులో నా ఘనత ఏముంది?" అని సహజ వినయం ఉట్టిపడేలా నౌషాద్ అన్నారట. మన పూర్వీకులు సంగీత సాహిత్యాదికళా నిపుణులైన మహర్షులు, రాగతాళాది ప్రక్రియలలో ఎన్నో నిధులు సేకరించి మనకి ఏనాడో అందించారు. మనం ఆ నిధులలో కొంచెం కొంచెంగా తీసుకుని వాడుకుంటున్నామే తప్ప, మన రచనలలో గొప్పతనమేముంది? అనగలిగిన గొప్పతనం ఆయనకే చెల్లింది.

నిజానికి, ఆయన చేసిన కొత్త ప్రయోగాలూ, ప్రక్రియలూ ఇన్నీ అన్నీకావు. అవి ఎందరెందరికో

ఆదర్శప్రాయాలై విలసిల్లుతున్నాయి ఈనాటికీ - ఆధారషడ్జమం చుట్టూ స్వరాలని జిలేబీ చుట్టల లాగ చుట్టి ఎన్నెన్నో హిట్‌సాంగ్సు అందించిన ఘనత ఆయనకే దక్కింది. పాటలలో పల్లవులు అలా రూపొందించి, చరణాలలో 1,1,1; 1,1,2; 1,2,3; 122 పద్ధతిలో రిపీట్ చెయ్యడం కూడా నౌషాద్ అందించిన బాణీయే.

విదేశాలలో లత యిచ్చిన ఒక సంగీత కచ్చేరీలో "అనార్కలీ"లోని "యె జింద్‌గీ ఉసీకీహై" అనే పాట భావస్ఫోరకంగా పాడి, ఆఖరిని, "అల్‌విదా" అనే మాట పదే పదే వేదన ఉట్టిపడేలా ఆమె పాడిన పద్ధతి, ఎక్కువ భాష తెలియని శ్రోతల్ని కూడా ఆకట్టుకుంది. విరామ సమయంలో అనేక మంది ఆమె చుట్టూ గుమిగూడి, అభినందనల వర్షం కురిపించే సరికి, కృతజ్ఞతా భావావేశంతో కన్నీటిలో తడిసి ముద్దయిపోయి, "ఈ దేశం అద్భుతం, ఇక్కడి శ్రోతలైన మీరందరూ గొప్ప రసజ్ఞులు" అని వారితో అంటూనే "వీళ్లు మాట్లాడే భాష నాకు అర్థమైతే ఎంత బాగుండును" అని బిగ్గరగానే అనుకున్నారట లతా . శోకంలో కూడా హాస్యం - వ్యంగ్యం కలిపి భాషించగల సామర్థ్యం లతాలో నిండి వుంది.

విదేశీ శ్రోతలు "మైఁ తుల్‌సీ తేరే ఆంగన్ కీ", "ధీరేసే ఆజారీ నిందియా" వంటి చిత్ర గీతాలతో పాటు, ఫిలిం సాంగ్ కాని దేశభక్తి గేయం, జవహర్‌లాల్‌నెహ్రూని సైతం కంటతడి పెట్టించిన "ఐ మేరేవతన్‌కే లోగో" అనే గీతాన్ని అడిగి మఱీ పాడించుకునేవారట ! హిందీ ఎక్కువగా అర్థం కాకపోయినా "ఆ ప్రైవేటు సాంగు" కూడా అడిగి పాడించుకోవడంతో విదేశాలకి వలస వెళ్లిన వాళ్లు కూడా 'స్వదేశభక్తి'లో ఏమాత్రం కొఱత లేని వారని నిరూపించుకునే వారన్నమాట.

"లత" వాయిస్‌లోనే చాలా ప్రత్యేకత లున్నాయి అనేది ఏనాడో ఋజువైన నిజం - ఆమె పాడిన వివిధ భాషల గీతాలు, ఆయా భాషలు అర్థం కాని శ్రోతలు కూడా మంత్రముగ్ధులై నిలుచుని వింటూ ఆనందించడం తఱచూ అందఱికీ కనిపించే సన్నివేశం - ఆమె వాయిస్‌లో అలాంటి - దైవీక ఆకర్షణ - బహు జన్మల తపఃఫలం.

లత పాడిన తరవాతనే తన పాటలు మరీ ప్రజాదరణ సాధించగలిగాయి అని బాహాటంగా ఒప్పుకున్న పాప్యులర్ మ్యూజిక్ డైరెక్టర్‌లలో - ఖయ్యాం - ఒక ప్రముఖ వ్యక్తి! యశ్‌చోప్రా వంటి మెగా దర్శకుడు అన్నారట - "సాధారణంగా, పాడేవాళ్లే సంగీతాన్ని అనుసరిస్తారు. కాని లతా విషయంలో సంగీతమే ఆమెని అనుసరిస్తుంది" అని. ఇదే ధోరణిలో ఆమెకి Die-hard అభిమాని అయిన ఒక యువక రచయిత (జె.శ్రీకాంత్) "సంగీతానికి కొత్త వ్యాకరణం నేర్పిన సంగీత శాస్త్రవేత్త లతా మంగేష్కర్" అని, రిమా'ర్కారు'. లత వచ్చిన తర్వాతనే గానానికి జ్ఞానం హెచ్చిందని ఆయన వివరణ.

నిజానికి "సంగీత జ్ఞానం" ఎంత వున్నా శ్రావ్య గాత్రం లేకుంటే "గానం" కూడా కుంటుపడడం సహజం - "లతా మంగేశ్కర్" కంఠస్వరం "షడ్జమ (ఆధార) శృతిని ఆలాపిస్తూ వుంటే, ఎవరికైనా పాడేందుకు తంబూరా కూడా అక్కఱలేదు" అని ఓ సభలో ప్రసంగిస్తూ నేను పలికిన ప్రశంసా వాక్యాన్ని , నభ్యన భ్యులందరూ మిన్నుముట్టే కరతాళ ధ్వనులతో ప్రశంసించారు. ఆమె వీరాభిమాని అయిన ఒక యువ నిర్మాత, దర్శకుడు అన్నాడట - ' ఆమెతో నాకేవిధమైన కలహమూ లేకున్నా లత వాయిస్‌ని ఎన్నడూ నా చిత్రాల్లో ఉపయోగించను' అని! అన్నాడే కాని అలా ఆచరించలేకపోయాడు. లత చేత పాడించేందుకు ఆమె



75వ జన్మదిన సందర్భంగా ముంబాయిలో లతాను సత్కరిస్తున్న అడ్వానీ. 'జ్యోతికలశ్ ఛల్కే' తనకిష్టమైన లతా గీతమని వెల్లడించారాయన.

## లతా గానలహరి



చిత్రం : ఆనంద్
రచన : గుల్జార్
సంగీతం : సలీల్ చౌధురి
అభినయం : సుమితా సన్యాల్

**నా.... జియా లాగేనా**
**తేరే బినా మేరా కహీ**
**జియా లాగేనా**
**నా... జియా లాగేనా**
**జీనా భూలేసె కహా యాద్ నహీ**
**తుఝ్ కో పాయా హై జహా**
**సాస్ ఫిర్ ఆయే వోహీ ॥జీనా॥**
**జిందగీ... జిందగీ తేరే సివా**
**హాయ్ భాయేనా ॥నా... జియా లాగేనా॥**
**నా... జియాలాగేనా.... ఆ... ఆ... ఆ...**
**నా... జియాలాగేనా**
**పియా తెరీ బావ్‌రీసే రహా హో జాయేనా**
**నా... జియా లాగేనా**
**తుమ్ అగర్ జావో కభీ జావొ కహీ**
**వక్త్ సే కెహనా జరా**
**వొ రెహర్ జాయే వొహీ ॥తుమ్ అగర్॥**
**వో ఘడీ... వో ఘడీ వోహీ రహేనా**
**నా జాయెనా... ॥నా... జియాలాగేనా॥**

ఎల్లాంటి ఆర్టిస్టులకైనా కొన్ని విశ్వాసాలూ, నమ్మకాలూ వుండితీరతాయి. వాటిల్లో, మూఢమైనవి కొన్నీ గాఢమైనవి కొన్నీ. రికార్డింగుల్లో కాని, కచ్చేరీలలో కాని, పాడేటప్పుడు చెప్పులు ధరించకపోవడం లత తప్పక పాటించే నియమం.

అంచులు విశిష్ట వర్ణాలతో విరాజిల్లినా ధవళవస్త్రాలు (తెల్లనివి) ధరించడం ఆమెకు సర్వదా వాంఛనీయం. తెలుపు నైర్మల్యానికి చిహ్నం. అదీగాక తెలుపులో అన్ని రంగులూ ఇమిడి వుంటాయని 'ప్రిజం' ద్వారా ఎప్పుడో నిరూపించబడింది. ఏ శుభకార్యానికైనా, ప్రయాణాలకైనా, రికార్డింగులకైనా, అమావాస్య నాడామె పూనుకోకపోవడం పరిపాటి. వారానికొకసారి మహాలక్ష్మి దేవాలయానికివెళ్లి దేవీ దర్శనం పొందడం అనివార్యం. అలాగే ఉపవాసాలు చెయ్యడం కొన్ని ప్రత్యేక సన్నివేశాలలో ముఖ్యచర్య. పూర్వ జన్మలలోనూ, పూర్వకర్మల ఫలితాలలోనూ లతకి పరిపూర్ణ విశ్వాసం. తన దిగ్విజయాలన్నిటికీ పూర్ణపుణ్యఫలమే ముఖ్యకారణం అని ఆమె అభిప్రాయం.

- పి.బి.యస్.

# లతా - రామచంద్ర

## స్నేహం - వైరం

లతా మంగేష్కర్‌తో ఆత్మీయంగా మెలిగి దూరమయినవారిలో సి.రామచంద్ర ఒకరు. తొలిదశలో ఆయన లతాచే పాడించలేదు. అప్పట్లో నంబర్ వన్ స్థానంలో వున్న నౌషాద్ ప్రధాన గాయని షంషాద్ బేగం కాబట్టి రామచంద్ర కూడా ఆమె చేతనే పాడించేవాడు. లతాచే 'షెహనాయ్' సినిమాలో ఓ కోరస్ పాటలో పాడించాడంతే!

కానీ క్రమంగా లతాలో తన అభిమాన గాయని నూర్జహాన్‌ను కనుగొన్నాడాయన. 'మరాఠీ నూర్జహాన్'గా లతాను అభివర్ణించి అనేక అద్భుతమైన పాటలు పాడించాడు. 'పతంగా' (1949)లో ప్రారంభమైన వారి భాగస్వామ్యం 1957-58 వరకు సాగింది. రామచంద్ర సంగీతదర్శకత్వంలో 63 సినిమాలకై 298 పాటలు పాడింది లతా. వాటిలో 200 పాటలు లతా సోలోలే! కిదార్ శర్మ దర్శకత్వంలో 'ఝుంఝుర్' సినిమా నిర్మిస్తూ రామచంద్ర 'లతాచే నేను పాడించే నా బెస్ట్ మ్యూజిక్ ఇదిగో' అని ప్రకటించాడు. సినిమా ఫ్లాపయినా పాటలుమాత్రం ఈనాటికీ బాగుంటాయి.

లతా-రామచంద్రలు కలిసి 'అనార్కలి' వంటి ఎవర్‌గ్రీన్ మ్యూజికల్స్‌ను సృష్టించారు. 'యే జిందగీ ఉసీకీ హై' పాటతో ఆమె టోటల్ సింగర్ అయింది, నేను టోటల్ కంపోజర్‌ను అయ్యాను' అన్నాడాయన ఒకసారి.

కానీ ఆ పాట విషయంలోనే చాన్నాళ్లకు వారిద్దరి మధ్యా తగవు వచ్చింది. రోషన్ మరణించినప్పుడు ఆయనకు శ్రద్ధాంజలి ఘటిస్తూ లతా ఒక మరాఠీ పత్రికకు వ్యాసం రాసింది. దానిలో 'యే జిందగీ' పాట క్లయిమాక్స్‌లో 'సునాయేగీ యే దాస్తాన్' దగ్గర ఎలా మలుపు తిప్పాలో తెలియక రామచంద్ర తన్నుకులాడుతూంటే రోషన్ వచ్చి సహాయం చేశాడని రాసింది.

ఈ విషయమై విలేఖర్లు రామచంద్రను అడిగారు. "లతా చెబుతోందిగా, నాకేమీ రాదని" అని ముందు నిష్ఠూరంగా మాట్లాడినా తరువాత సమాధానపడి తన వెర్షన్ వినిపించాడు - 'రోషన్ నాకు మంచి మిత్రుడు. ప్రతిభలో నాకు తీసిపోడు కానీ దురదృష్టవశాత్తూ అతనికి కమ్మర్షియల్ హిట్స్ లేవు. ఆ పాట రికార్డింగు సమయంలో అక్కడ వున్నాడు. పాట మలుపులో ఓ ఝట్కా నేను ఒకలా ఇస్తానన్నాను, రోషన్ వేరేలా ఇస్తే బాగుంటుందన్నాడు. ఇద్దరు విద్వాంసుల మధ్య ఆ పాటి అభిప్రాయభేదం సహజం. లతాముందు నేను తక్కువనిపించు కుంటానా? నేను నా పద్ధతిలోనే చేశాను. నా స్థానంలో రోషనున్నా అదే చేసివుండేవాడు.



'స్త్రీ' సినిమా ద్వారా లతా-రామచంద్రలకు సఖ్యం కుదుర్చబోయారు దర్శకనిర్మాత శాంతారాం. 'ఓ నిర్దయేప్రీతమ్'లో అపస్వరం దొర్లినా సవరించలేని పరిస్థితి రామచంద్రది.

అయినా పాట వింటే నేనెక్కడైనా స్టక్ అయిపోయిన ఫీలింగ్ వస్తోందా?

అసలు ఇంకో మాట చెప్పనా? ఆ ట్యూన్‌కు ఆధారం - మా నాన్నగారు తరచుగా పాడుకునే 'శారదా' అనే మరాఠీ డ్రామాలో 'మూర్తిమంత్ భీతీ ఉభీ' అనే పాట! నూర్జహాన్ స్టయిల్లో లతాచే పాడించాలని నేనా పాటను ఎన్నుకున్నాను. ఇక లతా చెప్పిన దాని గురించంటారా? మా మరాఠీవాళ్లం పోట్లాడుకుంటే ఆ వైరం జీవితాంతం కొనసాగిస్తాం. శాంతారాం గారు మమ్మల్నిద్దర్నీ కలపాలని చూశారు. 'స్త్రీ' సినిమాకు నాచేత సంగీతం ఇప్పించారు. ఆమెచేత పాడించారు. నాకు ఆయనంటే మహాగౌరవం. ఆయన 'పర్‌ఛాయియా' సినిమాకై తొలిసారిగా నన్ను సంగీతదర్శకుడిగా ఎంచుకున్నందుకు పారితోషికంగా ఒక్కరూపాయి మాత్రం తీసుకున్నాను. మరాఠీ అయిన లతా కూడా శాంతారాంగారి మాట తీసేయలేదుకదా, పాడింది. కానీ 'ఓ నిర్దయే ప్రీతమ్' పాటలో చిన్న అపస్వరం దొర్లింది. సరిదిద్దుదామంటే గొడవొస్తుందన్న భయం. శాంతారాంగారి ద్వారా చెప్దామంటే ఆయన దగ్గర లేరు."

ఇంతకీ లతా, రామచంద్ర ఎందుకు పోట్లాడుకున్నట్లు? ఇలస్ట్రేటెడ్ వీక్లీద్వారా సంగీతాభిమానులందరికీ పరిచితుడు, సీనియర్ పాత్రికేయుడు రాజూ భరతన్ రామచంద్రను డైరక్టుగా అడిగేశాడు. దానికి రామచంద్ర చాలా సింపుల్‌గా సమాధానం చెప్పాడు - "ఏముంది? ఆమె నన్ను పెళ్లి చేసుకోమంది. నేను కుదరదన్నాను. మీకు తెలుసు కదా, నేను ఫన్ లవింగ్ పెర్సన్ని. నాకు మందు కావాలి, మగువ కావాలి. పైగా నాకప్పటికే పెళ్లయింది. గాయనిగా ఆమె అవసరం నాకుంది. కానీ భార్యగా కాదు. అదే చెప్పాను. విడిపోయాం, స్నేహం మిగల్లేదు."

జరిగినదేమిటో మనకు తెలియకపోయినా శ్రోతలుగా మన పంటపడింది, లతా-రామచంద్ర కాంబినేషన్‌లో ఎన్నో మరపురాని మంచి హుషారైన పాటలు మనకు దక్కాయి.

**- కమ్యూనికేటర్ ఫీచర్స్**



లతా, రామచంద్ర కాంబినేషన్‌లో ఓ హుషారు పాట-శామ్ ఢలే ఖిడ్‌కీ తలే (అల్‌బేలా)

# ఓపి నయ్యర్ లతాచే ఎందుకు పాడించలేదు?



లతాచే పాడించని హిందీ సంగీతదర్శకుడు లేడన్న కాలంలో ఓపి నయ్యర్ తన ప్రత్యేకత నిలుపుకుంటూ లతాచే పాడించలేదన్న విషయం అందరికీ తెలిసినదే! దానికి కారణం ఏమిటన్నదానిపై చాలా ఊహాగానకచేరీలు జరుగుతూనే ఉంటాయి. లతా జీవితచరిత్రను గ్రంథస్తం చేసిన రాజా భరతన్ వెర్షన్ ప్రకారం -

'ఆస్మాన్' సినిమాతో రంగప్రవేశం చేసిన నయ్యర్‌కు రెండేళ్ల తర్వాత 'ఆర్ పార్' సినిమా హిట్ కావడంతో విపరీతంగా ఆఫర్లు వచ్చిపడ్డాయి. కొంతమంది నిర్మాతలు తాము బుక్ చేసిన ఇతర సంగీతదర్శకులను తొలగించి నయ్యర్‌ను బుక్ చేయసాగారు. 'మెహబూబా' అనే సినిమా తీస్తున్న కె.అమర్‌నాథ్ అనే నిర్మాత రోషన్‌ను తప్పించి నయ్యర్‌ను బుక్ చేశాడు. అలాగే 'మంగూ' మ్యూజిక్‌డైరక్టరు మహమ్మద్ షఫీ కూడా తీసివేయబడ్డాడు.

ఆ సమయంలో తను, తన సంసారం తిండికి లేక మాడుతున్నానని, అందువల్ల ఈ ఆఫర్లు ఒప్పుకున్నానని నయ్యర్ వాదన. కానీ రోషన్ అంటే అమిత గౌరవాభిమానాలున్న లతా మాత్రం సహించలేకపోయింది. తాను రోషన్ దర్శకత్వంలో ఆ సినిమాకై అప్పటికే పాట పాడింది కాబట్టి నయ్యర్‌కు ఛస్తే పాడనని స్టేటుమెంటు ఇచ్చేసింది. అనలే స్వాభిమానపరుడైన నయ్యర్ మండిపడ్డాడు. "అసలు నేను లతా చేత పాడిద్దామని అనుకుంటే కదా, ఆవిడ అవుననడానికి, కాదనడానికి.." అన్నాడు.

అహం దెబ్బతిన్న లతా సినీ మ్యూజిక్ డైరక్టర్స్ అసోసియేషన్‌కు ఫిర్యాదు చేసింది. అధ్యక్షుడు అనిల్ బిశ్వాస్, తదితర సభ్యులు నయ్యర్‌కు ఎవరూ పాడరాదని ఆదేశించారు. దాంతో నయ్యర్ షంషాద్ బేగమ్‌ను ఆశ్రయించాడు. 'నీకేం ఫర్వాలేదు, ఎన్ని పాటలు కావాలంటే అన్ని పాటలు పాడతాను." అని హామీ ఇచ్చింది షంషాద్. పాడింది, నయ్యర్ పరువు కాపాడింది. ఇక లతాచే జన్మలో పాడించకూడదని నిశ్చయించుకున్నాడు నయ్యర్. అలాగే నెగ్గుకొచ్చాడు.



'సున్‌సున్ జాలిమా'కు గురుదత్, శ్యామా అభినయం. 'ఆర్‌పార్'తో ఓపి నయ్యర్‌కు ఒక్కసారిగా స్టార్ స్టేటస్ వచ్చిపడింది. ముందు బుక్ చేసుకున్న కంపోజర్స్‌ను కాదనుకుని నిర్మాతలు అతనికై ఎగబడడం గొడవలకు దారి తీసింది.

'మీకు డైరక్టుగా అవమానం జరక్కపోయినా వేరేవారి తరపున ఇంత హడావుడి చేసి ఒక అప్పుడప్పుడే పైకి వస్తున్న కంపోజర్‌పై కత్తి కట్టడం తగునా?" అని రాజా భరతన్ లతాను అడిగాడు. దానికి ఆమె సమాధానం - "1949లో నేను ఇంకా నిలదొక్కుకోలేదు. 'గర్ల్స్ స్కూల్' సినిమాకై అనిల్ బిశ్వాస్‌ను తీసేసి సి.రామచంద్రను పెట్టారు. నేను రామచంద్రకు పాడనని చెప్పాను. ఆయన షంషాద్ చేత పాడించుకున్నాడు. నేనెప్పుడూ ఒకే ప్రిన్సిపుల్ పై నిలబడ్డాను." అంది లతా.

నయ్యర్ ఆత్మాభిమానం ఎటువంటిదంటే మధ్యప్రదేశ్ ప్రభుత్వం వారు లతా పేర నెలకొల్పిన అవార్డు అతనికి ఇస్తానన్నప్పుడు ఆయన పుచ్చుకోననేశాడు. అవార్డుతో బాటు లక్షరూపాయల రొక్కం ఇస్తానన్నా కరగలేదు. తనను అడగడానికి వచ్చిన ప్రతినిధితో చెప్పాడు 'కావాలంటే మీ అవార్డుని గీతాదత్ అవార్డు అనండి. నిక్షేపంగా వచ్చి తీసుకుంటాను. కానీ ఓపి నయ్యరేమిటి, లతా పేర అవార్డు తీసుకోవడమేమిటి? నథింగ్ డూయింగ్!"

**- ఎమ్బీయస్ ప్రసాద్**

కాల్‌షీట్ కోసం వేచి వుండడమే కాక రాయల్టీ విషయంలో కూడా రాజీపడ్డాడట "లత పాటల్లో హిట్లయ్యేటన్ని పాటలు, ఇతరులు పాడితే, అవలేవు. అందుచేతనే నాలాంటి నిర్మాతలు కూడా, ఎగబడతాం ఆమె చేతనే పాడించేందుకు అని సంజాయిషీ ఇచ్చుకున్నాడట పరోక్షంగా ఆమె అదృష్టాన్నీ, ప్రతిభనీ, గొప్పతనాన్ని ఒప్పుకుని.

ఒక విచిత్రమేమిటంటే 'లత'ని సంగీత లోకానికి పరిచయం చేసి నేపథ్య గాయనిగా నిలబెట్టిన గ్రేట్‌హిట్ హాంటింగ్ సాంగ్ అయిన 'ఆఏగా ఆనేవాలా' అనే పాటకి పారితోషికం ఇంతవరకూ అందకపోవడం. అయితే, ఇలాంటి సంభవం చిత్రసీమలో ఆనాడూ సర్వసామాన్యం. సినీ మ్యూజీషియన్సు యూనియన్లు స్థిరపడిన పిదపనే పరిస్థితులు మార్పుజెందాయి. పారితోషికాల విషయంలోనూ, రాయల్టీల విషయంలోనూ, చిత్రాలలో నేపథ్య గాయనీగా గాయకులకి టైటిల్సులో తప్పకుండా క్రెడిట్ ఇప్పించే విషయంలోనూ లత చూపించిన పట్టుదల వలనా, ఓర్పు వలనా, సహ గాయనీ గాయకులు కూడా ప్రాముఖ్యం పొందగలిగారు. మొదట్లో 'ఆయేగా ఆనేవాలా' పాట రికార్డు పైన పాడిన వారి పేరు 'కామిని' అనే వేశారుట. 'కామిని' అనేది మహల్ చిత్రంలో 'మధుబాల' ధరించిన పాత్ర పేరు. లతాతో బాటు ఆమె అభిమానులూ చేరి సాగించిన పోరాటం తరువాతనే రేడియోలో లతా పేరు ప్రసారించబడినదట. 'ప్లేబాక్ సింగర్ల పేర్లు, గంభీరంగా ప్రకటించబడడం, 'బర్సాత్'-చిత్రంతోనే ప్రారంభమైనదట. రమారమి తన ఇరవైయో ఏట పాడిన "ఆఏగా ఆనేవాలా", "బర్‌సాత్‌మేఁ" వంటి పాటలు ఆమె తన అరవయ్యో పడిలోను డెబ్భైయో పడిలోనూ, ఇంకా అదే విధాన ఒళ్లు పులకరించేలా సంగీత కార్యక్రమాలతో యథాతథంగా పాడుతూ వుండడం, ఈనాటికీ శ్రోతలందరూ, తన్మయులై ఆలకించడం, పదే పదే పాడమని అడగడం అందరికీ ఆనందాశ్చర్యప్రదమైన ప్రధానాంశం. లతా పాడిన చిత్ర గీతాలకే కాక చిత్రేతర (ప్రైవేటు) గీతాలకి కూడా లభించిన పాప్యులారిటీ విశ్లేషణ వివరణ యోగ్యం. లత కంఠస్వరం. సంగీత లోకానికే భాగ్యం. ఆమె ప్రైవేటుగా పాడిన "శ్రద్ధాంజలి", "మీరాభజన్లు", "గాలిబ్‌గజల్లు", "భగవద్గీతా శ్లోకాలూ", "నజ్‌దా" (జగ్‌జీత్‌సింగుతో సింగిన గజల్లు) మున్నగు ప్రయోగాలన్నీ అపూర్వ విజయాన్ని సాధించిన రికార్డులే. అంతటికీ 'పునాది' లతా దివ్యకంఠస్వర మాధుర్యం, ఆమె శాస్త్రీయ సంగీత పర్యాప్త పరిజ్ఞానం, భావప్రాశస్త్యం, కలిసిన విశిష్టగానవిధానం, "శ్రద్ధాంజలి" ధ్వని ముద్రికలో, లత తన అభిమానిత దివంగత గాయకులలో కొందరి గీతాలు కూడా ఎన్నిక చేసి పాడి, న్యాయం చేకూర్చడం ఎంతైనా అభినందనీయం. వందనీయం!!

**(ఇంకా వుంది)**



# అంతేరా... బామ్మర్ది



ఆదివిష్ణు



## జరిగిన కథ



భాగ్యనగరంలోని ప్రముఖ పారిశ్రామికవేత్త బసవరాజు, జానకిల కూతురు ఉమ. కొడుకు మురళి. ఉమ ప్రియుడు వేణుకి నాగపూర్లో ఉద్యోగం వచ్చినా ఉమకోసం హైదరాబాదులోనే ఉద్యోగం కై చూస్తూంటాడు. అతని బావ రంగనాధం తన బాల్యమిత్రుడు బసవరాజును స్వయంగా కలిసి అడుగుతానంటాడు. ఈ లోపుల బసవరాజు పేపర్లో వార్తలు చదివి ఖంగారుపడి బావమరిదికై ఉద్యోగాలకోసం వచ్చే ఫ్రెండ్స్‌ను కలవకూడదని నిశ్చయించుకుంటాడు. అందుకే అతన్ని కలవడానికి వచ్చిన రంగనాధాన్ని చూడ నిరాకరిస్తాడు. కానీ తరువాత బాధపడతాడు. ఆ సంగతి తెలియని రంగనాధం బసవరాజుపై మండిపడుతూంటాడు. బావగారి పేరు చెప్పకుండా ఉద్యోగానికై వేణు డైరక్టుగా వెళతాడు. బసవరాజు అతన్ని చూసి ఇంప్రెస్ అయి ఉద్యోగం ఇస్తాడు. ఆ ఉద్యోగానికి ఒప్పుకున్నందుకు ఉగ్రుడైన రంగనాధం వేణుని ఇంట్లోంచి పొమ్మంటాడు. బసవరాజు అసిస్టెంట్ పాణి చదివి వినిపించిన ఓ వార్త వల్ల బసవరాజు తనను కొడుకు, కోడలు ఆహారంలో విషంపెట్టి చంపేస్తారేమోనని భ్రమిస్తూ వారు తెచ్చిన ఏ పదార్థాన్ని స్వీకరించకుండా అవమానించడంతో వారు ఇల్లు వదిలి వెళ్లిపోతారు. వేణు తీసుకువచ్చిన రష్యన్ పేపర్‌లోని క్రైమ్ వార్తలను చదివి వినిపించమంటాడు బసవరాజు.

-(ఇక చదవండి)

వేణు ఆ వార్తలోని వివరాలు చెప్పడం ప్రారంభించేడు -

'మొన్న మార్చి పదిహేనో తేదీన... ప్రొప్రయిటర్ని కలుసుకునేందుకు పి.ఎ. వచ్చేడు!"

ఇప్పుడు - వేణు చెబుతున్న వార్తని తనవరంగా ఊహిస్తున్నందువల్ల - బసవరాజుకి దృశ్యం కూడా కనిపిస్తోంది!

అదిట్టా నడుస్తోంది!

బసవరాజు గదిలోకి పాణి వచ్చేడు!

వచ్చీరాగానే తన జేబులోంచి ఎర్రటి జేబురుమాలు తీసేడు!

దాంతో ఆ గదంతా సుగంధ పరిమళాల్తో నిండిపోయింది!

బసవరాజు, ఆ వరిమళానికి ముగ్ధుడయ్యేడు!

ఆ సెంటు వివరాలు అడిగేడు!

పి.ఎ. తన జేబులోంచి సెంటు సీసా తీసి - ఒకసారి వానన చూడమని బసవరాజుని కోరేడు!

బసవరాజు ఆత్రంగా సీసా లాక్కుని - బిరడా తీసి - ముక్కు దగ్గిర పెట్టుకున్నాడు!

అంతే!

బసవరాజు ప్రాణాలు గాలిలో కలిసిపోయేయి!




ఆ గదిలో వున్న ముఖ్యమైన డాక్యుమెంట్లుతో పాటు - దొరికినంత డబ్బు కూడా తీసుకుని పారిపోయేడు పాణి!

ఇప్పుడు -

మాస్కో పోలీసులు ఆ పి.ఎ. గురించి గాలిస్తున్నారు!

నికొలోవ్‌లో ప్రచురితమైన వార్త యొక్క సారాంశం పూర్తిగా విని - నిద్రావస్థ నుంచి బయటపడినట్టు అడిగేడు బసవరాజు -

"ఆ పాణిగాడు మాస్కో పోలీసులకు ఇంకా దొరకలేదా?"

"ఆ పి.ఎ. పేరు పాణి కాదు!"

"అది నేను పెట్టుకున్న పేరు! ఇంతకీ ఆ హంతకుడు దొరికేడా! లేదా?"

"ఆ వార్త రేపు వచ్చే పేపర్లో వుంటుంది. చూడాలి!"

"అద్సరే! ప్రపంచంలో పి.ఏ.లంతా ఈ విధంగానే వుంటారా?"

"మన పాణి పి.ఏ. కాదు గదా?"

"ఎందుక్కాదు? అతన్నాకు అల్లాంటివాడే! మిస్టర్ వేణూ!"

"చెప్పండి!"

"పాణిని ఉద్యోగంలోంచి వెంటనే తీసేయ్!"

"ఆ అధికారం నాకు లేదనుకుంటాను!"

"నాకుంది గదా! కాగితం టైపు చేయించి తీసుకురా! సంతకం పెడతా! ఫినిష్!"

"కానీ - ఉద్యోగంలోంచి తీసేస్తున్నందుకు రీజన్ కూడా రాయాలి! అది రూలు!"

"వాడు రష్యావాడి మాదిరి ఎర్ర జేబురుమాళ్లు వాడుతుంటాడు!"

"రీజన్ నెంబర్ వన్!"

"వాడు నాకు అప్పుడప్పుడు సెంటు సీసాలిస్తుంటాడు!"

"పాయింట్ నెంబర్ టూ!"

"వాడ్ని ఉద్యోగంలోంచి తీసేందుకు ఈపాయింట్లు చాలు! త్వరగా టైపు చేయించితీసుకురా! ఈ క్షణం నుంచీ వాడి మొహం నాక్కనిపించ కూడదు!"

"ఒ.కె.!"

అని వేణు లేచి నించున్నాడు!

* * *

ఆ రోడ్డుమీద -

రంగనాధం బఠాణీలు తింటో నడుస్తున్నాడు!

అతనికి కృష్ణమూర్తి ఎదురయ్యేడు!

ఇప్పుడు కృష్ణమూర్తి చాలా ధైర్యంగా ఎంతో ధీమాగా వున్నాడు!

కృష్ణమూర్తిని చూసి రంగనాధం పలకరించేడు -

"ఎక్కడికో వెడుతున్నట్టున్నావ్?"

రంగనాధాన్ని ఎగాదిగా చూసి అన్నాడు కృష్ణమూర్తి -

"బఠాణీలు కొన్కు కుందామని బయలుదేరా!"

ఆ మాట వినగానే - రంగనాధం తన దగ్గిరున్న బఠాణీ పొట్లాన్ని దాచేసుకున్నాడు!

కృష్ణమూర్తి మాటాడుతూనే వున్నాడు -

"మమ్మల్ని చూడగానే పుట్టుకొస్తాయి మురికి డవుట్లు!"

రంగనాధాని క్కోవమెుచ్చింది. కోపంగానే అన్నాడు -

"ఎక్కడికి వెడుతున్నావని అడిగేను! అది మురికి డవుటా?"

"పక్కవీధిలో అన్నదానం చేస్తున్నారని తెలిసి - అడుక్కోడానికి వెడుతున్నా! ఇప్పుడు తృప్తిగా వుందా?"

రంగనాధానికి విపరీతమైన కోపమెుచ్చింది!

బఠానీ పొట్లాన్ని విసిరిగొట్టి అన్నాడు -

"అడుక్కో! బాగా అడుక్కో! ఎవడొద్దన్నాడు?"

"అంతేమరి! మా ఇంటిల్లిపాదీ అదే పని మీద వుంటాం! ఆరేళ్ళుగా అడుక్కుతింటూనే బతుకుతున్నాం! నేను - తూర్పు దిక్కు వెళ్లి అడుక్కుంటా! మా ఆవిడ - ఉత్తరం వేపు వెళ్లి అడుక్కుంటుంది! మా ఇద్దరు పిల్లలూ - పడమర దక్షిణం చూసుకుంటారు! అడుక్కోడమే మా వృత్తి! మీరంటే జమిందారులు కదా?"



రంగనాధం రెచ్చిపోయి అంటున్నాడు -
"యస్! నిజమే! ఒక్క జమిందారులమే కాదు! మగధ - మగధ దేశానికి మహారాజులం! నూటేడు ఏనుగులున్నాయి! పదివేల చిల్లర గుర్రాలున్నాయి! లెక్కకు మించి లొట్టిపిట్టలున్నాయి! ఎటొచ్చీ - సిపాయిలే లేరు! వాళ్ల కోసం వెతుక్కుంటూ రోడ్డెక్కేం!" కృష్ణమూర్తి మరింత రెచ్చిపోయి అంటున్నాడు -
"అంతేమరి! మిమ్మల్ని చూడగానే - ఎంగిలి బీడీలు కాల్చే ఎంగిలి వెధవకూడా - కింగుసైజు సిగరెట్టు లెవెల్లో చిందులు తొక్కుతాడు! గంజి తాగే సన్నాసి - చికెన్ వలావు తింటున్నట్టు ఫోజు పెడతాడు! కాల్లొత్తే నాయాలు పీకట్టుకుని మాటాడుతాడు! అంతేమరి! మా మొహాలు చూస్తే అందరికీ అలుసే! మావి 'మాసు' ఫేసులు! మీవి 'క్లాసు' ఫేసులు! తళతళా మెరిసిపోయే ఫేసులు! పెట్రొమాక్సు దీపాలు మీరు! చందమామలు మీరు! అమ్మో - మీ గురించి కామెంట్ చేసేదమ్ములు మాకెక్కడివి?"




రంగనాధం ఓర్చుకోలేక అరిచేడు -
"క్రిష్ణమూర్తీ!"
"అంత మర్యాదగా ఎందుకూ పిలవడం? కిట్టిగా అంటే ఓయంటాం! ఎంగిలాకులు ఎత్తేయమంటే ఎగరేసుకుపోతాం! ప్రతిరోజూ మేము ఆ పనిమీదే వుంటాం! మీరంటే శ్రీరంగనాధులు! సింగినాదాలు!"
రంగనాధానికి ఓపిక నశించింది!
చేతులు జోడించి కృష్ణమూర్తితో అంటున్నాడు -
"వద్దు నన్నొదిలెయ్!"
"అమ్మో! అంత మాటనకండి! మీ మోచేతి నీళ్లు తాగి జీవిస్తున్న అల్పజీవులం మేము! మీక్కోపాలొస్తే కూరొండుకు తినేందుకు పనికొచ్చే కోడిపెట్టలం మేము! మీరు కన్నెర్ర చేస్తే మాడి మసైపోయే మట్టి పిడతలం మేము -"

అప్పటికే ఆ ఇద్దరి చుట్టూ అనేకమంది చేరిపోయేరు!
రంగనాధం కళ్లల్లో నీళ్లు తిరుగుతున్నాయి!

* * *

బసవరాజు బంగళా!
ఆ బంగళాముందు కారు ఆగింది!
బసవరాజు కారు దిగేడు!
వేణు డ్రైవింగు సీటు నుంచి దిగేడు!
ఇద్దరూ ఇంటోకి వస్తున్నారు. బసవరాజు అంటున్నాడు -
"ఊ! ఇక్కడే అనుకున్నాను! రష్యాలో కూడా పెళ్లాలు చంపే మొగుళ్లున్నారన్న మాట!"
"ఆ వార్త తాలూకు తాత్పర్యం అదే కదండీ! పైగా - ఆ మొగుడికి అరవై ఏళ్లు!"
"ఇంచుమించు నా వయస్సే!"
"గుర్తుంచుకోండి!"
"గుర్తుంది లేవయ్యా! ఈ వయస్సులో పరస్త్రీ వ్యామోహం ఏమిటి నా పిండాకూడు!"
"వ్యామోహం తప్పుకాదండీ! ఆ వ్యామోహంలో పడి కట్టుకున్న భార్యని - పీక పిసికి చంపుతాడా?"
"ఇదింకా టూమచ్! నిర్లక్ష్యం చేసేడంటె ఏమోలే అనుకుంటాం! పీక పిసికి చంపడమేమిటి దారుణంగా! ఈ పాయింట్లో - రష్యా కంటే మన ఇండియా బెటరు! ఫరెక్జాంపుల్ - నన్నే తీసుకో!"
"అమ్మో! మీరు ఉత్తములండీ! పెళ్లాన్ని చంపే కిరాతకుల లిస్టులో మీరెందుకుంటారు? వుండరు!"
ఆ మాటకి ముచ్చటపడి అంటున్నాడు బసవరాజు -
"నీకు చెప్పకూడదు గానీ మిస్టర్ వేణూ! నా వైఫ్ కూడా నాకు తగ్గట్టే-"
"ఉత్తమ ఇల్లాలండి! ఆవిడ దేవత! మీరు దేవుడు!"
"అవునా? అంచేత - ఇన్నేళ్ల మా సంసార జీవితంలో ఏ ఒక్కనాడూ ఆమె నన్ను అపార్థం చేసుకోలేదు! ఏ ఒక్కనాడూ ఆమెను నేను పల్లెత్తు మాట అననూలేదు! పాలూ నీళ్ల మాదిరి కలిసిపోయేం!"




అప్పటికి వాళ్లిద్దరూ హాల్లోకి వచ్చేసేరు!
అది గుర్తు చేయడం తనడ్యూటీగా భావించి అన్నాడు వేణు,
"హాల్లోకి వచ్చేసేం! ఇక రష్యన్ పేపరు వార్త మరిచిపోడం మంచిది!"
"అల్లాగే కానియ్!"
వేణు హాల్లోనే ఆగిపోయేడు!
బసవరాజు - జానకీ అని పిలుచుకుంటో ఆమె గదిలోకి నడుస్తున్నాడు!
తన గదిలోకి భర్త రాగానే - అతన్ని చూచి భయంతో వణికిపోతూ కెవ్వున అరిచింది జానకి!
ఆ వింత చేష్టకి ఖంగుతిన్నాడు బసవరాజు!
ఏం జరిగిందో ఊహించలేక అడిగేడు -
"ఏమైంది జానకీ? ఎందుకా పొలికేక?"
అని ఆమె వేపు నడుస్తుంటే - ఆమె గాభరాపడుతూ

అంటోంది -

"వద్దు! నా దగ్గిరికి రావద్దు! వెళ్లిపోండి!"

"ఎందుకంత భయం? నేను జానకీ! నీ భర్తని!"

"అందుకేనండీ! అందుకే భయపడుతున్నాను! మీరు నా భర్త గనకనే భయపడుతున్నాను! మీకు చేతులెత్తి నమస్కరిస్తాను! నన్ను చంపకండి!"

అమాట వినికి బసవరాజు బాగా షాకు తిన్నాడు!

ఆశ్చర్యంగా అడుగుతున్నాడు -

"నిన్ను - నేను - చంపడమా? ఎందుకు జానకీ - ఎందుకు - నిన్నెందుకు చంపుకుంటాను?"

"అడక్కండి! నన్నేమీ అడక్కండి! దయచేసి వెళ్లిపోండి! మీకు నచ్చిన మనిషితోనే కాపరం చేయండి! ఆమె కోసం నన్ను చంపకండి!"

అని గోడవారగా కూచుని - మొహాన్ని చేతుల్లో దాచుకుని - కుల్లికుల్లి ఏడుస్తోంది!

బసవరాజు నిశ్చేష్టుడయ్యేడు!

క్షణం గడిచింతర్వాత అతను అయోమయంగా హాల్లోకి వచ్చేడు!




హాల్లో వేణు కనిపించేడు!

అతన్ని చూడగానే తెప్పరిల్లి అన్నాడు -

"మిస్టర్ వేణూ!"

"విన్నాను సార్! అంతా విన్నాను!"

"నేను ఆమెను చంపుతానని ఎందుకు అనుకుంటోంది?"

"పేపరు వార్త సార్! రష్యన్ వార్త! ఆ వార్త యొక్క రియాక్షనిది! మనసు పాడుచేసుకున్నారు!"

"రష్యన్ వార్తా? అంటే - నికోలోవ్ డెయిలీ జానకి కూడా చదివిందా? ఆమెకు రష్యన్ భాష రాదు గదా?"

"మేడం చదవలేదు సార్! నాచేత చదివించుకుని - అర్థం తెలుసుకున్నారు! మనసు పాడుచేసుకున్నారు!"

"అంటే - అరవై ఏళ్ల వృద్ధుడు -"

"అక్రమ సంబంధం-"

"భార్య పీక పిసికి చంపడం - ఆ వార్తేనా?"

"అవునుసార్! ఆ వార్తే!"

"అయితే మాత్రం? ఎక్కడో రష్యాలో - ఎవడో కోన్‌కిస్కా గొట్టాంగాడు - భార్య ప్రాణాలు తీస్తే - ఇక్కడ ఇండియాలో నేను కూడా ఆ దౌర్భాగ్యుడిలాగానే అఘోరిస్తానని జానకి ఎందుకు అనుకోవాలి? ఎందుకు వణికిపోవాలి? ఇన్నేళ్ల మా దాంపత్య జీవితంలో జానకి నన్ను అర్థం చేసుకున్నది ఇదేనా?"

బసవరాజుని బండబూతులు తిట్టే ఉద్దేశాన్ని కడుపులో దాచుకుని - ప్రశాంతంగా అన్నాడు వేణు -

"ఏం చెబ్తాం? కొందరంతే! అదొకరకమైన వీక్నెస్సు మానసిక బలహీనత! చాలా దరిద్రమైన - అతి నీచమైన - పరమ పాపిష్టి మెంటాలిటీ!"

బసవరాజు ఎంతో దిగులుగా అన్నాడు -

"అంతేనంటావా?"

"అనవలసింది ఇంకా చాలా వుంది!"

"వున్నాసరే! ఇంకేమీ అనకు! ఆ!"

అని తన గదిలోకి వెళ్లబోతుండగా - ఏదో నవల చదువుకుంటో ఎదురైన ఉమ - తండ్రిని చూచి - కెవ్వున అరిచి - నవల పారేసి - తన గదిలోకి పారిపోయి - తలుపులు మూసుకుంది!

**(ఇంకావుంది)**

# అమెరికాలో సంచలనం సృష్టించిన బాలి కార్టూను







ఫ్రెంచి కార్టూనిస్ట్ డేమియన్ వేసిన కార్టూన్‌కి మన జయదేవ్ తర్జుమా ఇది

రెండు నెలల క్రితం విట్టీ వరల్డ్ ఎడిటరు జోసాబో నాకో కార్టూను స్ట్రిప్పు ఇ-మెయిల్ చేశాడు. స్ట్రిప్పు పేరు "డివైన్ కామెడీ". దాన్ని సృష్టించిన కార్టూనిస్టు డేమియన్. ఫ్రెంచ్ కార్టూనిస్టు. ఈ స్ట్రిప్ యూరప్ పత్రికలన్నిటిలో ప్రచురించబడి బహుజనాదరణ సంపాదించింది. అమెరికాలో ప్రస్తుతం ఇది పెద్ద హిట్. ఈ కార్టూన్ స్ట్రిప్పును భారతదేశంలో సిండికేట్ చేసే అవకాశాలున్నాయా అని జోసాబో నాకు ఉత్తరం రాశాడు.

స్ట్రిప్పు సబ్జెక్టు "సెయింట్‌పీటర్ - దేవుడు" పాత్రలకు సంబంధించింది. క్రైస్తవుల నమ్మక ప్రకారం సెయింట్‌పీటర్ స్వర్గద్వార పాలకుడు. భూలోక వాసానంతరం జీవుడు సెయింట్ పీటర్‌ని చేరుకుంటాడు. జీవుడి పుణ్యపాపాల పరిమాణాలని అంచనా వేసి, అతడు స్వర్గవాసాని కర్హుడైతే, పీటర్ తన మెడలోని తాళం చెవితో స్వర్గద్వారాన్ని తెరిచి భగవంతుడి సన్నిధానానికి పంపిస్తాడు.

పీటర్, భగవంతుడు వీళ్లిద్దరి మధ్య జోకులను సృష్టించాడు, కార్టూనిస్టు డేమియన్. ఒక స్ట్రిప్‌లో భగవంతుడు పికాసోని పట్టుకుంటాడు. "ఏమయ్యా - నేను మానవుడ్ని నా ఆకారంతో అందంగా సృష్టిస్తే, ఆ ఆకారాన్ని నీ కుంచెతో అందవిహీనం చేస్తావా? ఆఁ?" అని భగవంతుడు పికాసోని మందలిస్తాడు!

ఇలాంటి సబ్జెక్టులతో ''డివైన్ కామెడీ'' హాస్యభరితంగా సాగుతుంది. ఐతే మనదేశంలో ఈ స్ట్రిప్స్ అమ్ముడుపోవు కదా - వీటిని మనదేశపు "చర్చ్" నిషేధించే ప్రమాదం కూడా వుంది. ఈ సంగతి జోసాబోకి విపులీకరించి జవాబు రాశాను. మా కార్టూనిస్టులు ఇప్పటికే వేల సంఖ్యలో, చిత్రగుప్తుడు - యమధర్మరాజుల మీద కార్టూనులు గీసి పారేశారు. కార్టూనులే కాదు, నాటకాలాడారు. సినిమాలు కూడా తీశారు. సబ్జెక్టు పరంగా ఈ స్ట్రిప్ మా దేశంలో పైసాకి కూడా అమ్ముడుపోదు."అని.

నా జవాబుతో బాటు 'బాలి' గారి కార్టూను ఒకటి జతపరిచి పంపించాను. యమధర్మరాజు హడావుడిగా ఎక్కడికో పయనమై పోతుండగా చిత్రగుప్తుడు తన చేతిలో ఒక "నేమ్‌లిస్టు"తో అడ్డుపడతాడు. యమధర్మరాజు, "ఆ లిస్టును నాకు ఇ-మెయిల్ చెయ్ చిత్రగుప్తా" అంటాడు!!

ఈ కార్టూను జోసాబో కార్టూన్ ఫోరమ్‌లో పెట్టాడు. అమెరికాలో మన తెలుగువాళ్ళు చూసి ఆనందించారు. అమెరికాలోనే కాదు, ఇంగ్లాండు, జర్మనీ, ఆస్ట్రేలియాలో వాళ్ళు కూడా చూసి సరదాగా నవ్వుకున్నారు. "డివైన్ కామెడీ"ని "మోడ్రన్ కామెడిగా" చూపించిన బాలిని అభినందించారు!

ఐతే ఫ్రాన్సులోని (పారిస్) నందకుమార్ అనే సాఫ్ట్‌వేర్ ఇంజనీర్ బాలి కార్టూనులో ఒక తప్పు దొర్లిందని ఉత్తరం రాశాడు. జోసాబో ఆ ఉత్తరాన్ని నాకు ఫర్వార్డ్ చేశాడు.

బాలిగారు నిజంగానే తప్పు చేశారు. కార్టూనులో యమధర్మరాజు దున్నపోతు మీద గాక వృషభ వాహనం మీద కనిపిస్తాడు. "ఇది విడ్డూరం కాదా?" అని నందకుమార్ పారిస్ నగరం నుంచి తనో ఒక ఇ-మెయిల్ పంపించాడు.

నేను వెంటనే "బాలిగారు కావాలనే యమధర్మరాజుని వృషభవాహనమెక్కించారు, ఆ కార్టూను అసలు కాప్షను ఇది:

చిత్రగుప్తుడు : ప్రభో! వాహనం... వాహనం??

యమధర్మరాజు : గరిగా అరవకయ్యా! నా దున్నపోతుని నీళ్ళు తాగడానికి పంపించాను. ఇది స్వామివారి నంది! నీ అరుపులు, కూతలు ఆయన చెవిన పడితే మనిద్దరి ఉద్యోగా లూడతాయి జాగర్త!!

ఈ జోకు ఒక్కటి చాలు, "డివైన్ కామెడీ" వెయ్యి స్ట్రిప్పులవతలికి నెట్టి పారేస్తుంద'ని రాశాను.

ఒక కార్టూనులో, ఒక తెలుగు కార్టూనిస్టు ఎంత అద్భుతమైన భావాన్ని ఎంత గొప్పగా చెప్పగలడో - ఇంతకన్నా నిదర్శనం మరొకటి వుందంటారా?

ప్రముఖ కార్టూనిస్టు బాలి సామాన్యుడా? ఎంతమంది "డేమియన్లు" ఆయన ముందు నిలబడగలరు? ఆఁ??

**- జయదేవ్**

# సరిగపదమని

**5**

కూర్పు : ఎం. శ్రేష్ట

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | ● | 2 | | | | 3 | ● | 4 |
| 5 | | | ● | ● | ● | | ● | |
| | ● | 6 | 7 | | ● | ● | 8 | |
| ● | 9 | ● | | ● | 10 | | | ● |
| ● | 11 | | ● | 12 | | ● | ● | 13 |
| 14 | | ● | 15 | | ● | 16 | | |
| | ● | 17 | ● | 18 | | | ● | ● |
| | ● | 19 | | | ● | 20 | 21 | 22 |
| ● | 23 | | ● | ● | ● | ● | 24 | |

**ఆధారాలు:**

**అడ్డం:**

2. ఓ సినీకవికి ఇంటిపేరుగా మారిన సినిమా పేరు (5)
5. 'నీ పాపం పండెను నేడు నీ భరతం ........ చూడు' (3)
6. 'స్నేహితుడా స్నేహితుడా ........... స్నేహితుడా' (3)
8. '....లు పూచే ......లు కాచే ఓ లచ్చ గుమ్మాడి' (2)
10. 'హృదయమనే......... తలుపులు తెరిచే తాళం' 2 అడ్డంలోని సినీకవి 'పెళ్లిసందడి' లో రాసిన పాట (3)
11. '...... ...... గా ఆమని సాగె' (2)
12. 'ఇది తైలం పట్టి తాళం కొట్టీ' అంటూ వెంకటేష్ అభినయించిన చిత్రం (2)
14. రమణ గోగుల సంగీతాన్నిచ్చిన ఓ పవన్ కళ్యాణ్ చిత్రం (2)
15. హరిహరన్, శంకర్ మహదేవన్ కలిసి ఒకే గీతాన్ని ఆలపించిన చిత్రం (2)
16. '....... కలిసిన శుభవేళా' (3)
18. '.......... నవ్వులా పింగాణి బొమ్మలా' ఇడియట్ లో పాట(3)
19. మహిళా సంగీత దర్శకురాలు (3)
20 'నారీ నారీ నడుమ ........' (3)
23. తెలుగు సినీ గీతానికి జాతీయ అవార్డును తెచ్చిపెట్టిన కవి (2)
24. 'తప్పకా ఇత్తురా తాతయ్య ..........' భానుమతి పాడిన 'ఉయ్యాల జంపాల లూగరావయా' పాటలో ఆశపడ్డ ధనం (2)

**నిలువు:**

1. 'ఓ చెలీ ....... అంతలో తాపమా' శ్రీకృష్ణుడు తులాభారంలో పాడిన పాట (3)
2. 'జిలిబిలి పలుకులు చిలిపిగ పలికిన ఓమైనా మైనా' పాట గల చిత్రం (3)
3. '...... పాపా..... పాపా లంచ్ కొస్తావా' బాలకృష్ణ పాట (2)
4. '....... కళ్ళు రెండయినాయి రెండు మనసులు ఒకటయినాయి' (3)
7. '.... ... అమ్మాయి పాతరోజులు మారాయి' అన్నాడు ఇద్దరు మిత్రుల్లో ఒకాయన (2)
8. 'వినవే బాల నా ప్రేమ ..... ' అన్నాడు పాతాళభైరవిలో రాజుగారి బామ్మర్ది (2)
9. 'నువ్ విజిలేస్తే ఆంధ్రా సోడా బుడ్డి' పాటతో అదర గొట్టేస్తున్న చిత్రం (3)
10 'నువ్వేకావాలి' చిత్ర సంగీత దర్శకుడు (2)
12. 'సాహసం చెయ్యరా డింభకా అన్నది కదురా పాతాళభైరవి' అనే పాట గల చిత్రం (4)
13. 'నిలువవే ......... కనుల దానా' (2)
14. అమ్మ కడుపు చల్లగా అత్త కడుపు చల్లగా .... రా .... రా పచ్చగా' (3)
17. బాలూ పాడిన తొలిచిత్రం పేరులో ఒకేలా ఉండే ఓ మూడు(తొలి) అక్షరాలు (3)
21. 'ఈ నల్లని ....... లో ఏ కన్నులు దాగెనో' (2)
22. 'నీ పాదం మీద పుట్టు మచ్చనై చెల్లెమ్మా' అనే పాట గల చిత్రంలో సంబోధన మినహాయిస్తే.... (2)

పంపినవారి పేరు : ____________________

వయసు : ________ వృత్తి : ____________________

చిరునామా : ____________________

____________________

____________________

____________________ ఫోన్ : ____________________

**పజిల్, కూపన్ 31-10-2003 లోగా చేరాలి**

**పంపవలసిన అడ్రసు**

'హాసం- హాస్య సంగీత పత్రిక'
502, శ్రీ బాలాజీ నిలయం, 13-1-212,
మోతీనగర్, హైదరాబాద్-500 018.

**నిబంధనలు:**

ఎ) పోటీలో పాల్గొనగోరేవారు పైన ప్రచురించిన కూపన్‌తో పజిల్‌ను నింపి కవరులో పంపాలి. మరే విధంగా పంపినా ఆ ఎంట్రీ స్వీకరించబడదు.

బి) కవరుపై 'సరిగపదమని' అంటూ నంబర్‌తోసహా పేర్కొనటం మరచిపోకూడదు.

సి) ఏ బహుమతి కైనా ఒకరు కన్నా ఎక్కువగా విజేతలుంటే డ్రా తీయటం జరుగుతుంది.

విజేతల ఎంపిక ప్రతిసారి ఓ సినీ ప్రముఖునిచే...

మొదటి బహుమతి(ఆల్ కరెక్ట్)




36 పాటలు గల డబుల్ ప్యాక్ ఆడియో సి.డి.

రెండవ బహుమతి (ఒక తప్పుతో)



15 పాటలు గల ఆడియో సి.డి.

మూడవ బహుమతి (రెండు తప్పులతో)



36 పాటలు గల డబుల్‌ప్యాక్ ఆడియోక్యాసెట్

కన్సొలేషన్ బహుమతి (మూడు తప్పులతో)



20 పాటలు గల ఆడియో క్యాసెట్

# సరిగపదమని ఫలితాలు 3

## డ్రాలో గెలుపొందిన వారు

| | |
|---|---|
| ఆల్ కరెక్ట్ | : ఎం.నర్సయ్య, పాల్వంచ, ఖమ్మం జిల్లా |
| ఒక తప్పుతో | : యు.విజయశేఖరరెడ్డి, హైదరాబాద్ |
| రెండు తప్పులతో | : సి.రంగనాయకులు, మార్కాపూర్ |
| మూడు తప్పులతో | : ఐ.రమామణి, గుమ్మలక్ష్మీపురం, విజయనగరం జిల్లా |

ఈ పోటీ ఫలితాలను డ్రా తీయడానికి - అడగగానే వెంటనే ఒప్పుకొని ఎంతో ఆనందంతో సహకరించిన గీత రచయిత చంద్రబోస్ గారికి, విజేతలతో పాటు పజిల్ కూపన్లను పంపిన ప్రతి ఒక్కరికీ 'హాసం' కృతజ్ఞతలు.









'హాసం' నిర్వహిస్తున్న 'సరిగపదమని' పజిల్ 'డ్రా'లో శ్రీ చంద్రబోస్ గారు నన్ను విజేతగా ఎంపిక జేయడం చాలా ఆనందం కలుగజేసింది. ముఖ్యంగా ఎడిటర్ రాజాగారు ఫోన్ ద్వారా ఈ విషయం తెలియ జేసినపుడు చాలా 'థ్రిల్ల'య్యాను. 'ఆ పాత (ట)మధురం' శీర్షికన రాజాగారు 'వార్త' పత్రికలో వ్రాసిన పాత చిత్రగీతాల సమీక్షలు నేను 'కట్' చేసి దాచుకున్నాను. ఇక ఇప్పుడు 'హాసం' వచ్చింతర్వాత అలాంటి (కట్ చేసి దాచుకునే) అవకాశం లేకుండాపోయింది. ఎందుకంటే 'హాసం'లో కత్తిరింపులకు తావులేదు. ఏకంగా పుస్తకాన్నే దాచుకోవాల్సి వస్తోంది.

'హాసం' కుటుంబానికి కృతజ్ఞతాభివందనాలు తెలియజేస్తూ, హాసంతో సహవాసం ఆశించే - మీ 'వీరాభిమాని'

**- ఎం. నర్సయ్య, పాల్వంచ, ఖమ్మం.**



మా ఇంటికి ఫోన్ చేసి నేను ఆఫీసులో ఉన్నానని తెలుసుకుని ఆఫీసుకు ఫోన్ చేసి "మీకు ఒక తప్పుతో రెండవ బహుమతి వచ్చిందని" శుభాకాంక్షలు అందించిన 'హాసం' వారికి కృతజ్ఞతలు తెలియజేసుకుంటున్నాను.

'విజయచిత్ర' సినిమా పత్రిక తరువాత అలరిస్తున్న పత్రిక 'హాసం హాస్య సంగీత పత్రిక' ఆపాత మధుర చిత్రాలంటే నేను ఎక్కువ మక్కువ చూపుతాను. అందుకే ప్రారంభ సంచిక నుంచి అన్ని సంచికలు ప్రాణప్రదంగా దాచుకుంటున్నాను. పాటల పుస్తకాలను అందించటం కోసం 'మూగమనసులు' చిత్రంతో శ్రీకారం చుట్టినందుకు మీకు నా ధన్యవాదాలు.

**- యు. విజయశేఖరరెడ్డి, హైదరాబాద్.**



స్వయముగా 'హాసం' ఎడిటర్‌గారు ఫోన్ చేసి 'సరిగపదమని' క్విజ్ పోటీలలో తృతీయ విజేతగా ఎంపిక చేసారని తెలియజేసినందుకు మాకు చాలా ఆనందకరంగా ఉన్నది. నేను సంగీతాభిమానిని. 'హాసం' పత్రిక కొరకు ప్రతి పక్షమూ నిరీక్షిస్తూ ఉంటాను. ప్రస్తుతం 'హాసం'లో పాత సినిమా పాటలు ప్రచురిస్తూ ఉండడం చాలా సంతోషకర పరిణామము. ఈ క్విజ్ పోటీల వలన చాలామంది తమ మెదడుకు 'సిని సంగీతమేత' సమకూర్చుకుంటూ ముందుకు సాగాలని కోరుకుంటున్నాను. ఈ పోటీ డ్రా సినిమా పాటల రచయిత 'చంద్రబోస్' ద్వారా 'డ్రా' తీయించడం వారి హస్తముల ద్వారా మాకు బహుమతి రావడం చాలా సంతోషముగా ఉన్నది. ఇలా 'హాసం' తన దివ్యయాత్రను విజయవంతముగా ముందుకు నడవాలని కోరుకుంటున్నాను.

**- సి.హెచ్.రంగనాయకులు, మార్కాపురం.**



మా అభిమాన 'హాసం' పత్రికలో 'సరిగపదమని' పజిల్‌లో నాకు బహుమతి వచ్చిందని గౌరవనీయులు 'రాజా' గారు ఫోన్ చేసి చెప్పిన వెంటనే ఆనందంతో ఉప్పొంగిపోయాను.

శ్రీ చంద్రబోస్ గారికి - 'హాసం' పత్రిక సంపాదకులు 'రాజా' గార్కి నా హృదయ పూర్వక కృతజ్ఞతలు

**- ఐ. రమామణి, గుమ్మలక్ష్మీపురం, విజయనగరం జిల్లా.**

## జవాబులు

**అడ్డం:** 1. ఏరువాక 3. ఆరాధన 6. దారి 7. ఒక చిన్నమాట 10. శ్రీవారికి ప్రేమలేఖ 13. రఘు 15. కాకమ్మ 16. మనసు 18. పుహళేంది 19. లవకుశ

**నిలువు:** 1. ఏసుదాసు 2. వాన 4. రామన్న 5. ఒకిరికిస్తే 8. మావేలే 9. దేవా 11. మసక 12. ఓరచూపు 14. నీమది 15. కాసుల 17. ఆశ

## కరెక్టు సమాధానాలు వ్రాసిన వారి పేర్లు

బొలిశెట్టి బాలరత్నాంబ - విజయవాడ, ఆర్.నాగరాజు-దేవరకొండ (నల్గొండ) , సోమయాజుల సాయిప్రసాద్-ఒనకడిల్లీ(ఒరిస్సా), వై.విజయలక్ష్మి-తిరుపతి, పుప్పరపు రోహిణి-నర్సపుర్, దేవరం సతీష్‌కుమార్-ద్వారకా నగర్(కరీంనగర్), బి.మోక్షానందం- ఉప్పలపాడు(ప॥గో॥జిల్లా), సి.నళినికుమారి-సికింద్రాబాద్, ఇలపావులూరి శేషశ్రీదేవి- అద్దంకి(ప్రకాశం), జి.పుల్లప్ప-చాగలమర్రి(కర్నూలు), పి.శేఖర్‌బాబు- ధర్మసాగరం (వరంగల్), రెంటాల శ్రీవిద్య- విజయవాడ, ఎ.టి.శ్రీనివాసన్-అనంతపురం, పి.జె.డి.రాజు-అచ్చంపేట్(మహబూబ్‌నగర్), వై.భానుప్రసాద్-కర్నూల్, కృష్ణవేణి.వి- వుయ్యూరు, చుండిసుబ్బారావు-తోణాం(విజయనగరం), వేగి శ్రీనివాసకుమార్-వైజాగ్, వసంతలక్ష్మి-హైదరాబాద్, ఎ.వి.రమణమ్మ- పార్వతీపురం, కీర్తనచంద్రిక-మదనపల్లె (చిత్తూరు), వి.వి.రమణాచార్యులు-శ్రీకాకుళం, వానపల్లి గంగరాజు-విశాఖపట్నం, సోపింటి సుస్మితానంద్-హైదరాబాద్, విరివింటి శ్రీమోక్షితశాస్త్రి-వనపర్తి(మహబూబ్‌నగర్), వావిలాలకృష్ణకుమారి-హైదరాబాద్, బి.వి.రమణమూర్తి-హైదరాబాద్, కె.వసంతకుమార్- దేవరకొండ, మంత్రిలక్ష్మీనారాయణ-సిరిసిల్ల(కరీంనగర్), మాస్టారుఆదిత్య-విశాఖపట్నం, బి.రవికిశోర్-హైదరాబాద్, బలువరివిజయ్-నాగర్(మహబూబ్‌నగర్), యస్.వి. నాగభూషణం-హైదరాబాద్, యస్.ఉమాపార్వతి-హైదరాబాద్, పి.వి.యస్.యస్.విజయ కుమార్-విశాఖపట్నం, వి.యన్.యన్.హరనాథ్-బుడివాలాక్యాంప్(కర్నాటక), బి.యస్,రవితేజ-హైదరాబాద్, కె.వి.రమణమూర్తి-బరంపురం(ఒరిస్సా), ఎల్.లక్ష్మీమూర్తి- సునాబెడా(ఒరిస్సా), ఎ.సాయిధీరజ్-చిలాంకుర్(కడప), అరవిందాదేవి-కాకినాడ, ఎల్.వి.యస్.యస్.శర్మ-హైదరాబాద్, సాయిబాలాజీ.యన్-హైదరాబాద్, సి.వి.యస్.ఆర్.కె. ప్రసాద్-జహీరాబాద్(మెదక్), ఆర్.రాజేశం-మంచిర్యాల(ఆదిలాబాద్), కె.నాగశివజ్యోతి- చీరాల, గంటిబుల్లబ్బాయి- ఎ.వి.అగ్రహారం(తూ॥గో॥జిల్లా), మంచిరాజుసూర్యనారయణ మూర్తి-హైదరాబాద్, బి.ఇ.శ్రీనివాసమూర్తి- పాతూరు(అనంతపురం), పసుమూర్తి జగన్నాధం-విజయనగరం, యంవ్.రామకృష్ణానంద్-నూజివీడు(కృష్ణా),తాతా శ్రీరామమూర్తి-విశాఖపట్నం, మాడుగుల శ్రీనివాస్-విజయవాడ, వేమన సత్యప్రసాదరావు- రాజమండ్రి, జి.బాలాత్రిపురసుందరి-హైదరాబాద్, జి.గాయత్రి- విశాఖపట్నం, జి.భోగేశ్వర రావు-విశాఖపట్నం, స్వాతినారాయణమూర్తి-హైదరాబాద్, అత్మూరిఅన్నపూర్ణ- హైదరాబాద్, బి.కమలవల్లి-హైదరాబాద్, జి.వెంకటేష్ శర్మ-నంద్యాల(కర్నూలు), ఎ.వి.ప్రసన్న మోహన్- నంద్యాల(కర్నూలు), సలాది గంగాధరకుమార్-ద్రాక్షారామం(తూ॥గో॥జిల్లా), ఎమ్.అనూరాధ-హైదరాబాద్, డి.ఎన్.ప్రసన్న-హైదరాబాద్, పి.వి.ఆర్.యస్.కిరణ్‌కుమార్-నరసాపురం(ప॥గో॥జిల్లా), ఇ.ప్రమీలారాణి-ఫంట్‌కేనర్(రంగారెడ్డి), చింతపల్లి.యు.గంధమాంబ-పాలకొల్లు(ప॥గో॥జిల్లా), పి.వి.రాజ్యలక్ష్మి-విశాఖపట్నం, కె.వి.దుర్గామోహన రావు-నల్గొండ, యమ్.మధురిరంగారావు-నల్గొండ, బాలినేనిశ్రీవేంకటేశ్వరవరప్రసాద్- హైదరాబాద్, మున్నంగికుసుమ-ఢిల్లీ, జి.యనదయ్య-వల్లియప్పనగర్(చిత్తూర్), యస్.వేణుగోపాల్-కాకినాడ, టి.ఎల్.సరస్వతి-హైదరాబాద్, బచ్చువిజయ్‌కుమార్- విశాఖపట్నం, ఎస్.వరలక్ష్మి-హైదరాబాద్, ఎం.శ్రీధర్-హైదరాబాద్, ఎస్.సునీతలక్ష్మి- విజయవాడ, ఎమ్.మణిబాబు- హైదరాబాద్, ఎమ్.నరసయ్య- పాల్వంచ(ఖమ్మం), పి.శ్రీనివాస్-తిరుపతి, ఎస్.వి.ఆర్.శ్రీనివాసమూర్తి- హైదరాబాద్, కె.సంయుక్తభారతి- ప్రొద్దుటూరు(కడప), డి.లక్ష్మి-తణుకు(ప॥గో॥జిల్లా), వి.జె.బెన్నెట్- నిడుబ్రోలు (గుంటూరు), ఎమ్.సరోజ-విజయవాడ, కె.లావణ్య-ధర్మవరం(అనంతపురం), బులుసు కమలకుమారి- హైదరాబాద్, వి.శారద-హైదరాబాద్, గోగులమూడిశేషగిరిరావు-సంతమాగులూరు (ప్రకాశం), మద్దిపాటిసూర్య-హైదరాబాద్, వి.ఎస్.ఆర్.ప్రసాద్-చెన్నై, బద్వేటి వేంకటేశ్వరరావు- ఉల్వపాడు (ప్రకాశం), ఎ.పద్మాసని-హైదరాబాద్, పోపూరి మధుచంద్ర- నరసరావుపేట, మల్లిడి విజయభాస్కరరెడ్డి- కుతుకులూరు(తూ॥గో॥జిల్లా), మల్లిడి దుర్గాప్రసాద్-కుతుకులూరు,ద్వారంపూడి నాగిరెడ్డి- పాలమూరు (తూ॥గో॥జిల్లా), వై.వి.కె.రవికుమార్-చిక్కడపల్లి(హైదరాబాద్), జి.జయరాం- చైతన్యపురి (హైదరాబాద్), వి.ప్రమీలాకుమారి-చెన్నై, బందకవి సోమేశ్వరరావు- రామవరం(తూ॥గో॥జిల్లా), మల్లిడి అరుణాదేవి-కుతుకులూరు, సుంకర రమేష్‌బాబు-ఒంగోలు, గుమ్మా కవిత-అక్కయ్యపాలెం(వైజాగ్), జీడిగుంట రాజ్యలక్ష్మి-హైదరాబాద్, ఎస్.పార్వతి-విశాఖపట్నం,డా॥చల్లాభారతి-పాలకొల్లు(ప॥గో॥జిల్లా), ఎమ్.ఆనంద్‌కుమార్-కొత్తపేట (గుంటూరు), ఎం.ఎస్.ఎన్.గౌరి-రాజమండ్రి, సి.వి.రామయ్య-విశాఖపట్నం, జి.వి.రమణ-సంగారెడ్డి (మెదక్), ఎస్.వి.చంద్రశేఖర్-నగరి(చిత్తూరు), సి.ఎస్.దేవి-బాపట్ల, కిశోర్‌కుమార్-గోదావరిఖని(కరీంనగర్), పి.సురేష్‌బాబు-గుంటూరు, కంభం నారాయణరెడ్డి-శంకరాపురం(కడప), శిష్ట్లా సీతామహాలక్ష్మి-హైదరాబాద్, శ్రీమతి చిట్టా కమల-న్యూ నల్లకుంట(హైదరాబాద్), ఎన్.వి.శేషగిరి-విశాఖపట్నం, చింతలపాటి విశ్వనాథ్-విజయవాడ, జె.ఎస్.ఆర్.కె.ప్రసాద్-హైదరాబాద్, ఉషానుజాత-హైదరాబాద్, వి.వీణమాధురి-హైదరాబాద్, సపారె ఈరన్న-ఆదోని(కర్నూలు), సాయిప్రియభావన- హైదరాబాద్, యం.రవీంద్రప్రభు- పత్తికొండ(కర్నూలు), కె.వి.సరస్వతి-హైదరాబాద్, బి.శంకర్-పాతపట్నం(శ్రీకాకుళం), ఎన్.ఎస్.ఎస్.ఎస్.లక్ష్మి- రాజమండ్రి, డా.సి.నాగమణి- నంద్యాల(కర్నూలు), టి.యల్.ప్రసాద్-విశాఖపట్నం, కె.విజయరాఘవన్- వరంగల్, వి.పద్మభాస్కర్-హైదరాబాద్, కె.జయరాజు-చీమలవాగుపల్లి(అనంతపురం), కె.సత్యనారాయణ- కాకినాడ, టి.లక్ష్మీశకుంతల-కాకినాడ, బి.వెంకటమనోహర్‌బాబు- నవులూరు(గుంటూరు), ఎస్.నాగప్రకాశ్- వ్వర్ణ(ప్రకాశం), కె.ఇందిర-నిజామాబాద్, ఎన్.సారంగపాణి-అనంతపురం, కె.వి.రమణారెడ్డి-హైదరాబాద్, సి.హెచ్.కళ్యాణ్‌చక్రవర్తి- బెరహంపూర్(ఒరిస్సా), కె.పాణిశ్రీ-అంబాజీపేట(తూ॥గో॥జిల్లా), నేదునూరి రంగారావు- విశాఖపట్నం, జి.ఎస్.ఎస్.వి.రమణరావు -సికింద్రాబాద్, బి.శ్రీధర్-మందమర్రి(ఆదిలాబాద్), తురుమెళ్ళ నాగలక్ష్మీలత- నెల్లూరు, మండాది లక్ష్మీపద్మ-నరసరావుపేట(గుంటూరు), జోశ్యుల మోహన్- నెర్గిపూడి(ప॥గో॥జిల్లా), గంగారపువెంకట్రావు- సత్తెనపల్లి (గుంటూరు), జి.వెంకటేశ్వరరెడ్డి-హైదరాబాద్, జి.భానుమూర్తి- కోవెన్(నెల్లూరు), సన్నిధిరామలక్ష్మి-ఆకివీడు(ప॥గో॥జిల్లా), కొంపెల్లవెంకటరత్నలక్ష్మి- విశాఖపట్నం, రాచర్లరోహిణి- హైదరాబాద్, కె.వెంకటశాస్త్రి-విశాఖపట్నం, పి.లక్ష్మీరాయలమ్మ-కాఘజ్‌నగర్(ఆదిలాబాద్), బి.ఉదయిని-నెల్లూరు, కృష్ణవేణిసఠకోపన్-హైదరాబాద్, డి.ఎస్.ఆర్.ప్రసాద్- సికింద్రాబాద్, సి.విజయసారధి-శ్రీరామనగర్(కర్నూలు), రావినూతలసులభరావు- హైదరాబాద్, బెల్లంకొండరాంబాబు- పమిడిపాడు(గుంటూరు), పడాలరాము-పాతపట్నం (శ్రీకాకుళం), టి.విజయ-సికింద్రాబాద్, మాదాబత్తుల లక్ష్మి-విజయనగరం, వై.ఇ.వి.నారాయణరావు-శ్రీకాకుళం, బి.వి.ఎల్.సుజాత-హైదరాబాద్, పొట్టముత్యాలు- దేవరకొండ, ఎమ్.ఎస్.బాలకృష్ణ-విజయవాడ, పి.రుక్మిణీదేవి-కర్నూలు, సి.సి.వి.ఆర్.ప్రసాద్- ఒంగోలు, వడ్లమానిపద్మావతిదేవి-విశాఖపట్నం, యం.హరిశ్చంద్రారెడ్డి-రాజమండ్రి, బి.ఆదిలక్ష్మి-నెల్లూరు, గాదె విజయలక్ష్మి-విజయనగరం, సి.అలివేలు-విజయవాడ, ఉన్నవలక్ష్మీనారాయణ-రాజమండ్రి, మహేంద్రాడగాయత్రి- టెక్కలి(శ్రీకాకుళం), కె.ఎల్.ఎన్.మూర్తి-సత్తెనపల్లి(గుంటూరు), బి.పద్మావతి-సలూర్, బి.ఎస్.హేమలత- మదనపల, ఈ.రాధిక-హైదరాబాద్, ఎ.కృష్ణచందు-హైదరాబాద్, పి.విజయలక్ష్మి-నెల్లూరు, వి.శ్రీనివాసరావు-హైదరాబాద్, తాడిమళ్ళవెంకటశేషగిరిరావు-పుట్లచెరువు (కృష్ణా), కె.బి.కైలాస్‌నాథ్-అనంతపురం, గాజులపల్లెచంద్రశేఖరరావు-సికింద్రాబాద్, రేజేటివెంకటేశ్వర్లు-గుంటూరు, యు.యు.యు.-ఎమ్మిగనూరు, ఎస్.సూర్యనారాయణ- హైదరాబాద్, కె.వి.ఎస్.ఎల్. నరసింహము-హైదరాబాద్, హెచ్.వి.రవీంద్రనాథ్-కాజీపేట, పక్కి చక్రవర్తి-గరివిడి(విజయనగరం), బుద్ధకృష్ణ-అనకాపల్లి, భూసురపల్లిప్రహ్లాదుడు-మాచర్ల (గుంటూరు), ధరణికోటశివరాంప్రసాద్-హైదరాబాద్, ఎన్.హనుమంతరావు-చండూర్ (నల్గొండ), తనికెళ్ళరామకృష్ణ-విజయవాడ, కె.వి.ఆర్.సుబ్బారావు-గుంటూరు, తాడిపర్తి వరప్రసాద్-సత్యవేడు(చిత్తూరు), కె.మేఘన-రాజమండ్రి, సోముఉమాపతి-తిరుపతి, జి.రాములు-సాయిపురంకాలనీ(కృష్ణా), టి.వి.ప్రసాద్-నల్గొండ, బి.ఎస్.అశోక్‌కుమార్- రాజమండ్రి, తరిగొప్పలసంధ్య-విజయనగరం, దంటుశ్రీరాజారవిశంకర్-అగ్రహారంవీధి(తూ॥గో॥జిల్లా), ఎ.పద్మావతి-నెల్లూరు, ఎస్.నాగభూషణ్-హైదరాబాద్, ఆర్.ఎ.పద్మావతి- హైదరాబాద్, పి.అనురాగ్-ఏలూరు, డా॥ఉప్పలవెంకటరమణయ్య-కడప, వడ్లమన్నాటిభార్గవి-విజయవాడ, మామిడిమహేంద్ర-పుణే, ఎ.వి.ఆర్.రాజేశ్వరరావు- సికింద్రాబాద్, వనజాక్షిదేవి-పాల్వంచ,విజయలక్ష్మి-ఖమ్మం, పి.రాజిరెడ్డి-మహబూబ్‌నగర్, జి.ఎస్.పద్మజ-హైదరాబాద్, ఎస్.పద్మావతి-ఒంగోలు, తుర్లపాటి భాస్కరరావు-బల్లారి, జి.రఘువీర్-రాజమండ్రి, వి.వివేకానంద-విజయనగరం, బి.శ్రీరామచంద్రుడు-శ్రీశైలం(కర్నూలు), మానూరు సుధాఅనూరాధ-హైదరాబాద్, షబానాబాను-కాకినాడ(తూ॥గో॥జిల్లా), ఎల్.అన్నాప్రగడ రావు-శ్రీకాకుళం, ఎ.వి.రఘురామమూర్తి -హైదరాబాద్, మర్రివసంతలక్ష్మి-కర్నూలు, రాయపోలులక్ష్మీదేవి-ఒంగోలు, ఎ.చంద్రకుమారి-హైదరాబాద్, హరిచరణ్-కందుకూరు(ప్రకాశం), రూపిరెడ్డి రామదాస్-హైదరాబాద్, కె.మైథిలి-మార్కాపూర్(ప్రకాశం), మద్దుక్యాగరాజు-నరసన్నపేట(శ్రీకాకుళం), బి.విరజ-ప్రొద్దుటూరు, ఎస్.సుధాకర్-చెందుకాలని(గుంటూరు), ఎమ్.గీతారాణి- హైదరాబాద్, కె.విజయలక్ష్మి-పత్తికొండ (కర్నూలు), కె.రామచంద్రారెడ్డి-గొల్లలమామిడాడ (తూ॥గో॥జిల్లా), టి.కె.అన్నపూర్ణ-అత్తిలి(ప॥గో॥జిల్లా), వై.కీర్తిసాగర్-ఏలూరు(ప॥గో॥జిల్లా), ఏ.రమాకాంరెడ్డి-గుండరం(కరీంనగర్), ఎమ్.శ్యాంప్రసాద్-నెల్లూరు, వి.విజయలక్ష్మి- హైదరాబాద్, యస్.అరుణ్‌కిషోర్-విజయవాడ, సి.వి.ఆర్.మాణిక్యేశ్వరి-ఏలూరు, యమ్.దుర్గాప్రసాద్-హైదరాబాద్, పి.మయూఖ-అమలాపురం(తూ॥గో॥జిల్లా), ఇందిర సపారె-కళ్యాణ్(వె), బి.వి.ఎస్.ఎస్.కృష్ణకుమార్- విశాఖపట్నం, ఎం.మస్తాన్‌రెడ్డి- విశాఖపట్నం, మద్దాలిమురళీకృష్ణ-నిజమాబాద్, ఎమ్.శ్రీధర్-శిడ్లఘట్ట(కర్నాటక), మల్లిడి దినేష్‌రెడ్డి-కుతుకులూరు, వి.వి.సుబ్బారావు- హైదరాబాద్, పి.వి.పవన్‌కుమార్-హైదరాబాద్, బాసరాజు.యాదగిరి-రామన్నపేట(నల్గొండ), వి. నాగస్వర్ణ-వుయ్యూరు (కృష్ణా), పి.కమలామనోహరరావు-వెలిదేవి, టి.కె.ఉషశ్రీ- సికింద్రాబాద్, దుసి జయశ్రీ-హైదరాబాద్, జి.ఎస్.ప్రదీప్‌కుమార్&వాణి-ఉండి (ప॥గో॥జిల్లా), కె.శరవణన్-గుంటూరు, మిర్యాలశ్రీనివాసరావు-తణుకు, సి.హెచ్.అరుణకుమార్- సోమలింగపాలెం(విశాఖపట్నం), దేవులపల్లిదుర్గాప్రసాద్- సికింద్రాబాద్, యన్.రామకృష్ణ-విశాఖపట్నం, అనుపమ తాతా-పర్లాకిమిడి, (ఒరిస్సా), కొడాలి లలితశ్రీ-విజయనగరం, బి.నగజాత-హైదరాబాద్, బాలనాగు జయలక్ష్మీదేవి- భీమడోలు (ప॥గో॥జిల్లా), దాన్యం వెంకటవంశీకృష్ణ-జంగారెడ్డిగూడెం(ప॥గో॥జిల్లా), దాసరిసత్యనారాయణ-ఉప్పాడ(తూ॥గో॥జిల్లా), రామసహాయం రఘువీరరెడ్డి-బికుమళ్ళ (నల్గొండ), సామవేదుల వాణీస్వయంప్రభ-విశాఖపట్నం, ఎస్.కె.ఖాజావలి-మున్నలూరు (కృష్ణా), బి.స్వరూపరాణి-దౌలతాపురం(కడప), బి.క్రిష్ణమూర్తి-అనంతపురం, ఎస్.వసంతలక్ష్మి-కర్నూలు, ఎస్.సత్యసౌమ్య-కాకినాడ, ఎమ్.రామమోహనాచార్యులు- చాట్రాయి(కృష్ణా), వజ్రాల దుర్గాప్రసాద్-హైదరాబాద్, డా॥సయ్యద్‌రహమతుల్లా-పర్లాకిమిడి, వి.కామేశ్వరి-గుంటూరు, తెలికచెర్లరామకృష్ణ-విజయనగరం,, ఎస్.ఎస్.జ్యోతిర్మయి- విజయనగరం, సి.హెచ్.వి.రమణమూర్తి-హైదరాబాద్, వి.లలితా-హైదరాబాద్, పి.జగన్నాధదాసు-బెరహంపూర్(ఒరిస్సా), ఎ.పి.చందన్‌రావు-నిజామాబాద్, ఎస్.సుబ్రమణ్యం- హైదరాబాద్, పోగులనాగరాజేశ్వరరావు-కొత్తపల్లి(కరీంనగర్), నందిపాటివెంకటేశ్వరరావు-లేమల్లెపాడు(గుంటూరు), కె.వి.ఎస్.రాధిక-ములపర్రు (ప॥గో॥జిల్లా), మట్టిపల్లి పూర్ణచంద్రరావు-హైదరాబాద్, కె.రమాదేవి-హైదరాబాద్, ఎన్.నాగలక్ష్మి-విశాఖపట్నం, ఆర్.మణిప్రసాద్-జడ్చర్ల(మహబూబ్‌నగర్), శివసత్యనారాయణ-హైదరాబాద్, సి.పద్మజ-హైదరాబాద్, బి.వి.ఎ.ఎల్.ఎస్.వైష్ణవి-పామర్రు (తూ॥గో॥జిల్లా), రాంమోహన్ కస్తూరి-సికింద్రాబాద్, డా॥ఎమ్.విజయకుమార్- హైదరాబాద్, కె.హరిరాం-హైదరాబాద్, కడగాన.రాము-విజయవాడ, శ్రీపదవసుంధర-హైదరాబాద్, పి.వేణుగోపాల్‌రావు-అచ్చంపేట(మహబూబ్‌నగర్), కె.శ్రీవాణి-హైదరాబాద్, ఇగూరుశైలజ-మహబూబ్‌నగర్, కె.మాలతిఉషాకుమారి-హైదరాబాద్, కె.జానకిరామ్- నంద్యాల(కర్నూలు), ఎమ్.రామలక్ష్మి-విజయవాడ, టి.కె.వేణుగోపాల్-హైదరాబాద్, మల్యాల.హరిశ్రీకృష్ణ-హైదరాబాద్, జి.వాణీరమణరావు-భీమవరం(ప॥గో॥జిల్లా), యం.స్ఫూరిత-కర్నూలు, పి.మధు-విజయనగరం, సి.హెచ్.శ్రీవాణీశైలజ-విశాఖపట్నం, ఎ.రాధాకృష్ణమూర్తి-మార్కాపురం(ప్రకాశం), గోపాలసూర్యశ్రీ-కాకినాడ, ఎ.టి.కాశీనాథ్- హైదరాబాద్, ఎస్.హిమబిందు-జైపూర్(ఒరిస్సా), మహమ్మద్‌లతీఫ్-హైదరాబాద్, జవంగులశ్రీనివాస్-సత్తెనపల్లి(గుంటూరు), తాడిరంగరావు-రాజమండ్రి, సీతాదేవిటలేటి- విజయవాడ, సి.హెచ్.శ్వేత-చీపురుపల్లి(విజయనగరం), జి.జయరాజ్-యెర్రగుంట్ల(కడప), ఎన్.శంకరాచార్యులు-హైదరాబాద్, జె.ఎస్.శేఖర్-తిరుపతి, డి.మల్లిఖార్జున్-మందమర్రి (ఆదిలాబాద్), మానం సుధాకర్-హైదరాబాద్.ఎమ్.అనిత-హైదరాబాద్

## ఒక తప్పుతో వ్రాసిన వారి పేర్లు

శిష్టాహైమవతి-నర్సాపురం(ప॥గో॥జిల్లా), గంటిపద్మజ-అశ్వాపురం(ఖమ్మం), ఎస్.ఎస్.చారి -హైదరాబాద్, లలితాత్రిపురసుందరి.ఎన్-విశాఖపట్నం, సి.వసంతలక్ష్మి-సికింద్రాబాద్, ఎమ్.శోభలత-విశాఖపట్నం, రామకూర్‌నాగేశ్వరరావు-శ్రీకాకుళం, పి.వి.రేఖ-కర్నూలు, పి.స్వాతిలక్ష్మి-చీపురుపల్లి(విజయనగరం), జి.ఉదయశ్రీ-హైదరాబాద్, ఎస్.కళ్యాణ్‌చక్రవర్తి -హైదరాబాద్, దారివేములరేవతి-తెనాలి(గుంటూరు), డి.శివప్రసాద్-విశాఖపట్నం, కె.వాణి -విజయనగరం, కొత్తపల్లిజేజిబాబు-మచిలీపట్నం(కృష్ణా), సముద్రాలమహాలక్ష్మి- పాతగుంటూరు, ఎన్.పద్మజ-న్యూఢిల్లీ, టి.కీర్తి-జగ్గయ్యపేట(కృష్ణా), కె.సునితా-యెలమంచిలి(విశాఖపట్నం), ఎన్.కె.నాగేశ్వరరావు-పెనుగొండ(ప॥గో॥జిల్లా), కె.మురళీకృష్ణ-రామచంద్రపురం, ఆయి మైత్రరంజిత-పాణ్యం(కర్నూలు), టి,కుమారస్వామి -కర్నూలు, ఎస్.కేశవ అయ్యంగార్-నర్సాపురం(ప॥గో॥జిల్లా), పి.పాపారావు-విశాఖపట్నం, కందూకూరిశివరామకృష్ణప్రసాద్-హైదరాబాద్, ఎమ్.ఎస్.మురళీకృష్ణశర్మ-వుండవల్లి సెంటర్(గుంటూరు), సి.పద్మాకుమారి- పెద్దాపురం (తూ॥గో॥జిల్లా), ఇప్పిలివెంకటరమణ- కాశీబుగ్గ, జి.శ్రీలత-హైదరాబాద్, కె.మాధవరాంబాబు-హైదరాబాద్, వై.రోశిరెడ్డి- సత్తెనపల్లి, గుండాల రాజ్యలక్ష్మి-విజయనగరం, భమిడిపాటిగౌరిశంకర్-నరసన్నపేట (శ్రీకాకుళం), ఆర్.ఆనంద్‌రెడ్డి-హైదరాబాద్, ఎన్.వి.కె.శాస్త్రి-కంచిలి(శ్రీకాకుళం), ఇ.తేజస్విని -చిత్తూరు, కె.సత్యనారాయణ-కడప, కోగంటిమురళీకృష్ణ-చిలకలూరిపేట(గుంటూరు), అయ్యగారిశ్యామ్‌సుందర్-విజయవాడ, యం.వి.యస్.లక్ష్మి-కాకినాడ, నేమానసుభాష్ చంద్రబోస్-శ్రీకాకుళంటౌన్, శ్రీమంజూష.ఎన్-అనంతపురం, కె.నమీరుకుమార్-ఖమ్మం, డా.కె.ఎస్.దయానిధి-గుంటూరు, పనుమర్తినరస్వతి-నెల్లూరు, కానమానుఇందరారెడ్డి- సూర్యాపేట, రామశేషు.సి-హైదరాబాద్, పి.సురేష్‌బాబు-తిప్పవరప్పాడు(నెల్లూరు), ఎ.రవికిరణ్-గుంటూరు, వాసేవసంత-సూళ్ళూరుపేట(నెల్లూరు), బొడిగెవేంకటేశంగౌడ్- హైదరాబాద్, ఎమ్.బి.వేంకటేశ్వరులు-నడకుదురు(తూ॥గో॥జిల్లా), కె.నాగమల్లీశ్వరి-విశాఖపట్నం, పి.వి.సాయిరామ్‌ప్రసాద్-విశాఖపట్నం, పి.వి.సుబ్రహ్మణ్యం-సూళ్ళూరుపేట (నెల్లూరు), వారణాసిరామకృష్ణ-హైదరాబాద్, డా॥జి.సహదేవుడు-నంద్యాల(కర్నూలు), మద్దిబుజ్జి-నరసన్నపేట (శ్రీకాకుళం), ఎస్.సత్యానంద్-సికింద్రాబాద్, పి.రమాజోగారావు- విశాఖపట్నం, టి.పి.కె.నందన్-రాయగడ(ఒరిస్సా), యస్.విమల-నాగర్‌కర్నూలు (మహబూబ్‌నగర్), ఎ.వెంకటసాయి-నిజామాబాద్, పి.అరుంధతిశర్మ-బీదర్, అడపా విఘ్నేశ్వరరావు-పర్లాకిమిడి(ఒరిస్సా), జి.భాగ్యశ్రీ-ఖమ్మం, ఇలపావులూరి శేష్వతలశాయి- అద్దంకి(ప్రకాశం), సి.భానుమతి-భీమవరం, సమ్మెట్లఉమామహేశ్వరి-శృంగరపురం (విజయనగరం), పి.లక్ష్మీసమీర-నెల్లూరు, పి.శ్రీనివాసరెడ్డి-నెల్లూరు, చాడావెంకటశాస్త్రి- నవరంగాపూర్ (ఒరిస్సా), వై.వి.ఎన్.సత్యనారాయణ-కాకినాడ, ఎ.రవీంద్రనాథ్- అనంతపురం, ధర్మాల సుబ్రహ్మణ్యం-హైదరాబాద్, బి.చంద్రకళ-హైదరాబాద్, సి.కనకదుర్గ- విశాఖపట్నం, పి.వి.రామశర్మ-విశాఖపట్నం, జె.పవన్‌కుమార్-విశాఖపట్నం, ఎ.విజయలక్ష్మి ఆనంద్-సికింద్రాబాద్, పి.ప్రదీప్‌కుమార్-మారెళ్ళ(ప్రకాశం), పింగళి కనకవల్లి-హైదరాబాద్, యు.విజయశేఖరరెడ్డి-హైదరాబాద్, వి.ఎస్.కాంట్-రాజమండ్రి, యెర్రవాణి-కాకినాడ, కె.వెంకటేశ్వర్లు-హైదరాబాద్, పి.పద్మావతి-నరసరావుపేట(గుంటూరు), ఎమ్.హరిప్రసాద్- విశాఖపట్నం, అద్దంకిసీతాదేవి-హైదరాబాద్, వి.రజిత-హైదరాబాద్, అడుసుమల్లి రామచంద్రరావు-రేపల్లె(గుంటూరు), పి.విద్యశ్రీ- నిజామాబాద్, బట్టుపల్లిరాధానిశాకర్‌రెడ్డి- కొంగరకలాన్ (రంగారెడ్డి), పి.ఎస్.ఎన్.రాజు-శ్రీరాంనగర్(మహబూబ్‌నగర్), డి.వెంకట్రావు- నల్లూరు, అమరనాథ్‌జగన్నాథ్-విజయవాడ, కవిలిగంటకృష్ణారావు- శ్రీకాకుళం, ఎ.రాధాస్వాతి-శ్రీకాకుళం, పి.రాధాకృష్ణకుమారి-హైదరాబాద్, యం.సుధీర్- నర్సరావుపేట, ఎస్.అనిరుద్ధ-కాకినాడ, బి.సూర్యలక్ష్మి-శ్రీరంగపట్నం(తూ॥గో॥జిల్లా), యం.అప్పారావు-అనకాపల్లి, ఎన్.శేషగిరిరావు-కోదాడ(నల్గొండ), జయపాల్-మదనపల్లి (చిత్తూరు), ఎమ్.లలిత-అనంతపురం, రాపేటిలక్ష్మీదేవి-విశాఖపట్నం, జి.పాండురంగారావు-హైదరాబాద్,ఎమ్.సుహాసిని-హైదరాబాద్, పుటేవృశ్రీనివాసరావు-హైదరాబాద్, డి.వేణుగోపాల్-అనంతపురం, ఎ.సుబ్రహ్మణ్యం-హైదరాబాద్, తులసిబాయి-రాయదుర్గం (అనంతపురం), పురాణంసుబ్రహ్మణ్యం-మార్కాపూర్ (ప్రకాశం), ఎస్.వి.వి.కృష్ణ-హైదరాబాద్, కె.తిరుమలదేవి-హైదరాబాద్,

## రెండు తప్పులతో వ్రాసిన వారి పేర్లు

వి.ఎన్.రాజేశ్వరరావు-కొత్తవలస, జి.ప్రసాదరావు-శ్రీకాకుళం, సి.రంగనాయకులు- మార్కాపూర్(ప్రకాశం), చర్లసాశ్రీనివాసు-రాజమండ్రి, పెంకికోటసునీతషణ్ముగం- విశాఖపట్నం, కండెరాజేష్-ఇల్లందు(ఖమ్మం), పెంటకోటపద్మలక్ష్మి-విశాఖపట్నం, పి.వి.సుందర్‌కుమార్-బెరహంపూర్(ఒరిస్సా), పి.వి.సునీత-బెరహంపూర్, జి.కార్తికేయదాస్-అనేపర్తి(తూ॥గో॥జిల్లా), కె.పల్లవి-విశాఖపట్నం, ఓంప్రకాశ్‌నిదానకవి-ఎన్.ఎఫ్.సి.నగర్(రంగారెడ్డి), డి.వి.వి.ఎస్.ఎస్.రామకృష్ణ-కాకినాడ, పేరిచర్ల రామకృష్ణరాజు-ధర్మవరం (ప॥గో॥జిల్లా), ఎస్.జితేంద్ర-నెల్లూరు, పంగులూరి సత్యనారాయణ-నెల్లూరు, , సి.శారదదేవి-హైదరాబాద్, బి.యామిని-గుంటూరు, డి.ఎస్.కృష్ణారావు- భోసగిరి(నల్గొండ), పి.అర్చన-కడప, ఎ.శేషలక్ష్మీకాంతం-రాజమండ్రి, ఆర్.ఎమ్.కుమారి-హైదరాబాద్, సి.హెచ్.నాగేశ్వరరావు దావేజీ-హైదరాబాద్, ఎ.ఉదయసుందరి-హైదరాబాద్, బి.గాయత్రి-కాకినాడ, మరువాడసాయిశ్రీకాంత్-విశాఖపట్నం, సి.సత్యవాణి-సికింద్రాబాద్, సి.హెచ్.పద్మిని-విశాఖపట్నం, ఎమ్.నాగమణి-హైదరాబాద్, డా॥ఎ.చిత్రలేఖ-తిరుపతి, వి.పాండురంగారావు-ధవళేశ్వరం, డి.వెంకట్రావు-సాలూరు(విజయనగరం), వి.షణ్ముగం-తిరుపతి, మహబూబ్‌సుభానీ-బాపాజీపాలెం (గుంటూరు), ఆర్.మహేశ్వరి-సికింద్రాబాద్, కె.రాజశేఖర్-హైదర్‌నగర్, జి.ఉషారాణి-విశాఖపట్నం, కె.అనంతలక్ష్మి-రాజమండ్రి, రంగనపాలెంనారాయణ-మాచర్ల(గుంటూరు), ఉప్పలమోహన బాబు- అవనిగడ్డ(కృష్ణా), రేగొటిరఘురామమూర్తి-భువనేశ్వర్(ఒరిస్సా), ఎన్.సాంబశివరెడ్డి-చిత్తూరు, మరువాడ కామేశ్వరరావు-మంచిర్యాల(ఆదిలాబాద్), మరువాడవెంకటరామనాగలక్ష్మి- విశాఖపట్నం,

## మూడు తప్పులతో వ్రాసిన వారి పేర్లు

జెంగానగేష్-హైదరాబాద్, బి.రమామణి-గుమ్మలక్ష్మీపురం(విజయనగరం), జి.వాసంతి- హైదరాబాద్, కె.వి.రమణ- జైపూర్(ఒరిస్సా), ఎ.కె.డి.లింగేశ్వరరావు-దాల్లె పాలెం (విశాఖపట్నం), పి.ప్రసాదరావు-రామవరప్పాడు(కృష్ణా), బొల్లిముంతవెంకటరమణరావు- కొత్తగూడెం (ఖమ్మం).

# దీపావళి కార్టూన్స్ స్పెషల్



# దీపావళి కార్టూన్స్ స్పెషల్























# దీపావళి కార్టూన్స్ స్పెషల్























# చదువుకున్న అమ్మాయిలు తెరవెనుక కథ

ఈ చిత్ర నిర్మాణం వెనుక చాలా వ్యయ ప్రయాసలున్నాయి. ఈ చిత్రకథకు 'ఇద్దరు మిత్రులు' షూటింగ్ టైమ్‌లోనే శ్రీకారం చుట్ట బడింది. శ్రీదేవి అనే ఆవిడ వ్రాసిన 'కాలాతీత వ్యక్తులు' నవలను మధుసూదనరావు చదివారు. ఆ నవల చాలా బాగా వ్రాశారావిడ. అయితే సినిమాగా రూపొందించటానికి ఆ నవల అనువుగా లేదు. కానీ ఆ రచయిత్రి శైలి మధుసూదనరావుకు బాగా నచ్చింది. ఈమెతో ఏదైనా ఓరియెంటెడ్ సబ్జెక్ట్ వ్రాయిస్తే బాగుంటుంది అనిపించింది. వెంటనే ఆమెను సంప్రదించారు. తను అనుకుంటున్న లైన్ ఆమెకు చెప్పారు. ఆడపిల్లలు, పై చదువులు చదవటంలో ఎదురయ్యే సమస్యలతో ప్రారంభించి చదువు పూర్తయ్యాక అంత చదువు చదివిన వరుణ్ని తేవటం, సంసారంలో ఆర్థిక ఇబ్బందులు, చదువుకున్న అమ్మాయిలు ఉద్యోగాలు చేయటంలో ఎదురయ్యే సమస్యల నేపథ్యంలో ఒక కథ వ్రాయమని కోరారు.

ఇద్దరు మిత్రులు షూటింగ్ జరుగుతున్న సమయంలోనే ఆమెను పిలిపించి స్టోరీ డిస్కషన్స్ జరిపే వారు మధుసూదనరావు. కొంతకాలం చర్చలు జరిగాయి. కథ ఒక రూపాన్ని సంతరించుకుంటున్నది.

ఇంతలో ఒక దుర్వార్త ! ఇన్‌టెస్టినల్ ట్యూబర్‌క్యులోసిస్ వ్యాధి బారిన పడి డా॥శ్రీదేవి చనిపోయారు. డాక్టరు అయివుండి కూడా తనలో పెరుగుతున్న వ్యాధిని ఆమె గుర్తించలేకపోవడం దురదృష్టకరం. ఆ తర్వాత మధుసూదనరావు ఆమె భర్తకు సంతాపం తెలియజేయటానికి వెళ్లారు. డా॥ శ్రీదేవి అప్పటివరకు తయారుచేసిన స్క్రిప్టును మధుసూదనరావుకు ఇచ్చారు ఆమె భర్త.

అర్ధాంతరంగా ఆగిపోయిన స్క్రిప్ట్ వర్క్ ఎవరితో పూర్తిచేయించాలి? ఇల్లిందల సరస్వతీదేవి పేరు సూచించారు దాశరథి. ఆమె గొప్ప రచయిత్రే గాని ఆర్థడాక్స్ టైప్ అని కొందరి అభిప్రాయం.

అయితే వి.ఎస్. రమాదేవి గారు అన్నివిధాల బెస్ట్ అని సూచించారు దాశరథి. ఆమెను గురించి వాకబు చేస్తే ఆమె అప్పుడే డెలివరీకి ఆసుపత్రిలో చేరారు.

మరలా దాశరథి గారిని కలవటానికి ఆల్ ఇండియా రేడియోకి వెళ్ళిన మధుసూదనరావుకు ప్రఖ్యాత రచయిత గోపీచంద్ తారసపడ్డారు. విషయం తెలుసుకున్న గోపిచంద్ నేను వ్రాస్తానన్నారు. ఇది లేడీస్ సబ్జెక్ట్ కావటంతో ఆడవాళ్ళు వ్రాస్తేనే బాగుంటుందని మధుసూదనరావు అభిప్రాయం. అపుడు గోపీచంద్ యద్దనపూడి సులోచనారాణి పేరు సూచించి డైలాగ్స్ మాత్రం తానే రాస్తానన్నారు. మధుసూదనరావు ఆనందంగా అంగీకరించారు. యద్దనపూడి సులోచనారాణితో మాట్లాడి విషయం అంతా వివరించారు. తొలిసారిగా అన్నపూర్ణ సంస్థకు కథ వ్రాయడం ద్వారా చలనచిత్ర రంగంలో అడుగు పెట్టారు యద్దనపూడి సులోచనారాణి.

ఈ విధంగా చేతులు మారి ఎలాగైతేనేం చదువుకున్న అమ్మాయిలు స్క్రిప్ట్ దాదాపు సిద్ధమైంది. కొద్దిరోజుల్లో సెట్స్‌కు వెళ్తామను కొంటుండగా వాహినీ స్టూడియోలో స్ట్రయికు వచ్చి పడింది. పదమూడు ఫ్లోర్‌లతో ఆసియాలో కల్లా పెద్ద స్టూడియోగా పేరుపొందిన స్టూడియో మూత పడటంతో మిగిలిన స్టూడియోలన్నీ బిజీ అయ్యాయి.

ఇంతలో 'మంచి మనసులు' శతదినోత్సవ వేడుకలు హైదరాబాద్‌లో ఏర్పాటుచేసి ఆ చిత్రం ముహూర్తపు షాట్‌కు కెమెరా స్విచాన్ చేసిన మధుసూదనరావును బహుమతి ప్రదాతగా ఆహ్వానించారు - బాబూ మూవీస్ అధినేతలు ఆదుర్తి సుబ్బారావు, సుందరం. శతదినోత్సవ వేడుకలు ఘనంగా పూర్తయిన తరువాత చెన్నారెడ్డిగారు "అక్కడ వాహినీ స్టూడియో స్ట్రయిక్‌లో ఉంది కదా.... మీ నెక్స్‌ట్ పిక్చర్ ఇక్కడే తీయండి" అన్నారు. బ్రహ్మానందరెడ్డిగారూ అదే అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు. లంచ్ తరువాత సారథీ స్టూడియో చూడటానికి వెళ్లారు ఆదుర్తి, కెమెరామెన్ సెల్వరాజ్, మధుసూదనరావు.

మూతబడి ఉన్న స్టూడియో తాళాలు తీయించి చూశారు. కొత్త మిచెల్ కెమెరా కండిషన్‌లో ఉంది. సౌండ్ సిస్టం కూడా పర్‌ఫెక్ట్‌గా ఉంది.

అన్ని విషయాలు సరి చూసుకుని సాయంత్రం డిన్నర్‌లో "ఇక్కడ చేస్తాము కానీ కాస్ట్ ఆఫ్ ప్రొడక్షన్ ఎక్కువ అవుతుంది" అన్నారు మధుసూదనరావు.

"దానిదేముంది? ముందు మీరు షూటింగ్ జరిపితే ఆ నష్టాన్ని గవర్నమెంట్ కాంపెన్సేట్ చేసేలాగా మేము చూస్తాము" హామీ ఇచ్చారు చెన్నారెడ్డి, బ్రహ్మానందరెడ్డి.

అప్పటికింకా సబ్సిడీ విధానాన్ని ప్రవేశ పెట్టలేదు. అక్కినేని నాగేశ్వరరావుతోను, ఇతర పార్టనర్స్‌తోను అన్ని విషయాలు చర్చించారు మధుసూదనరావు. పూర్తి చిత్రం హైదరాబాదులోనే తీసేలాగా నిర్ణయించుకొని మద్రాస్ వెళ్లారు మధుసూదనరావు.

అక్కడ స్ట్రయిక్ పరిస్థితి ఎలా ఉందీ అని ఒకసారి నాగిరెడ్డి గారిని వాకబు చేశారు. మరో ఆరు నెలల దాకా స్టూడియో తెరిచే ప్రసక్తి లేదన్నారాయన.

ఇక హైదరాబాద్ వెళ్లటానికి ఏర్పాటు చేసే పనిలో నిమగ్నమయ్యారు మధుసూదనరావు.

వాహినీ స్టూడియోలో పనిచేసే కార్పెంటర్ - మేస్త్రీ కుప్పుస్వామి నాయుడుని హైదరాబాద్ పంపించారు. పదివేల రూపాయలు అడ్వాన్సుగా యిచ్చి సెట్స్ వేయించారు. వాహినీ స్టూడియోలో సెట్స్ పేయింటింగ్ డిపార్టుమెంట్ నుంచి బ్యాగ్రౌండ్ పేయింటర్ అంథోని స్వామిని కూడా పంపించారు. అలాగే వాహినీలో సౌండ్ డి.పి.టి. ఛీఫ్ ఇంజనీర్‌గా చేసి స్ట్రయిక్ మూలంగా రిట్రెంచ్ చేయబడ్డ ఎ.కృష్ణన్ హైదరాబాద్‌కు పంపించి మూతబడిన స్టూడియోను మరలా తెరిపించారు.

సారథి స్టూడియోకు కొత్త కళ వచ్చింది.

ఇంతలో మద్రాసు ముఖ్యమంత్రి భక్తవత్సలం గారు చొరవ తీసుకొని వర్కర్స్ కు యాజమాన్యానికి మధ్య సయోధ్య కుదిర్చి వాహినీ స్టూడియోను తిరిగి తెరిపించారు.

అపుడు నాగిరెడ్డిగారు "మీ చిత్రాలన్నీ వాహినీలో తీశారు. సెంటిమెంటల్‌గా కూడా మీకు వాహిని అచ్చివచ్చింది. కాబట్టి మరలా మద్రాసు వచ్చేయండి" అన్నారు.

కానీ "హైదరాబాద్‌లో ఏర్పాట్లన్నీ పూర్తయ్యాయి. అదీ కాక ప్రభుత్వ పరంగా సహాయం అందిస్తారంటే స్టూడియోకి అడ్వాన్సు ఇచ్చాము. అయినా మీరు ఆరు మాసాల దాకా స్టూడియో తెరవము అని చెప్పబట్టే కదా మేము వెళ్లింది. ఈ చిత్రం వరకు అక్కడ చేసిం తర్వాత ఆలోచిద్దాం లేండి" అన్నారు మధుసూదనరావు.

నటీనటవర్గం మొత్తం హైదరాబాద్ ప్రయాణమైంది. సంస్థ పట్ల ఉన్న అభిమానం కొద్దీ ఆర్టిస్టులందరూ - హోటల్స్ వద్దు, అందరం స్టూడియోలోనే ఉంటాము. అనవసర ఖర్చులు ఎందుకు - అంటూ వలంటరీగా స్టూడియోలోనే బస చేయడానికి నిర్ణయించుకున్నారు. నాగేశ్వరరావు, సావిత్రి, కృష్ణకుమారి, ఇ.వి.సరోజ, గుమ్మడి, శోభన్‌బాబు, రేలంగి, సూర్యకాంతం, పద్మనాభం అందరూ స్టూడియోలో ఉన్న ఆరు గదుల్లో ఎడ్జెస్ట్ అయ్యారు.

షూటింగ్‌కు సకల సన్నాహాలు పూర్తయ్యాయి. ఫైనల్ స్క్రిప్ట్ వర్క్ ఫైనలైజ్ కావచ్చిన తరుణంలో హఠాత్తుగా గోపీచంద్ గుండెపోటుతో మరణించారు. ఇపుడేం చెయ్యాలి? మిగిలిన వర్క్ ఎవరితో పూర్తి

చేయించాలి అన్న సమస్య వచ్చింది.

ఆత్రేయను అడిగితే 'అమ్మో! ఈ చిత్రం ప్రారంభించిన వేళా విశేషం ఏమిటో గానీ శ్రీదేవి గారు పోయారు. గోపీచంద్ గారు పోయారు. నేను కూడా పోతానేమో? నేను రాయను' అన్నారాయన.

సరే - దాదాపు పూర్తి కావచ్చింది కదా అనుకొని మిగిలిన స్క్రిప్ట్ ఆదుర్తి, మధుసూదనరావు కలిసి పూర్తి చేసుకున్నారు.

"అయితే కొన్ని మార్పులు చేర్పులు జరగటం వల్ల, రైటర్స్ మారటం వల్ల, చదువుకున్న అమ్మాయిలు స్క్రిప్టు నేను ఆశించిన స్థాయిలో రాలేదు. చదువుకున్న ఆడపిల్లల సమస్యల నేపథ్యంలో చక్కని ప్రయోగాత్మక చిత్రం తీద్దామని మొదలుపెడితే అది అట్లా అయింది. మా సంస్థ చరిత్రలో స్క్రిప్టు విషయంలో అసంతృప్తిగా తీసిన మొదటి చిత్రం 'చదువుకున్న అమ్మాయిలు' అంటారు మధుసూదనరావు.

ఈ చిత్రంలోనే శోభన్‌బాబు తొలిసారిగా అన్నపూర్ణ సంస్థలో సావిత్రి భర్తగా నటించారు. ఈ కాంబినేషన్‌పై అప్పట్లో చాలా విమర్శలు వినవచ్చాయి.

'సావిత్రి మీద నాగేశ్వరరావు, రామారావు తప్ప వేరే ఎవరు వేసినా ప్రేక్షకులు సహించరు. ఇదేమి కాంబినేషన్' అని మధుసూధనరావును నిలదీసారు స్వర్గీయ చక్రపాణిగారు.

పాత్ర ప్రాధాన్యతను బట్టి నటీనటులు ఎంపిక జరుగుతుంది గానీ వారి ఇమేజ్‌ని బట్టి పాత్రలను రూపొందించే అలవాటు అన్నపూర్ణ సంస్థకు ఆది నుండి లేదు.

అన్నపూర్ణ సంస్థ హైదరాబాద్‌లో తీసిన తొలిచిత్రం యిది. ఇక్కడ ఉన్న వసతులు, సౌకర్యాలను, టాలెంట్స్‌ను పూర్తిగా వినియోగించుకునే ఉద్దేశంతో ముఖ్యపాత్రలకు తప్ప మిగిలిన చిన్న చిన్న పాత్రలకు స్థానిక కళాకారులనే ఎంపిక చేసుకున్నారు.

దాదాపు ముప్పయ్యేళ్ల తరువాత కూడా ఇక్కడేం వసతులు ఉన్నాయి అని ప్రశ్నించే వారికి ఆ రోజుల్లోనే సమాధానం చెప్పింది అన్నపూర్ణ సంస్థ.

రీ-రికార్డింగ్, మిక్సింగ్ మొత్తం హైదరాబాద్ లోనే జరుపుకున్న తొలిచిత్రం చదువుకున్న అమ్మాయిలు. మద్రాసు నుండి ఏడుగురు మ్యూజిషియన్స్‌ని ఇన్‌స్ట్రుమెంట్స్‌తో రప్పించి, పదిహేను మంది స్థానిక మ్యూజిషియన్స్‌ను పెట్టుకుని ఎస్.రాజేశ్వరరావు సంగీత దర్శకత్వంలో కృష్ణయ్యర్ చీఫ్ సౌండ్ ఇంజనీరుగా, రీ-రికార్డింగ్, మిక్సింగ్‌లు ఇక్కడే పూర్తిచేశారు. క్వాలిటీ దెబ్బ తింటుందని కొంతమంది భయపెట్టినప్పటికీ ప్రింటింగ్ కూడా ఇక్కడే జరిపించిన 'రాష్ట్రవాళి' చిత్రం 'చదువుకున్న అమ్మాయిలు'.

'చదువుకున్న అమ్మాయిలు' చిత్రం ఆశించినంత గొప్పగా రాకపోయినా సునాయసంగా నూరు రోజులు ఆడింది. 'లవకుశ' వంటి కలర్ చిత్రం స్ట్రాంగ్ అపోజిషన్ పడినప్పటికీ పోటీని ధాటిగా తట్టుకున్నారు చదువుకున్న అమ్మాయిలు.

అయితే చిత్రం రిలీజ్ అయిన రెండవ రోజున హైదరాబాద్‌లోను, గుంటూరులోను మెడికల్ రిప్రజెంటేటివ్స్ కొందరు కేసు వేశారు.

చిత్రంలో పద్మనాభం మెడికల్ రిప్రజెంటేటివ్. అతను ఇ.వి.సరోజ వెంటపడి ఏడిపిస్తుంటే కాలు చెప్పు విసిరేస్తుంది. ఆ చెప్పును అలాగే బ్యాగ్‌లో పెట్టుకుని పరుగెత్తుతాడు పద్మనాభం. ఈ రీజన్‌పై కోర్టు కెక్కి "మెడికల్ రిప్రజెంటేటివ్స్ పరువు తీశారు. వెంటనే చిత్ర ప్రదర్శనను నిలిపివేయాల్సింది" అని వాదించారు. అయితే ఈ కేస్ చాలా సిల్లీ అయినదిగా భావించి కోర్టు కొట్టివేసింది.

ఈ విధంగా ప్రారంభం నుండి రిలీజ్ అయిన తర్వాత కూడా చాలా రిస్క్‌లతో నడిచింది 'చదువుకున్న అమ్మాయిలు' చరిత్ర.

ఇద్దరు మిత్రులు ఫంక్షన్‌లో పాటలు పాడిన 'ఆశాలతా కులకర్ణి' అనే అమ్మాయితో ఈ చిత్రంలో రెండు పాటలు పాడించారు. ఒకసారి మధుసూదనరావు అన్నపూర్ణ సంస్థ బోర్డ్ ఆఫ్ డైరెక్టర్స్ కొందరు హైదరాబాద్ తాజ్‌మహల్ హోటల్‌లో రూమ్ తీసుకుని ఉండగా ఆ పక్కనే ఉన్న రూఫ్ గార్డెన్ నుండి ఒక శ్రావ్యమైన గొంతు వినిపించింది. ఇదేమిటి! లతా మంగేష్కర్ ఇక్కడి కెపుడొచ్చిందండీ అంటూ ఆశ్చర్యపోయారా మిత్రులు. ఆమె లత కాదు, ఆశాలతా కులకర్ణి అనే, మరాఠీ అమ్మాయి - అన్నారు మధుసూధనరావు. కాదంటే కాదని వాదించుకుంటూ వెళ్లి ఆమెను చూసి ఆశ్చర్యపోయారా మిత్రులు. అంత గొప్ప గాయనిని 'చదువుకున్న అమ్మాయిలు' ద్వారా పరిచయం చేసి ఆ అమ్మాయికి గొప్ప భవిష్యత్తు ఉంది. మేమంతా ప్రోత్సహిస్తాం అని హామీ యిచ్చి, ఆమె తల్లిదండ్రులకు మధుసూధనరావు సలహా యిచ్చారు. కానీ తెలుగు పిక్చర్లలో అమ్మాయికి భవిష్యత్తు వుండదని భావించి పెళ్లి చేశారు. పెళ్లయిన కొద్దిరోజులకే ఆమె పూనా వెళ్లిపోయింది. ఒక మంచి గాయనితో పాడించి ప్రయోగం చేశామన్న తృప్తి మాత్రం అన్నపూర్ణ సంస్థకు మిగిలిపోయింది.

# చదువుకున్న అమ్మాయిలు కథ

ధనవంతురాలైన సుజాత, మధ్యతరగతికి చెందిన వసంత స్నేహితురాళ్ళు. సుజాత డ్రైవింగు నేర్పిస్తూ ఉండగా మోటర్ బైక్ మీద వచ్చిన శేఖర్‌కి డాష్ ఇచ్చి యాక్సిడెంట్ చేస్తుంది వసంత. కొద్దిపాటి ఘర్షణ జరిగినా, తర్వాత ముగ్గురూ మంచి స్నేహితులైపోతారు. శేఖర్ని వసంత, సుజాత ప్రేమించినా మధ్యతరగతి జీవితాల గురించి తెలిసిన శేఖర్ వసంతనే ప్రేమించి ఆ సంగతి సుజాతకు చెప్పేస్తాడు కూడా. మంచి మనసుతో అర్థం చేసుకున్న సుజాత తన తండ్రి చేసిన సంబంధానికి ఒప్పుకుని ప్రభాకర్‌ని పెళ్ళి చేసుకుంటుంది. వసంతకు, సుజాతకు చిన్ననాటి స్నేహితురాలైన లత ఇష్టం లేని పెళ్ళి నుంచి తప్పించుకుని పట్నం చేరుకుని శేఖర్ స్నేహితుడైన ఆనంద్ వలలో పడుతుంది. ఆనంద్ అటు లతను ప్రేమించినట్టు నాటకం ఆడుతూ ఇటు వసంతను కూడా పెళ్ళి చేసుకోవాలని ప్రయత్నం చేస్తూంటాడు. వసంత తాతగారికి సీరియస్‌గా వుందని తెలిసి, ఆమెను కాపాడడం కోసం శేఖర్ తన మోటర్ బైక్ అమ్మగా వచ్చిన డబ్బుని ఆనంద్ ద్వారా చేరే ఏర్పాటు చేస్తాడు. మోటర్ బైక్ అమ్మగా వచ్చే డబ్బుని సాయంత్రంకల్లా సర్దెయ్యొచ్చు కనుక ప్రస్తుతానికి బ్యాంకులోని డబ్బుని వాడుకోమని సలహా ఇస్తాడు ఆనంద్. అతణ్ణి నమ్మి బ్యాంకులో కొంత డబ్బిస్తాడు శేఖర్. బ్యాంకు డబ్బుతోను, మోటర్ బైక్ అమ్మగా వచ్చిన డబ్బుతోనూ అమాయకురాలైన లతను తీసుకుని వుడాయిస్తాడు ఆనంద్. ఈలోగా బాంకుచోరీ నేరంపై శేఖర్ పరారీ కావలసి వస్తుంది. వసంత తాతగారు చనిపోవటం చేత ఆమెకు ఆనంద్‌తో వివాహం చేయాలని నిశ్చయిస్తుంది ఆమె బామ్మ. శేఖర్ బ్యాంకు చోరీ కేసుని దర్యాప్తు చేసే బాధ్యత సుజాత భర్త ప్రభాకర్ మీద పడుతుంది. దాంతో సుజాత పరిస్థితి మరింత ఇరకాటంలో పడుతుంది. ఆమె సహనం, తెలివి తేటల వలన దుర్మార్గుడైన ఆనంద్ పట్టుబడి, లతతో పెళ్ళికి ఒప్పుకుంటాడు. శేఖర్ విడుదలయి వసంతను చేరుకుంటాడు. అందరి సమస్యలను తీర్చిన సుజాత ఆనందంగా భర్తతో కాపురం చేసుకుంటుంది.

రచన: ఆరుద్ర గానం: ఘంటసాల, పి.సుశీల

శేఖర్ : ఆడవాళ్ల కోపంలో అందమున్నది
అందులోనే అంతులేని అర్థమున్నది
మొదటి రోజు కోపం
అదో రకం శాపం
పోను పోను కలుగుతుంది
బలే విరహతాపం
వసంత: బ్రహ్మచారి లేత మనసు పైకి తేలదు - తన
మాటలందు చేతలందు పొత్తు కుదరదు
సుజాత: పడుచువాడి మిడిసిపాటు పైన పటారం - ఒక
గడుసుపిల్ల కసరగానే లోన లొటారం
శేఖర్ : వగలాడి తీపితిట్టు
తొలివలపు తెనెపట్టు- ఆ
తేనె కోరి చెంతచేర
చెడామడా కుట్టు ॥బ్రహ్మచారి॥
వసంత: పెళ్లికాని వయసులోని పెంకి పిల్లలు - తమ
కళ్లతోనె మంతనాలు చేయుచుందురు
శేఖర్ : వేడుకొన్న రోషం
అది పైకి పగటి వేషం
సుజాత: వెంటపడిన వీపు విమానం ॥ఆడవాళ్ల॥
శేఖర్ : చిలిపికన్నె హృదయమెంతో చిత్రమైనది - అది
చిక్కు పెట్టు 'క్రాసువరుడు' పజిలు వంటిది
చిలిపికన్నె...
చిలిపికన్నె హృదయమెంతో చిత్రమైనది - అది
చిక్కు పెట్టు 'క్రాసువరుడు' పజిలు వంటిది
సుజాత: ఆ పజిలు పూర్తి చేయి
తగు ఫలితముండునోయి
శేఖర్ : ఆ...
వసంత: మరుపురాని మధురమైన
'ప్రయిజు' దొరుకునోయి ॥ఆడవాళ్ల॥

రచన: దాశరథి గానం: (ఘంటసాల), పి.సుశీల

ఓహో...ఓఓఓఓ....ఆఆఆ...
ఓహో...ఓఓఓఓ....ఆఆఆ...
వినిపించని రాగాలే
కనిపించని అందాలే
అలలై మదినే కలచే
కలలో ఎవరో పిలిచె
తొలి చూపులు నాలోనే - వెలిగించె దీపాలే
చిగురించిన కోరికలే - చిలికించెను తాపాలే
వలచే మనసే మనసు ॥వినిపించని॥
వలపే వసంతములా
పులకించి పూచినదీ
చెలరేగిన తెమ్మెరలే
గిలిగింతలు రేపినవి
విరిసే వయసే వయసు ॥వినిపించని॥
వికసించెను నా వయసే మురిపించు ఈ సొగసే
విరితేనెల వెన్నెలలో - కొరతేదో కనిపించె
ఎదలో ఎవరో మెరిసే! ॥వినిపించని॥

రచన: దాశరథి గానం: ఘంటసాల,సుశీల

శేఖర్ : గుట్టుగా లేత రెమ్మల కులుకు నిన్ను
రొట్టెముక్కల మధ్యన పెట్టిరనుచు
ఏల యిట్టుల చింతింతువే టొమాటో
అతివలిద్దరి మధ్య నా గతిని గనుమా...
ఒకటే హృదయం కోసము
ఇరువురి పోటీ దోషము ॥ఒకటే॥
ఒకరు సత్యభామ ఒకరేమొ రుక్మిణి
మధ్య నలిగినాడు మాధవుండు
ఇద్దరతివలున్న ఇరకాటమేనయా
విశ్వదాభిరామ వినురవేమ
జతగా చెలిమి చేసిరి
అతిగా కరుణే చూపిరి
చెలిమే వలపై మారితే
శివశివ మన పని ఆఖరే ॥ఒకటే॥
రాముని దొకటే బాణము
జానకి ఆతని ప్రాణము
ప్రేమకు అదియే నీనుము
ప్రేయసి ఒకరే న్యాయము ॥ఒకటే॥

రచన: ఆరుద్ర గానం: పి.బి.శ్రీనివాస్, ఆశాలత కులకర్ణి

ఆనంద్ : ఓహో చక్కని చిన్నది - ఒయ్యారంగా వున్నది
ఊరించేటి కన్నులతో నన్నే చూడన్నది
లత : చిన్నది చాలా మంచిది - నిన్నే నమ్ముకున్నది
నీవే తప్ప వేరెవరూ లేనే లేరన్నది
ఆనంద్ : వెచ్చగ జవ్వని తాకితే, పిచ్చిగ వూహలు రేగునే
రెపరెపలాడే గుండెలలోన -ప్రేమనిండేనే
లత : అయ్యో పాపం!
ఆనంద్ : తీరని తాపం!
లత : భావ కవిత్వం చాలునోయి - పైత్యంలోన జారకోయి
పెళ్లికిముందు ప్రణయాలు ముళ్లబాణాలు ॥ఓహో॥
లత : పెద్దల అనుమతి తీసుకో
ప్రేమను సొంతం చేసుకో
హద్దూ పద్దూ మీరినావొ - ఆటకట్టేను
ఆనంద్ : "యస్సం"టారు మా వాళ్లు
లత : "నో" అంటేను తకరారు
ఆనంద్ : తల్లీదండ్రి కూడదంటే -గుళ్లో పెళ్లి చేసుకుందాం
ధైర్యం చేసి నీవేగా దారి చూపావు ॥చిన్నది॥
ఆనంద్ : మనసే దోచిన సుందరి - మమతే మల్లెపందిరి
పందిరిలోన మేనులు మరచి పరవశించాలి
లత : అపుడే కాదు
ఆనంద్ : ఎపుడంటావు
లత : తొందరలోనే మూడుముళ్లూ
అందరిముందూ వేయగానే
తోడూ నీడై కలకాలం సాగిపోదాము
ఆనంద్ : ఓహో చక్కని చిన్నది -ఒయ్యారంగా వున్నది
ఊరించేటి కన్నులతో నన్నే చూడన్నది
లత : చిన్నది చాలా మంచిది -నిన్నే నమ్ముకున్నది
నీవే తప్ప వేరెవరూ లేనే లేరన్నది
ఇద్దరూ : ఓఓఓఓ....ఆఆఆఆ...

రచన: సి.నారాయణరెడ్డి గానం: ఘంటసాల, పి.సుశీల

శేఖర్ : కిలకిల నవ్వులు చిలికిన - పలుకును నాలో బంగారు వీణ
వసంత : కరగిన కలలే నిలిచిన - విరిసెను నాలో మందారమాల
శేఖర్ : రమ్మని మురళీరవమ్ములు పిలిచె
అణువణువున బృందావని తోచె
వసంత : తళ తళలాడే తరగలపైన
అందీ అందని అందాలు మెరిసే ॥కిల కిల॥
వసంత : నీవున్న వేరే సింగారము లేలా?
నీ పాదధూళి సిందూరము కాదా?
శేఖర్ : మమతలు దూసి, మాలలు చేసి
గళమున నిలిపిన కల్యాణి నీవే ॥కిలకిల॥
శేఖర్ : నీ కురులే నన్ను సోకిన వేళ
హాయిగ రగిలేను తీయని జ్వాల
వసంత : జలజల పారే వలపులలోనే
సాగెను జీవన రాగాల నావా
ఇద్దరు : కిలకిల నవ్వులు చిలికిన పలుకును నాలో బంగారు వీణ

రచన: ఆరుద్ర గానం: పి.సుశీల, ఘంటసాల

1వఆమె : నీకో తోడు కావాలి - నాకో నీడ కావాలి
ఇదిగో పక్కనుంది-చక్కనైన జవ్వని
నన్నే నీ దాన్ని చేసుకోవాలి
నవ నాగరిక జీవితాన తేలుదాం
నైటు క్లబ్బులందు నాట్యమాడి సోలుదాం
నువ్వు అందమైన టిప్పుటాప్పు బాబువి
నేను అంతకన్న అప్టుడేటు బేబిని
అతడు : వగలాడి నీకు తాళి బరువు ఎందుకు?
ఎగతాళి చేసి దాని పరువు తీయకు
ఆమె : నీకో తోడు కావాలి - నాకో నీడ కావాలి
ఇదుగో పక్కనుంది చక్కనైన జవ్వని
అతను : ఓ తల్లీ! దయచేయి కోటి దండాలు
2వ.ఆమె: నేను పేరుపడినవారి యింట పుట్టి పెరిగాను
ఏదో 'హారుమణి' వాయిస్తూ పాడుకుంటాను
నేను చదువులేని దాననని అలుసు నీకేలా?
నీకు కలసివచ్చు లక్షలాస్థి విడిచిపోనేలా?
అతను : మీతో వియ్యం దినదిన గండం
మీ ఆస్థి కోసం ఆత్మ నేను అమ్ముకోజాల
ఆమె : నీకో తోడు కావాలి-నాకో నీడ కావాలి
ఇదుగో పక్కనుంది చక్కనైన జవ్వని
అతను : ఓ తల్లీ! దయచేయి కోటి దండాలు
3వ ఆమె: సిరులూ, నగలూ మాకు లేవోయ్
తళుకు బెళుకులా మోజు లేదోయి
చదువు సంస్కృతి సాంప్రదాయాలు
తెలుగుతనమె మా రత్నహారాలు
అతను : ధనరాశికన్న నీ గుణమే మిన్న
నీలో సంస్కార కాంతులున్నాయి
1వ.ఆమె : నీకో బ్రూటు దొరికింది
2వ.ఆమె: మెడలో జోలి కడుతుంది
అతను : ఈమె కాలిగోటి ధూళిపాటి చేయరు
ఓ, త్వరగా దయచేస్తే కోటి దండాలు ॥నీకో తోడు॥
3వ.ఆమె: నీకు తోడు కావాలి నాకు నీడ కావాలి
అతను : ఓహో పక్కనున్న చక్కనైన జవ్వనీ నిన్నే నా దాన్ని చేసుకుంటాను

రచన: ఆరుద్ర గానం: ఆశాలత కులకర్ణి

ఆమె: ఏమండోయ్! నిదుర లేవండోయ్
ఎందుకు కలలో కలవరింత
ఎవరిని తలచి పలవరింత
ఎదుటకు రాగా ఏల ఈ మగత ॥ఏమండోయ్॥
ప్రేయసి నిద్దుర లేవుట
మోము చూపుట
పెళ్లికి తదుపరి ముచ్చట
ముందు జరుగుట చాలా అరుదుట
కమ్మనియోగం కలిసిరాగా
కన్నులుమూసి కపటమేలా
బిగువూ బింకం యింక మానండోయ్ ॥ఏమండోయ్॥
యువతులు దగ్గర చేరినచో
యువకులు ఉరకలు వేసెదరే
కోరిన కోమలి చేరగనే
కులుకులు అలుసైపోయినవా
గురకలుతీసే కుంభకర్ణా! నటన మానండోయ్ ॥ఏమండోయ్॥
నేనే వలచి రానిచో - చెంత లేనిచో
నిదురే రాదని అంటిరి
బ్రతుకనంటిరి - మోసగించిరి
నిద్రాదేవిని వీడకుంటే
వుద్యోగాలూ ఊడునండోయ్
ఇద్దరి ఆశలు యింక క్లోజండోయ్ ॥ఏమండోయ్॥

రచన: కొసరాజు గానం: మాధవపెద్ది సత్యం, స్వర్ణలత

బ్రహ్మానందం :ఏమిటి ఈ అవతారం? ఎందుకు ఈ సింగారం?
పాత రోజులు గుర్తొస్తున్నవి - వున్నది ఏదో వ్యవహారం
వర్ధనమ్మ :చాలును మీ పరిహాసం - ఈ సొగసంతా మీ కోసం
బ్రహ్మ :పౌడరు దెబ్బెను నీ కందం
బాగా వెయ్ వేలెడు మందం
తట్టెడు పూలు తలను పెట్టుకుని
తయారైతివా చిట్టి వర్ధనం
వర్ధ :చాలును మీ పరిహాసం - ఈ సొగసంతా మీ కోసం
వయసులోన నే ముదురుదాననా
వయ్యారానికి తగనిదాననా
వరసకాన్పులై వన్నె తగ్గినా
అందానికి నే తీసిపోదునా
బ్రహ్మ :ఏమిటి నా అపరాధం ఎందుకు ఈ అవతారం
దేవకన్య యిటు...ఓహో... దేవకన్య యిటు...
దిగివచ్చిందని భ్రమిసి పోదునా కలనైనా
మహంకాళి నా ప్రక్కనున్నదని
మరచిపోదునా ఎప్పుడైనా!
వర్ధ :చాలును మీ పరిహాసం ఈ సొగసంతా మీ కోసం
నీళ్లు కలపని పాలవంటిది
పిండి కలపని వెన్నవంటిది
నిఖారుసైనది నా మనసు
వూరూ వాడా యిది తెలుసు
బ్రహ్మ :ఏమిటి ఈ అవతారం?
ఎందుకు ఈ సింగారం?
వర్ధ :చాలును మీ పరిహాసం
ఈ సొగసంతా మీ కోసం

## నిర్మాణశాఖ

| | | |
|---|---|---|
| కథ | : | స్వర్గీయ డా॥పి.శ్రీదేవి, ఎం.బి.బి.ఎస్. |
| సినిమా అనుసరణ | : | యుద్ధనపూడి సులోచనారాణి, ఆదుర్తి సుబ్బారావు, కె.విశ్వనాథ్, బి.ఎస్.సి., డి.మధుసూదనరావు, బి.ఏ. |
| మాటలు | : | స్వర్గీయ టి.గోపిచంద్, బి.ఏ., బి.ఎల్. |
| ఛాయాగ్రహణ దర్శకుడు | : | పి.ఎస్.శెల్వరాజ్ |
| ఆపరేటివ్ కెమెరామన్ | : | 'పాచూ' |
| సంగీత దర్శకుడు | : | ఎస్.రాజేశ్వరరావు |
| కళా దర్శకుడు | : | జి.వి.సుబ్బారావు |
| నృత్యదర్శకులు | : | పసుమర్తి కృష్ణమూర్తి, పి.ఎస్.గోపాలకృష్ణన్ |
| ఎడిటింగ్ | : | టి.కృష్ణ, బి.ఏ. |
| అసోసియేట్ డైరెక్టర్ | : | కె.విశ్వనాథ్, బి.ఎస్.సి. |
| రీ-రికార్డింగ్ (బ్యాక్-గ్రౌండ్ మ్యూజిక్) | : | ఎ.కృష్ణన్, బి.ఏ. |
| రికార్డిస్టు | : | పి.కృష్ణంరాజు |
| మేకప్ | : | పోతరాజు, చౌదరి |
| స్టిల్స్ | : | ఎం.సత్యం (జైహింద్ స్టూడియోస్) 'పాచూ' |
| పబ్లిసిటీ | : | 'బాపూ', స్టూడియో శర్మ, టి.వి.ఎస్. |
| ప్రొడక్షన్ కంట్రోలర్ | : | డి.విశ్వనాథశర్మ, బి.కాం. (ఆనర్సు) |
| నిర్మాత | : | డి.మధుసూదనరావు, బి.ఏ., |
| దర్శకుడు | : | ఆదుర్తి సుబ్బారావు |
| స్టూడియో | : | శ్రీ సారథీ స్టూడియోస్, హైదరాబాద్. |


డి.మధుసూదనరావు


ఆదుర్తి సుబ్బారావు


ఎస్.రాజేశ్వరరావు


కొసరాజు


ఆరుద్ర


దాశరథి


సి.నారాయణరెడ్డి

## తారాగణం

| | | |
|---|---|---|
| శేఖర్ | : | నాగేశ్వరరావు |
| వెంకటరంగయ్య | : | గుమ్మడి |
| బ్రహ్మానందం | : | రేలంగి |
| ఆనంద్ | : | పద్మనాభం |
| ప్రభాకర్ | : | శోభన్‌బాబు |
| సుజాత | : | సావిత్రి |
| వసంత | : | కృష్ణకుమారి |
| లత | : | ఇ.వి.సరోజ |
| వర్ధనమ్మ | : | సూర్యకాంతం |
| మహాలక్ష్మి | : | పి.హేమలత |
| రఘునాథరావు | : | రామన్నపంతులు |
| బ్యాంకి ఏజెంటు | : | అల్లురామలింగయ్య |
| జాలయ్య | : | డి.వి.యస్.మూర్తి |
| డాక్టర్ | : | యస్.మురళీకృష్ణ |
| లత అన్న | : | బెనర్జీ |
| పోలయ్య | : | సీతారాం |
| పిన్ని | : | కొప్పరపు సరోజని |
| సుబ్బి | : | పార్వతి |

మరియు

కె.వి.రావు, మల్లాది, బొడ్డపాటి, ఆనందమోహన్, గ్రేస్, సరస్వతి, లక్ష్మి


ఘంటసాల


మాధవపెద్ది సత్యం


పి.బి.శ్రీనివాస్


పి.సుశీల


ఆశాలత కులకర్ణి


స్వర్ణలత

# 'హాసం'

## నిక్షిప్త చిత్రాలలో ఘంటసాల



సంగీత దర్శకుడు ఎస్.రాజేశ్వరరావుతో...



సంగీత దర్శకుడు కె.వి.మహదేవన్‌తో...



సంగీత దర్శకుడు
టి.చలపతిరావుతో...



గాయని
లతా మంగేష్కర్‌తో...



గాయకుడు టి.ఎం.సౌందర్ రాజన్, సంగీత దర్శకుడు టి.వి.రాజుతో...


అందమైన కళ్లే కాదు
వారసత్వంగా వచ్చేది.....
అపాయకరమైన వ్యాధులు కూడా...
హెపటైటిస్-బి వ్యాధి సోకిన తల్లి తనకు
తెలియకుండానే గర్భస్థ శిశువుకు కూడా
సంక్రమింపచేస్తుంది - ఆ కాలేయపు వ్యాధిని.
మీ డాక్టర్‌ను సంప్రదించండి.
సకాలంలో టీకా వేయించుకోండి. ధర
అందుబాటులో ఉండే అంతర్జాతీయ శ్రేణి
వ్యాక్సిన్ గురించి తెలుసుకోండి.
ప్రజాహితం కోరి విడుదల చేసినది
ప్రాణాంతక హెపటైటిస్-బి వ్యాధి నిరోధక టీకా
శాన్‌వాక్-బి తయారీదారులు:
శాంతా
బయో టెక్నిక్స్ (ప్రై)లి.
3వ ఫ్లోరు, శిరీన్ ఛాంబర్స్, బంజారాహిల్స్, హైదరాబాద్
ఫోన్స్: 040-23548507, 23608843, ఫ్యాక్స్: 040-23548476
హెపటైటిస్-బి
పసుపు వలయం
ప్రమాద సూచకం
Help. Stop HBV
Shanvac™ - B
r-DNA Hepatitis-B vaccine